# చతుర

జూన్ 1979

సంపుటి : 2 సంచిక : 5

## ఈ నెల సమగ్ర నవల

ఆరంభ యౌవన దశలోనే దుర్మార్గానికి గురై మానసికంగా దెబ్బతిని కఠినశిలగా కుంచించుకు పోయిన విద్యావంతురాలామె. పాషాణంలా ఘనీభవించిన ఆమెను కరిగించి మళ్ళీ మనుషుల్లో కలపాలని ప్రతిన పట్టాడతను. ఆ ప్రయత్నం ఫలించేనాటికి కరుగుతూన్న ఆ కఠినశిల అనురాగోద్వేగంతో తన వేపే ప్రవహిస్తోందని తెలిసి అప్రతిభుడై పోయాడు. అప్పటికే తనను పెనవేసుకు పోయిన మాధవీ లతను కార్చిచ్చు క్రూరాతి క్రూరంగా దహించి వేయటం చూసి తానే ఒక శిలగా మారిపోయే స్థితిలో పడ్డాడతను.

అప్పటికే అంధకారంలో ఉన్న కొందరికి దారి చూపి వెలుగులోకి తేగలిగిన అతనా స్థితిలో ఏం చేశాడు? ఏమయ్యాడు?

# జగన్నాటకం

## కొటూరి రవీంద్ర త్రివిక్రమ్

తేఖిని నుండి వెలువడిన తాజా నవల 'జగన్నాటకం' ఈనెల 'చతుర' సమగ్ర నవల,

## ఈ నెల ముఖపత్రం

తెలుగువారి అపూర్వ కళాసంపదకు నిలయం లేపాక్షి శిల్పాలలో గల ఒక ప్రత్యేకత అక్కడ జనపదుల జీవితాన్ని ప్రదర్శించే దృశ్యాలు అసంఖ్యాకంగా ఉండటం. చిత్రకళా సంపదకు నిలయమైన లేపాక్షి కేవలం ఈ కారణం వలననే శిల్ప కళకు కూడా విఖ్యాతమైంది. అక్కడగల అసంఖ్యాక శిల్పాలలో పల్లె పడుచుల ఆట పాటలను ప్రదర్శించే ఒక శిల్పానికి వర్ణకృతి ఈనెల 'చతుర' ముఖపత్రం.

## రెండవ కవరు

భారత సరిహద్దులలోనే ఉన్న నేపాల్ రాజధాని ఖాట్మండ్ లోని సుప్రసిద్ధమైన పశుపతి ఆలయం.

## మూడవ కవరు

ముస్లిం సంస్కృతికి ఒకనాడు ప్రధాన కేంద్రంగా వెలుగొందిన సుప్రసిద్ధ నగరం లక్నోలోని ముస్లిం మందిరం 'చారా ఇమాంబారా'


# చతుర

ఈనాడు కాంపౌండ్

సోమాజిగూడ, హైదరాబాద్–500 004

# మళ్ళీ మీ రోజువారి పనులు మామూలుగా చేసుకోవాలని ఆత్రుతగా ఉందా మీకు?

## గ్లాక్సోస్-డి® అలసటను ఎదుర్కొనేందుకు వెంటనే శక్తిని సమకూరుస్తుంది.




dCA/GL/54/TL/Rev

# రచయితలకు సూచనలు

* జాతి జీవిత చిత్రాన్ని వివిధ కోణాలనుండి ప్రతిబింబించే సమగ్ర నవలలను 'చతుర' ఆహ్వానిస్తున్నది. నవల 'చతుర'లో అచ్చులో 100 పేజీలకు సరిపడేదిగా ఉండాలి. 'చతుర'లో అచ్చులో పేజీకి సుమారుగా 260 పదాలు వస్తుంటాయి. ఈ లెక్క ప్రకారం సరిచూసుకున్న తర్వాతనే రచనలు పంపటం మంచిది.

* ప్రస్తుతం వివిధ మాసపత్రికలు వెలువరిస్తున్న 100 - 112 పేజీల పాకెట్ సైజు నవలానుబంధాలలో ప్రచురితమవుతూన్న నవలికలు చతురలో అచ్చులో 60-70 పేజీలు మాత్రమే అవుతాయి. రచయితలు ఈ తేడా గమనించాలి.

* *పై పరిమితులను దృష్టిలో ఉంచుకుని 'చతుర' కొరకై ప్రత్యేకంగా వ్రాసి పంపిన నవలలు మాత్రమే పరిశీలింపబడుతాయి.*

* నవలను ప్రచురించే సమయంలో అవసరాన్ని బట్టి కొంతవరకూ కుదించవలసివచ్చే పక్షంలో అందుకు అభ్యంతరం లేనివారే నవలలను పంపాలి.

* అనువాద నవలలు పంపదలిచేవారు మూల రచయిత నుండి ముందే అనుమతి తీసుకుని అనుమతి పత్రంతోసహా నవల పంపాలి.

* ప్రచురణకై ఎన్నిక కాని నవలలను తిప్పిపంపేందుకై నవలతో పాటే తగు పోస్టేజీ తప్పని సరిగా జతపరచాలి. అలా జతపరచని పక్షంలోనూ, నవలలు పోస్టులోగానీ ఇతరత్రాగానీ పోయినా మా బాధ్యత ఉండదు. తర్వాత ఉత్తరాలు వ్రాయటం వల్ల ప్రయోజనం వుండదు.

* 'చతుర'లో ప్రచురించే నవలలకు పారితోషికం రచనను బట్టి రు. 1,000 నుండి రు. 2,000 వరకూ ఉండగలదు. ఈ విషయంలో సంపాదకులదే తుదినిర్ణయం.

**చతుర**

ఈనాడు కాంపౌండ్ సోమాజిగూడ, హైదరాబాద్-500 004

# విపులాంచ పృథ్వీ..!



లండన్, పారిస్, రోమ్, న్యూయార్క్, ఆగ్రా,
పెకింగ్, సింగపూర్, మాస్కో...ఈ సువిశాల
విశ్వంలో ఇవి కొన్ని ముఖ్య ప్రాంతాలు మాత్రమే.
వీటిని గురించే మనకు అంతగా తెలియదు. నిజానికి మన
చుట్టూరా ఉన్న బెంగాలీ, అస్సామీ, రాజస్థానీ, గుజరాతీ,
సింధీ, కాశ్మీరీ, మరాఠీ మున్నగు భాషా ప్రాంతాలవారి సంగతలా
ఉంచి, పొరుగునే వున్న తమిళ, మలయాళ, కన్నడ భాషా ప్రాంతాల
వారిని గురించి కూడా మనకు తెలిసింది చాలా తక్కువ. వీరందరినీ, ఈ
ప్రాంతాలన్నిటినీ మీకు అత్యంత సన్నిహితం చేసే అపూర్వ సాధనం
'విపుల'. నెలనెలా 15 వరకూ విభిన్న భాషల అత్యుత్తమ కథలను తేట
తెలుగులో కేవలం 125 పైసలకే అందజేస్తోంది విపుల.
కథలు మాత్రమేగాక అదనంగా కడుపుబ్బ నవ్వించే జోకులు,
కార్టూన్లు, విచిత్ర విశ్వ విజ్ఞానం 'విపుల' అదనపు ఆకర్షణలు.
కంటికి, మనసుకు హాయిగొలిపే రంగుల ఆఫ్ సెట్
ముద్రణ 'విపుల' మరో ప్రత్యేకత
ప్రతినెలా 1వ తేదీకి వెలువడే విశ్వకథా విపంచి

# విపుల

**132 పేజీలు...125 పైసలే**

# జలనిధి

ప్రస్తుతం డొమినికన్ రిపబ్లిక్ అనబడే ప్రాంత సమీపంలో 337 ఏళ్ళ క్రితం పెద్దమొత్తంలో వెండి బంగారాలు మోసుకెళుతున్న ఓ పెద్ద ఓడ తునాతున కలైపోయింది. 1978 చివర్లో వెబ్బర్ అనే అతను మునిగిపోయిన ఆ సంపదను కనుగొని కొంత వెలికి తీశాడు. ఇంత వరకు జరిగిన సముద్ర గర్భనిధి పరిశోధనల్లో ఇది ప్రముఖమైనది.

వెబ్బర్ 16 ఏళ్ళ ప్రాయం నుంచీ జీవనసమరంలో ఎన్నో ధక్కా-మొక్కీలు




తిన్నవాడు. జలాంతర్భాగ సంపదలను బైటికి తీయడం ఎలా ?' అనే విషయంపై 'ట్రెజర్ ఐలాండ్' వంటి అనేక పుస్తకాలను విపరీతంగా చదివేవాడు. జీవితంలో ఎప్పటికైనా తనూ అలాంటి సాహస కార్యాలు చేయాలని కలలు కంటూండేవాడు. అతని కల ఇలా నెరవేరింది.

వెబ్బర్, అతని అనుచరులూ సముద్రగర్భం నుండి తెచ్చిన విలువైన వస్తువుల్ని పరిశీలించి, అవి ఆనాటి ఓడలోనివేనని నిర్ధారించి డొమినికన్ రిపబ్లిక్ ప్రభుత్వం వెబ్బర్‌ను పరిశోధనకు ప్రోత్సహించింది.

చికాగోలో ఓ ధనవంతుని సహాయంతో వెబ్బర్ 'సీక్వెస్ట్ ఇంటర్నేషనల్' అనే సంస్థ స్థాపించాడు. 1977 లో కొందరు అనుచరులతో వెళ్ళి ఓడ మునిగిన చోట ఐదునెలల పాటు పరిశోధన జరిపాడు. 1978లో 16 మంది అనుచరులను, శక్తివంతమైన పరికరాలను వెంట తీసుకుని నీటిలో చాలా లోతుకు వెళ్ళి అట్టడుగున వున్న వెండి, బంగారాలను, పగడాలను వెలికి తీసుకొచ్చాడు.

ఆ సంపద విలువ 40 వేల మిలియన్ డాలర్లుంటుందని అంచనా. మొత్తం నిధి విలువ ఊహాతీతం అంటాడు వెబ్బర్.

దొరికిన సంపదలో సగం ప్రభుత్వం తీసుకుని మిగతా వాటాల వారిగా వెబ్బర్ అనుచరులకూ, అధికశాతం వెబ్బర్‌కూ అందజేసింది. "సంపద పట్ల నాకు వ్యామోహం లేదు, శతాబ్దాలనాటి అపురూప సంపదను పరిశోధించి వెలికి తీయటమే నా జీవితాశయం" అంటాడు వెబ్బర్.

కోటీశ్వరుల ఇనప్పెట్టెల్లో, నేలమాళిగల్లో మూలిగే నల్లధనాన్ని పరిశోధించి వెలికి తీసేందుకు వెబ్బర్ లాంటి వారెవరన్నా ముందుకు వస్తారా ?

# ఆటగాళ్ళ భార్యలు

ప్రముఖ క్రికెట్ ఆటగాళ్ళ గురించీ, వారెన్ని టెస్టులు ఆడిందీ, ఎన్ని సెంచరీలు కొట్టిందీ, అత్యధిక స్కోరెంత వగైరా వివరాలన్నీ తెలిసినంతగా ఆ క్రీడాకారుల భార్యలను గురించి మాత్రం అభిమానులకు తెలిసింది చాలా తక్కువ.

క్రికెట్ చరిత్రలో కొత్త రికార్డులు సృష్టించిన సునీల్ గవాస్కర్‌కు ఆరు ఏళ్ళ క్రితం ఢిల్లీలో ఒకానొక టెస్ట్ మాచ్ లో మార్షనిల్ అనే పోస్టు గ్రాడ్యుయేట్‌తో పరిచయమయింది. రెండు సంవత్సరాలపాటు వారిద్దరూ ప్రేమ వాహినిలో తేలియాడి, తర్వాత తీరిగ్గా పెళ్ళి చేసుకున్నారు. గవాస్కర్ ఎక్కడ ఏ టెస్ట్ ఆడినా ఆవిడ తప్పని సరిగా అక్కడ వుండాల్సిందే! వారి ముద్దుల రోషన్ కూడా అడపాదడపా బాట్ పుచ్చుకుని తండ్రిని అనుకరిస్తూం టాడు. దేశ విదేశాల్లో 'సన్నీ'కి వేల సంఖ్యలో స్త్రీ అభిమానులున్నందుకు మార్షనిల్ అసూయపడదు. సరి కదా, అతని అర్థాంగి అయినందుకు గర్వపడు తుంటుంది.

మరో క్రికెట్ యోధుడు గైక్వాడ్ భార్యామణి జ్యోతి ఎమ్.కాం. పట్టభద్రు రాలే కాక స్వర్ణ పతక విజేత కూడా! కాలేజీ రోజుల్లో వీరిద్దరూ సహ విద్యార్థులు. పెళ్ళికి ముందు క్రికెట్ ఆట అంటే ఏమిటో సరిగ్గా తెలియని జ్యోతి ఇప్పుడు టెస్టు మ్యాచ్‌లకు వెళ్తోంది. "నేను అన్షూను వ్యక్తిగా ప్రేమించాను. గానీ, క్రికెట్ ఆటగాడుగా మాత్రం కాదు" అంటుందామె. చదువూ, సంస్కారం అన్నీ వున్న ఈమె గైక్వాడ్ అర్థాంగి అయినందుకు గర్వపడటమే కాక, అతిథులను నిండు మనసుతో ఆద రించటంలో సంతృప్తిని పొందుతుంది.

. ఇక విశ్వనాథ్ ప్రాణేశ్వరి కవిత గవాస్కర్‌కి ముద్దుల చెల్లెలు. ఆర్ట్స విద్యార్థిని.

అయితే కవిత తన ఎనిమిదో ఏట నుంచే విశ్వనాథ్‌ను అభిమానించేది. అతని ఆట పట్ల వుండే ఆకర్షణే క్రమేణా ఆవిడ పద్దెనిమిదో ఏట అతని పట్ల ప్రేమగా రూపుదిద్దుకుని పెళ్ళికి దారి తీసింది. "ఇంట్లో వున్నప్పుడు 'విష్' క్రికెట్



గురించి ఎప్పుడూ మాట్లాడడు" అంటుంది కవిత. భార్య పుట్టిన రోజుని విష్ మర్చిపోయినా, కవిత మాత్రం భర్త పుట్టిన రోజుని కలలో కూడా మర్చిపోదట!

## కరెంటు శ్మశానాలు

విద్యుచ్ఛక్తితో శవ దహనం చేసే 'శ్మశానాలు' త్వరలో మనదేశంలోనూ విస్తరించేలా ఉన్నాయి. బెంగుళూరులోనే కాక, యిప్పుడీ పద్ధతిని మద్రాసులో కూడా ప్రవేశ పెట్టారు. 1933లో మొదటి సారిగా స్విట్జర్లాండ్‌లో ప్రారంభమైన ఈ 'ఎలక్ట్రిక్ శ్మశానా'లు కాలక్రమేణా ప్రపంచ వ్యాప్తంగా అభివృద్ధి చెందాయి.

ఈ పద్ధతి వల్ల శ్మశానాల్లో చోటు



లేదన్న సమస్యే ఉండదు.

భూమికి 9 అంగుళాల ఎత్తులో వుండే ట్రాలీ సహాయంతో శవాన్ని ముందుగా ఒక ఉక్కు ఛాంబర్‌లోకి పంపిస్తారు. శవం అందులో సరిగ్గా అమరిన తరువాత తలుపు దానంతటదే మూసుకుపోతుంది. ఆ తరువాత 500 డిగ్రీల సెంటిగ్రేడ్ నుంచీ వెయ్యి డిగ్రీల సెంటిగ్రేడ్ వరకూ ఉష్ణోగ్రత కలిగిన వేడి గాలుల్ని ఆ ఛాంబర్‌లోకి ప్రసరింప జేస్తారు. అంతే, ముప్పావు గంటలో శవం బూడిదగా మారి పోతుంది.

కట్టెలూ, కిరసనాయిలూ వగైరా సరంజామా లేకుండానే, అతి స్వల్ప వ్యవధిలో, స్వల్ప ఖర్చుతో శవాల్ని యిక్కడ సునాయాసంగా దహనం చేసే య్యొచ్చు. ఛాంబర్ క్రింది భాగంలో వుండే జల్లెడ ద్వారా రాలిన చితాభస్మాన్ని ఏ గంగలోనో, గోదావరిలోనో కలపటానికి తీసుకోవటంతో మన బాధ్యత కూడా తీరిపోతుంది.

## పైలట్ దెయ్యం

చాలాకాలంనుండి నిరుపయోగంగా మూసేసిన యార్క్‌షైర్‌లోని రాయల్ వైమానిక శిక్షణా కార్యాలయాన్ని మళ్ళీ తెరిచారు. రెండవ ప్రపంచ యుద్ధం కాలంనాటి ఓ పైలట్ దెయ్యంగా మారి అక్కడ తిరుగుతూంటాడని పుకారు. అందుకే అది ఇంతకాలంగా మూతపడి వుంది. ఆ దెయ్యంగారిని చూద్దామని విమాన శిక్షణాకేంద్రంలో ప్రతి ఒక్కరూ ఆత్రుతతో వున్నారు.

రెండవ ప్రపంచ యుద్ధ కాలంలో ఓ రాత్రి పోలెండుకు చెందిన ఓ పైలెట్ అతని సిబ్బందితో దాడి ముగించుకుని తిరిగి వస్తుండగా వారి 'వెల్లింగ్టన్'బాంబర్ విమానం జర్మనీ వాళ్ళ దాడికి గురైంది. పైలెట్‌కి బాగా దెబ్బలు తగిలాయి. మిగతా సిబ్బంది అంతా మరణించారు. కొద్దిసేపటి తర్వాత పైలెట్ పుంజుకుని కొంతమేర పాడైన ఆ విమానాన్ని గమ్య

స్థానం చేర్చేందుకు ప్రయత్నించాడు. కానీ రన్‌వే ఇంకా 500 గజాలుండనగా విమానం అక్కడి చిత్తడి నేలలో దిగి నిమిషాల్లో మొత్తం విమానం బురదలోకి కూరుకు పోయింది.

ఆ తర్వాత యుద్ధం ముగిసిన దాదాపు సంవత్సరానికి బురదగొట్టుకు పోయిన బట్టలతో ఓ వ్యక్తి తమ దగ్గరకి వచ్చి రోగుల వార్డుకి, ఆపరేషన్ థియేటర్‌కి, ఆఫీసర్ల మెస్సుకి దారి అడిగాడనీ, తర్వాత అతను చీకట్లో అదృశ్యమైపోయాడనీ- అక్కడి సైనికులూ, మిగతా సిబ్బందీ



అధికారులతో చెప్పారు. ఆ ప్రాంతంవారికి ఆ పైలెట్ దెయ్యం అప్పుడప్పుడు కనిపించి అదృశ్యమవుతూ వుండేదట.

1970 లో ఓ కంపెనీ పరిశ్రమ కోసం రన్‌వే దగ్గరి చితడి నేలను ఎండబెట్టి, గడ్డీ అదీ తీసే త్రవ్వుతుంటే 30 అడుగుల లోతున వున్న విల్లింగ్టన్ విమానం కనిపించిందట. గుర్తుపట్టలేకుండా వున్న విమాన సిబ్బంది శవాలను లింక్‌హోమ్ చర్చి శ్మశానవాటికలో పాతిపెట్టారు. అప్పటినుండే ఆ పైలెట్ దెయ్యం జనానికి కనిపించడం మానేసిందట. కానీ వైమానిక శిక్షణాకేంద్రంలోని వారు మాత్రం ఎప్పటికైనా ఆ దెయ్యం కనిపించకపోతుందా అన్న ఆశతో వున్నారు.

# నవలామణి

పడవకార్లు, పొడవు హీరోలు, గిల్లికజ్జాలు పెట్టుకునే చిలిపి హీరోయిన్లు, అందమైన శృంగార సన్నివేశాలు - ఇవన్నీ వెరసి బార్బరా కార్ట్‌లాండ్ నవలలు! నాడూ, నేడూ యువతను సుందర స్వప్నలోకాల్లో విహరింపజేసే, ఈ బ్రిటిష్ రచయిత్రి గత 50 సంవత్సరాల్లో 250 పుస్తకాలు రాసింది. ఒక్క కిందటి ఏడాదిలోనే 24 నవలలు రాసిన బార్బరా నవలలన్నీ ప్రేమతో మొదలై పెళ్ళితో పరిసమాప్తమవుతాయి. అందుకే ఈవిడ నవలలు మార్కెట్‌లో వేడి వేడి పకోడీల్లా అమ్ముడవుతూంటాయి.

"నా నవలల్లో కథాంశం ఎప్పుడూ ఒకే మాదిరిగా వుంటుందను కోవటం నిజం కాదు. నేను రాసే ప్రతి నవల్లోనూ హీరోయిన్ భిన్న పరిస్థితుల్లో పెళ్ళి చేసుకుంటుంది. ఓ నవల రాసే ముందు చరిత్రకు సంబంధించిన పుస్తకాలు ఓ 30 వరకూ చదువుతాను. అమెరికన్ బూతు పుస్తకాల్లో కంటే నా పుస్తకాల్లో శృంగారం పాలు తక్కువే. అయినా నా నవలలు ఎంతో ప్రజాదరణ పొందాయి" అంటుంది బార్బరా సగర్వంగా. ఇప్పటికి ఈవిడ నవలలు పది కోట్ల కాపీలు అమ్ముడై రికార్డు సృష్టించాయి.

ఈ రచయిత్రి సోఫా మీద జారగిల బడి, రోజుకు ఏడువేల పదాలను డిక్టేట్ చేస్తుంది. సెక్రటరీ వాటిని టైప్ చేసి,



భాషాదోషాల్ని, వ్యాకరణ దోషాల్ని ఓ స్కూల్ టీచర్‌తో దిద్దించి, పబ్లిషర్ కోసం సిద్ధం చేసి వుంచుతుంది. తాను రాసిన ప్రతీ నవల విడి ప్రతి, ఒక పౌండుకు మించి ధర వుండకూడదనీ, 50వేల పదాల లోపునే నవలని పూర్తి చేయాలనీ ఆవిడ నియమం పెట్టుకుంది.

అద్భుతమైన ప్రేమ కథలతో పాఠక లోకాన్ని విశేషంగా ఉర్రూతలూగిస్తున్న ఈ రచయిత్రి వయస్సు 77 ఏళ్ళు.

# సమ్మెలేని జనం

మనవాళ్ళకు సమ్మెలు చేయటంలో వున్న ఉత్సాహం మరెందులోనూ వుండదు. అర్థంపర్థంలేని ప్రతి చిన్న విషయానికీ సమ్మెలు చేయటంలో మనవారు ఉద్దండులు.

సమ్మెల్లో మనకున్న అపారమైన అనుభవాన్ని చూసి స్విట్జర్లాండ్ ప్రజలు కళ్లు తేలేయాల్సిందే! వాళ్ళల్లో చాలామందికి అసలు సమ్మె అంటే ఏమిటో, ఎందుకు చేస్తారో, ఎలా చేస్తారో కూడా తెలియదట!

ఆ దేశంలో 1977లో జరిగిన తొమ్మిది సమ్మెల్లోనూ అక్కడి 27 లక్షల మంది పనివాళ్ళల్లో కేవలం 1380 మంది మాత్రమే పాల్గొన్నారంటే మన సమ్మె శ్వరులు నమ్మరు గాక నమ్మరు!

స్విట్జర్లాండ్‌లో వున్న దాదాపు అన్ని వర్కర్స్ యూనియన్లూ ముందుగానే తమ తమ యజమానులతో ఒక ఒప్పందం కుదుర్చుకుంటాయి. ఆ ఒప్పందం ప్రకారం పనివాళ్ళు తమ కేమైనా సమస్యలు ఎదురైనప్పుడు, యాజమాన్యంతో సంప్రదింపులు జరిపి పరిష్కరించుకోవాలే గానీ సమ్మెల ద్వారా కాదు.



అసలు వాళ్ళల్లో మూడింట రెండు వంతుల మంది 'నో స్ట్రైక్' ఒప్పందం ముందే కుదుర్చుకుని అందుకు అను

గుణంగా ప్రవర్తిస్తారు.

మొదటిసారిగా 1935లో ఇలాంటి ఒప్పందంపై ఒక గడియారాల ఫాక్టరీలో సంతకాలు జరిగాయి. యజమానులకూ, కార్మికులకూ మధ్య చక్కని అవగాహన వుంటే యిరువర్గాలు సుఖపడవచ్చని వారి నమ్మకం. అవకాశం దొరికితే యజమాని పీలక పుచ్చుకోవటానికి ఇక్కడ మనం ఎప్పుడూ తయారుగానే వుంటాం. కానీ వాళ్ళు అవకాశం వచ్చినా రెండు శాతంకి మించి జీతం పెంచమని కూడా అడగరట. పాపం! ఈ బుద్ధావతారాలతో పోల్చి చూస్తే మనం చాలా నయం గదూ ?

# ఖర్చు మనిషి

సాధారణంగా స్త్రీలు బాగా ఆలోచించి, బహు పొదుపుగా ఖర్చు చేస్తారని అంటారు. కానీ అది అందరి విషయం లోనూ నిజం కాదని శ్రీమతి రిట్ బేజేరే గార్డ్ ఋజువు చేసింది. డెన్మార్క్ దేశ విద్యాశాఖామాత్యురాలయిన ఈవిడ వెనకా ముందూ చూడకుండా డబ్బును విపరీతంగా ఖర్చు పెట్టినందుకు గాను, మంత్రి పదవిని వదులుకోవాల్సి వచ్చింది.

డెన్మార్క్‌లోని 'ప్రభుత్వ పక్ష పార్టీ' నాయకురాలుగా శ్రీమతి రిట్ శక్తి సామర్థ్యాలు అసామాన్యమైనవి. విద్యా శాఖామాత్యురాలుగా ఈవిడ తన బాధ్యతలను సమర్థవంతంగానే నిర్వహించిందని చెప్పొచ్చు. మార్క్సిజమ్ గురించి ఆమెకు మంచి అవగాహన వున్నా ఆ సూత్రాలను మాత్రం ఆచరణలో పెట్టేది కాదు.

గత ఏడాది పారిస్‌లో జరిగిన 'యునెస్కో' సమావేశానికి హాజరయి శ్రీమతి రిట్ కేవలం 13 రోజుల్లో 5,500 పౌండ్లు ఖర్చు పెట్టి, అక్కడున్నన్నాళ్ళూ మహారాణిలా గడిపేసింది.



శ్రీమతి రిట్ చైనా పర్యటనలో వుండగా, ఓ డెన్మార్క్ వార్తాపత్రిక ఆమె ఆడంబర జీవిత విధానాన్ని గురించి ప్రచురించేసరికి, ప్రజల్లో కల్లోలం చెలరేగింది. ప్రధాన మంత్రి ఆఘమేఘాల మీద ఆమెను స్వదేశానికి రప్పించి, "పదవికి రాజీనామా చేస్తావా? లేక ఖర్చు పెట్టిన మూడొంతుల మొత్తంలో ఒక వంతు ఖజానాకు జమ కడతావా?" అని అడిగాడు. శ్రీమతి రిట్ రాజీనామాకే సిద్ధపడింది.

'యునెస్కో' కార్యవర్గంలోకి ఎన్నిక అవ్వాలన్న ఉద్దేశ్యంతో తాను కొద్దిగా ఎక్కువగానే ఖర్చు పెట్టవలసి వచ్చింది అనేది శ్రీమతి రిట్. మంత్రి పదవి లేకున్నా ప్రజల్లో ఈమెకున్న పలుకుబడి చెక్కు చెదరలేదట !

# సాగరభవంతి

'సముద్రం చూడ్డానికెంతో బావుంటుంది. అలాంటిది ఆ సముద్రం మధ్యలో ఓ ఇల్లు కట్టుకుని వుంటే యింకెంత ఆహ్లాదంగా ఉంటుందో కదా!' అని సింగపూర్ దగ్గర్లో సముద్రం మధ్యలో ఓ పెద్ద భవనం కట్టి అద్దెల కిచ్చారట! ఈ అపూర్వ భవంతిలో 17 అంతస్థులూ, ఒక్కో అంతస్థులో 13 కుటుంబాలకు సరిపడే వసతీ వున్నాయి.

ఈ సాగర భవనంలో ఇళ్ళన్నీ ఆధునిక సదుపాయాలతో సౌకర్యంగా వుంటాయి. మూడు లిఫ్టులు ఎప్పుడూ పని చేస్తూనే వుంటాయి.

ఈ 'మరీన్ ఫర్డ్' గదుల గోడల కుండే కంతల్లోంచే, యింట్లోని చెత్తా చెదారమంతా పారేయాలి గానీ, డస్ట్ బిన్నులంటూ వేరే వుండవు. కొత్తలో కొందరు బాల గడుగ్గాయిలు ఆ కంత ల్లోంచి గ్లాసులు, స్పూన్‌లు వంటివి, అమితోత్సాహంతో సముద్రుడికి నైవేద్యం చేసి ఆనందిస్తూండేవారు.

ఆ సాగర భవనపు ప్రతి బాల్కనీ గోడకూ వుండే రంధ్రాలలో వాసాలను దూర్చి, వాటికి మళ్ళీ తాళ్ళను కట్టి, బట్టలు ఆరేసుకోవాలి. బరువెక్కువయి వాసం పడిపోయిందా, ఇక అంతే సంగతులు! అవి అలా సాగరార్పణం అని ఊరుకోవాల్సిందే! అయితేనేం? సముద్రపు అలల మీద తల్లన మెల్లన సాగిపోయే పడవల్నీ, ఓడల్నీ, సూర్యకిరణాలలో మెరిసిపోతూ మిడిసిపడే చేప పిల్లల్నీ...యిలా మరెన్నో మనోహర దృశ్యాల్నీ చూస్తూ, అక్కడ అద్దెకు దిగే




అదృష్టవంతులు ప్రపంచంలో మరెవరూ పొందలేని ఒక మహత్తర అనుభూతిని పొందవచ్చు గదా!

# కోటిరిగో పాటుడు

మద్రాసులోని కస్టమ్స్ డిపార్ట్‌మెంట్ ఉన్నతాధికారి కోదండపాలన్‌కి ఓ రోజున ఫలానా యింటినుంచి బంగారం దొంగ రవాణా అవుతోందని తెలిసి, హుటాహుటిన ఆ యింటికి బయల్దేరి వెళితే అక్కడ అలాంటి వ్యవహారం ఏదీ కనిపించలేదు. అంతా ప్రశాంతంగా వుంది. అయినా, తన పోలీసు బుద్ధిని పోనిచ్చుకోక కోదండపాలన్ ఆయింటిపై నిఘా వేసి వుంచాడు. మూడో రోజున ఆ యింటికి యిద్దరు వ్యక్తులు మోటారు సైకిల్ మీద వస్తుండగా, అనుమానించి కోదండపాలన్ వాళ్ళని అరెస్ట్ చేసి లోప

లికి తీసుకెళ్ళాడు.

పోలీసు బలగాన్ని చూస్తూనే, ఆ ఇంట్లో వున్న కొందరు వ్యక్తులు వాళ్ళ దృష్టిని ఏమార్చేందుకు డాబామీద నుంచి



పక్కింటి మేడలోకి సూట్ కేసులు విసిరేయసాగారు. సినిమాల్లోలా పదిమంది పహిల్వాన్‌లు తొడలు చరుచుకుంటూ వచ్చి వాళ్ళను చుట్టుముట్టారు. ఈ హఠాత్పరిణామానికి కోదండపాలన్ ఆశ్చర్యపోయినా, వెంటనే ధైర్యం తెచ్చుకుని "ఏడుకొండలూ....వెంకటస్వామీ...వన్ నాట్ థ్రూ..." అంటూ నోటికొచ్చిన కొన్ని పోలీసు పేర్లు పిలిచాడు. కండబలమే గానీ బుద్ధిబలం లేని ఆ పహిల్వాన్ ప్రబుద్ధులు, బయటింకా ఎన్ని ఎర్ర టోపీలు ఉన్నాయోనని బెంబేలుపడి చేతులెత్తేశారు. కోదండపాలన్ వారి మట్టిబుర్రలకు తనలో తానే నవ్వుకుంటూ, 2 లక్షల విలువైన 150 కిలోల నల్లమందునూ, ఇంకో 2 లక్షలు విలువచేసే అరకిలో బంగారపు కడ్డీలనూ స్వాధీనం చేసుకున్నాడు.

కోదండపాలన్ ఇంతవరకూ నేరాలకూ, స్మగ్లింగ్‌లకూ సంబంధించిన 156 కేసులను అతి చాకచక్యంగా పరిష్కరించి కోటి రూపాయల విలువ చేసే దొంగ రవాణా సరుకును పట్టుకున్నాడు అందుకని అందరూ ఆయన్ని 'కోటి గోపాలన్' అని పిలుస్తారట !

# యువమేధావి

కాలేజీ లేబొరేటరీల వాళ్ళు వేలకు వేలు పోసి, మైక్రోస్కోపుల్ని కొనటానికి పడుతున్న అష్టకష్టాలను చూసి, విజయప్రభు అనే ఓ బెంగుళూరు విద్యార్థి మూడంటే మూడు చెక్క ముక్కలూ, ఒక పెన్ టార్చి, ఒక బిరడా మాత్రమే ఉపయోగించి మైక్రోస్కోప్‌ని రూపొందించాడు. ఇతను తయారు చేసిన ఈ చెక్క భూతద్దాలు ఒక వస్తువుని, అంతకు వంద రెట్లు పెద్దదిగా చేసి చూపుతున్నాయిట! హేట్స్ ఆఫ్ టు ద కుర్ర మేధావి!

అంతేకాదు, ఇతను కనుగొన్న క్రొత్త రకం ట్రాఫిక్ కంట్రోల్ పద్ధతిని త్వరలో అమలు పర్చటానికి అధికారులు ఆలోచిస్తున్నారు. సెంట్ జోసఫ్ కాలేజీ విద్యార్థిఅయినవిజయ్‌ప్రభు బెంగుళూరులో జరిగిన ఒక మెడికల్ ఎగ్జిబిషన్‌లో కాన్సర్ వ్యాధికి సంబంధించిన చార్ట్ ఒకటి రూపొందించి, విదేశీ ప్రముఖుల ప్రశంసల్ని కూడా పొందాడు. పిన్న వయసులోనే ఇంత పెద్ద పనులకు పూనుకుని శాస్త్రవిజ్ఞాన రంగంలో సంచలనాన్ని సృష్టిస్తున్న ఇతని జీవితాశయం-కాన్సర్ వ్యాధికి మందు కనిపెట్టటమేనట !

"విశాలాక్షి గారంటే మీరే నను కుంటాను..." ఎవరిదో గొంతువిని తలెత్తి చూసింది విశాలాక్షి.

"నమస్తే! నా పేరు భానుమూర్తి. మాధవరావ్‌గారి రిలీవర్‌ని..." చేతులు జోడించి నమస్కరిస్తూ చొరవగా లోపలికి ప్రవేశించాడతను.

విశాలాక్షి ఎలాంటి కుతూహలము, ఆసక్తి కనబరచకుండా, కొద్దిగా తలా డించి, పెడసరంగా "ఐసీ..." అని మళ్ళీ చేతిలో ఉన్న పుస్తకం చదవ సాగింది.

భానుమూర్తి ఆమె ధోరణికి విస్మ యం చెందాడు.

అంతలోనే – వైస్ ప్రిన్సిపాల్ కొద్ది నిమిషాల క్రితం చేసిన హెచ్చరిక అతని చెవుల్లో మార్మోగింది.

'ఆవిడసలే సీరియస్ మనిషి... ఎక్కువ ప్రశ్నలు వెయ్యకండి..' ఆ టైములో పుసకం చదువుకుంటూ కూర్చునే సీరియస్ మనిషి పేరు విశాలాక్షి అని మొదటి చూపులోనే గ్రహించాడు భానుమూర్తి.

వైస్ ప్రిన్సిపాల్ హెచ్చరికకి అర్థం ఏమిటి ?

అంటే – ఈవిడ యిప్పటికే 'ఫైర్ బ్రాండ్' అని ముద్రవేయించు కుందా? మనిషిని చూస్తే మరీ చిన్న పిల్లేం కాదు!

మరి పొగరుబోతు కాలేజీ స్టూడెంట్ లా ఈ నిర్లక్ష్య ధోరణి ఏమిటి ? తను ఈ డిపార్ట్‌మెంట్ హెడ్‌గా అడుగు పెట్టిన ఈ క్షణంలో తన సబార్డినేట్ నుండీ పొందే గౌరవం ఇదా ?

ఆలోచనల మధ్య కొట్టు మిట్టాడు తూనే, 'హెడ్ఆఫ్ ది డిపార్ట్‌మెంట్' అని బోర్డున్న టేబిల్ వెనక కుర్చీలో కూర్చు న్నాడు భానుమూర్తి.

ఒకసారి నాలుగు వైపులా పరికించాడు.

టేబిల్స్ మీద పుస్తకాలు, పేపర్లు అడ్డదిడ్డంగా పడి ఉన్నాయి. ఆష్‌ట్రే ల్లోంచి సిగరెట్ల గొట్టు కొడుతోంది. ఒక పక్కగా స్టీలు బీరువాలున్నాయి. గోడల మీద వేలాడుతున్న క్యాలెండర్లు చూసి ఉలిక్కిపడ్డాడు. బ్రూస్‌లీ ఒకపక్క, సోఫియాలారెన్ అర్ధనగ్న భంగిమ మరో పక్క! ఫ్యాను గాలి కటు, ఇటు కదులుతున్నాయవి.

మళ్ళీ అతని చూపులు విశాలాక్షి వైపు మళ్ళాయి.

ఆమె టేబిల్ మిగతావాటికి దూరంగా ఉంది. ఆమె కూర్చున్న తీరు చూస్తుంటే– 'ఒకళ్ళతో నాకేం నిమిత్తం' అన్న భావం స్ఫురింప జేస్తోంది. పేరుకి తగ్గట్టు కళ్ళు విశాలమే కానీ, ఆ చూపుల్లో ఎక్కడా సౌకుమార్యం తొంగి చూట్టం లేదు. ఆ చూపులు ఎదుటి వాళ్ళ మనసుల్లోకి సూదులు దింపేటంత వాడిగా ఉన్నాయి.

భానుమూర్తి ఆమె మెడకేసి పరిశీ లనగా చూశాడు.

పెళ్ళయిన గుర్తుల్లేవు !

* * *

"స్కూటర్ మీద వెళ్దాం వస్తారా ?" బయటకు వెళ్ళబోతూ అడిగేడు రాజు.

"ఒక్క నిమిషం–" అని పేపర్లు వగయిరా సర్ది, అతనితో పాటు బయ టకు నడిచాడు భానుమూర్తి.

వాళ్ళని చూసి స్టూడెంట్లు తమలో తాము మాట్లాడు కోవటం విన్పించింది ఇద్దరికీ.

"సైకాలజీ డిపార్ట్‌మెంట్ హెడ్‌గా

మాధవరావ్‌గారి ప్లేస్‌లో వచ్చార్ట-పేరు భానుమూర్తి గారట..."

"ఇక్కడ కుర్రాళ్లు చాలా స్మార్ట్" అన్నాడు మందహాసం చేస్తూ భానుమూర్తి.

"ఆఁ...ఆఁ... ఇలాంటి వాటిల్లో చాలా, చాలా స్మార్టు" నవ్వుతూ వ్యంగ్యంగా అన్నాడు రాజు. భానుమూర్తి కూడా నవ్వేడు.

మాటల్లోనే స్కూటర్ స్టార్ట్ చేసి, భానుమూర్తి నెక్కించుకుని గేటు దాటించాడు రాజు.

"ఎక్కడ తీసుకున్నారు ఇల్లు ?" మెల్లగా పోనిస్తూ అడిగేడు.

"ప్రస్తుతానికి హోటల్లో దిగేను. త్వరలో ఏదన్నా రూమ్ తీసుకోవాలి" జవాబిచ్చేడు భానుమూర్తి.

"అదేం ?! ఫ్యామిలీ తీసుకురారా ?" ఆశ్చర్యంగా ప్రశ్నించాడు రాజు.

"పెళ్ళి అయితేనేగా ఫ్యామిలీని తెచ్చేది?" నవ్వేడు భానుమూర్తి.

"రియల్లీ వండర్ ! మీరింకా పెళ్ళి చేసుకోలా ?" ఆశ్చర్యపోయేడు రాజు. మళ్ళీ అంతలోనే "పోన్లెండి ... కొన్ని బాదర బందీలుండవ్" అన్నాడు.

భానుమూర్తి మౌనంగా ఉండి పోయాడు.

"అన్నట్లు మా యింటి దగ్గర్లో ఒక రూమ్ ఖాళీగా ఉన్నట్టు గుర్తు. ఏ.సంగతీ కనుక్కుని రేపు చెబుతాలెండి" అన్నాడు రాజు.

"అడ్వాన్స్‌గా థాంక్స్ !"

"ఒట్టి థాంక్సేనా ?" తమాషాగా అడిగేడు.

"సరే-కాఫీ తాగుదాం పదండి" కాఫీ హోటలు సమీపిస్తుండటం గమనించి అన్నాడు భానుమూర్తి.

"ఓకే. కానీ- ఈ రోజు మీరు బిల్లిస్తే ఊరుకోను" అన్నాడు షరతుగా.

"అలాగే లెండి" అంటూ హోటల్లోకి దారి తీశాడు భానుమూర్తి. ఖాళీగా ఉన్న జాగా ఎంచుకుని కూర్చున్నారిద్దరూ. వెయిటర్ రాగానే స్వీట్లు, రెండు కాఫీలు చెప్పి బాతాఖానీలో పడ్డారు.

"నాకు తెలియక అడుగుతాను..మన డిపార్టుమెంట్‌లో విశాలాక్షిగారి తత్వం అదోలా ఉంట్లుందేమిటి ?" మెల్లిగా విషయం కదిలించాడు భానుమూర్తి.

"పాపం పుణ్యం మనకి తెలియవు గానీ, ఆవిడ వెనక ఓ కథ ప్రచారంలో ఉంది" మంచినీళ్ళు చప్పరిస్తూ అన్నాడు రాజు.

"ఏమిటది ?"

"కథ గనుక నిజం కావచ్చు, కాక పోవచ్చు"

"పోనీలెండి, తెలుసుకోవటంలో తప్పు లేదుగా?"

"మీరు మా కాలేజీ స్టాఫ్ అయినాక వద్దన్నా తెలుస్తుంది. అసలు ఆవిడగురించి యితర 'డిపార్టుమెంట్'ల వాళ్లు బుర్ర కథే చెబుతారు !"

"మీరు మామూలు కథ చెప్పండి చాలు!"

ఇంతలో తినుబండారాలు వచ్చాయి.

తింటూనే చెప్పసాగేడు రాజు-

"ఎప్పుడో స్కూల్లో చదివే రోజుల్లో, ఏమీ తెలియని అమాయకపు అమ్మాయిగా ఉండగా, ఆమెను ప్రైవేటు చెప్పే టీచరు అఘాయిత్యం చేశాడని, దాంతో ఆమెకు పురుష ద్వేషం కలిగిందనీ అంటారు"

"లోకంలో యిలాంటివి తరచుగా

వింటూంటాం ! పోనీ, ఆ టీచరుకే యిచ్చి పెళ్ళి చెయ్యకపోయారా పెద్దలు?"

"అః... అదయినా ఆవిడ తల్లి కాబోయినప్పుడే పెద్దవాళ్ళకి తెల్సిందిట"

"ఐసీ ! ఆవిడ తల్లి అయిందన్న మాట!" కళ్ళు పెద్దవి చేసుకుని అడిగేడు.

"అయిందో, లేదో తెలియదు ! కొందరు కొడుకుని కని, ఎక్కడో అనాథ శరణాలయంలో వదిలిందంటారు. మరి కొందరు విషయం అంతవరకు వెళ్ళకుండానే, డాక్టర్లకు డబ్బు గుప్పి పిండాన్ని బయట పడేయించారంటారు. అసలు సంగతి ఎవరికీ తెలియదు"

"అంతే లెండి. లోకం అంటేనే అదిగా!"

"ఒక్కటి మాత్రం నిజం. ఆవిడ పెళ్ళి మాట తలపెట్టదు! కాలేజీలో ఎవరితోనూ ఎక్కువ మాట్లాడదు".

"పెళ్ళి చేసుకోనంటే తల్లిదండ్రులు ఊరుకున్నారా? మగవాణ్ణి నన్నే నానా బలవంతం చేస్తున్నారే మావాళ్ళు!" నవ్వేడు భానుమూర్తి.

"తల్లిదండ్రులుంటే ఊరుకోరనుకోండి పాపం. ఆవిడకిద్దరూ లేరు. మేనమామ దగ్గర ఉంటోంది. ఆయనకూ పిల్లల్లేరుట. పైగా ఆయన పెద్దవాడు. ఈవిడని ఎవరి కన్నా మంచివాడికిచ్చి, హాయిగా కన్ను మూయాలని తాపత్రయ పడుతున్నాడు. అప్పుడప్పుడు ఆయనకూడా మనకాలేజీ ఫంక్షన్స్‌కి వస్తూంటాడులెండి. కమిటీ మెంబరుకూడా"

వెయిటర్‌కి బిల్లుచెల్లించి "వెళ్దామా?" అంటూనే లేచాడు రాజు.

ఇద్దరూ బయటకొచ్చారు.

"ఏ హోటల్లో చెప్పండి దింపుతాను."

"నో-థాంక్స్ ! కాస్త సెంటర్‌లో వీలు చూసుకుని మెల్లగా వెళతాలెండి."

"ఓకే బై! బై!

"బై! బై!"

స్కూటరు చూసుకు వెళ్ళింది.

ఎదురుగా ఉన్న ఒక బట్టల కొట్లోకి వెళ్ళేడు భానుమూర్తి.

కావల్సినవన్నీ 'ప్యాక్' చేయించుకుని వస్తూండగా, కారులోంచి దిగుతూ విశాల, ఆమె వెనుక ఓ ముసలాయన కనుపించారు.

'ఆయనే కాబోలు వాళ్ళ మేనమామ!' అనుకుంటూ పరిశీలనగా చూశాడు.

మనిషి ఎత్తుగా, హుందాగా ఉన్నాడు. పండిన తల వయస్సు యాభైఅయిదుకి తక్కువ కాదంటోంది. కళ్ళజోడు ఆ మొహానికి ఒక వింత అందాన్నిస్తోంది.

అంతలో అప్రయత్నంగా విశాల అతనికేసి చూసింది.

అజంతా శిల్పంలా ఉన్న ఆమెకేసి పరిశీలనగా చూసి, పలకరింపుగా మందహాసం చేశాడు.

కానీ, పరిచయం కూడ లేనిదాన్లా చటుక్కున తలతిప్పుకొని, ముసలాయనతో ఏదో మాట్లాడుతూ లోపలికి వెళ్ళిపోయిందామె.

తనలో తను నవ్వుకుంటూ బైటికి నడిచాడు భానుమూర్తి.

* * *

"గుడ్ మార్నింగ్ సార్ ! మీ స్కూటరు వచ్చేసినట్లుందే!" స్కూటర్ దిగుతున్న భానుమూర్తిని అన్నాడు రాజు.

"నిన్ననే వచ్చింది లెండి" అంటూ భానుమూర్తి లోపలికి నడిచాడు. ముందు రోజు కనుపించని లెక్చరర్లు యిద్దరు

కనిపించారు గదిలో. రాజు వాళ్ళిద్దర్నీ పరిచయం చేశాడు.

"ఈయన కృష్ణస్వామిగారు, ఈవిడ మిస్. వయొలెట్. నిన్న స్వామిగారు శలవు పెట్టారు. మిస్. వయొలెట్ పర్మిషను తీసుకొని వెళ్ళేరు."

"వెరీ గ్లాడ్ టు సీయూ ..." ఒకళ్ళ నొకళ్ళు ఆప్యాయంగా పరామర్శించుకున్నారు.

భానుమూర్తి తన కుర్చీలో కూర్చున్నాడు.

మరో ఐదు నిమిషాలకు విశాల వచ్చింది.

ఎవరివైపు చూడకుండా, సీరియస్‌గా తన టేబిల్ దగ్గరకు వెళ్తున్న ఆమెనుద్దేశించి "గుడ్‌మార్నింగ్ మిస్ విశాలాక్షీ!" అన్నాడు భానుమూర్తి. విశాల విన్పించుకోనట్టే తన కుర్చీలో కూర్చుని, టీచింగ్ ప్రోగ్రామ్ కాగితాలు చూస్తుండిపోయింది.

మిగతా వాళ్ళందరూ తామిద్దర్నీ పరిశీలనగా చూస్తున్నట్లు గ్రహించి, ఆమె నిర్లక్ష్యం అవమానంగా తోచి మళ్లీ అదే మాటని వత్తి పలికేడు భానుమూర్తి.

విశాల అతనికేసి చురుక్కున చూసింది.

"గుడ్ మార్నింగ్ సర్ ! దయచేసి మీరు నా ఉనికి పట్టించుకోకండి. నాకు మేనర్స్ అంతగా తెలియవు ..." ఈ మాటలు అంటున్నప్పుడు ఆమె మొహం కందగడ్డలా ఎర్రబడి పోయింది.

ఎందుకో వయొలెట్ నవ్వు బిగపట్టటం భానుమూర్తి కంట పడింది. రాజు, కృష్ణస్వామి అసలేమీ విననట్లు తమ ధోరణిలో తాముండి పోయారు. అది నటనేనని భానుమూర్తి కిట్టే అర్థమైపోయి మౌనంగా ఉండిపోయాడు.

బెల్ మోగంగానే ప్రోగ్రామ్ ప్రకారం తమ క్లాసులకి వెళ్ళేరు రాజు, స్వామి.

వయొలెట్‌కి రెండో అవర్‌లో క్లాసుంది. విశాలక్కూడ అప్పుడే ఉంది.

"మిస్. విశాలా! ఈ రోజు మీ క్లాసు నేను తీసుకోదలిచాను"

ఓ నిమిషం ఊరుకుని– "తీసుకోండి" అంటూ చదువుతున్న పుస్తకం మూసేసింది.

"ఏ ఛాప్టర్‌లో ఉన్నారో తెలుసుకో వచ్చా?"

మౌనంగా పుస్తకంలో 'టిక్కు' పెట్టి అందించింది.

ఓ నిమిషం చూసి, "ఐసీ! థ్యాంక్స్ తీసుకోండి." పుస్తకం తిరిగి ఇచ్చేశాడు.

"మిస్. వయొలెట్! నెల నెలా క్లాసు టెస్టులు పెడుతున్నారా?"

"సామాన్యంగా పది హేనురోజులకొకమారు టెస్టులు పెడుతుంటాను సార్. దిద్దిన పేపర్లున్నాయి చూస్తారా?"

"ఇవ్వండి"

సొరుగు తీసి అందించింది.

కొన్ని పేపర్లు పరిశీలించి–"గుడ్! మీ స్టూడెంట్లు బాగానే ఫాలో అవుతున్నట్లున్నారు..." తిరిగి యిచ్చేశాడు.

"మిస్. విశాలా! మీ క్లాస్‌వి కూడా కొన్ని పేపర్లిస్తారా?"

"సారీ సర్ ! వాళ్ళకి అక్కడే దిద్ది ఇచ్చేస్తుంటాను..."

"దటీజ్ రాంగ్! లెక్చర్ యివ్వాల్సిన వేళలో పేపర్లు దిద్దితే, సిలబస్ వెనక పడుతుంది..."

"మొదట్నుంచీ నేను అలాగే చేస్తున్నాను. సిలబస్ కూడ టైములో పూర్తి

చేస్తున్నాను"

"ఇకముందు క్లాసులో పేపర్లు దిద్ద కండి. వాటిని కనీసం మూడు నెలలయినా రికార్డుగా ఉంచాలి. కుర్రాళ్ళకిచ్చేస్తే పారేస్తారు. టరమ్ పరీక్షల ముందిస్తే వాటిని చదువుకొని తెలిగ్గా ఆన్సర్ చేస్తారు"

"తెలిగ్గా ఆన్సరు చెయ్యడానికి వాళ్ళకు చాలా మార్గాలు ఉన్నాయి లెండి.!" నవ్వుతూ అంది వయొలెట్.

"అలాంటి అవసరాలు కలగకుండా చూడటం మన ధర్మం!"

వయొలెట్ మరేమీ అనలేదు.

విశాల కూడా మౌనంగా పేజీలు తిరగేసుండి పోయింది.

అవర్ బెల్ కాగానే వయొలెట్ లేచింది.

భానుమూర్తి కూడా లేచాడు.

ఇద్దరూ పదడుగులు నడచేక "విశాల గారి క్లాసు చూపిస్తారా ?" అడిగేడు.

"రండి" అంటూ తీసుకెళ్ళి చూపించింది వయొలెట్.

లోపలికి వెళ్ళగానే గౌరవంగా లేచి నిలబడ్డారు విద్యార్థులు.

"కూర్చోండి" అని, తనను తాను పరిచయం చేసుకుని, వాళ్ళని గురించి కూడా అడిగి తెలుసుకున్నాడు.

ఒక్కొక్కరివీ అభిరుచులు అడిగి తెలుసుకున్నాడు.

"మీలో ఎవరికయినా పాటలు పాడటం వచ్చా?"

ఎవరో వెనక బెంచీలోంచి లేచి-"మన కాలేజి బెస్టు సింగర్ శేషగిరిరావు ఉన్నాడు సార్..." అన్నాడు.

"శేషగిరిరావ్ ఎవరు ? లేచి నిలబడండి-" భానుమూర్తి కోరాడు.

ఎర్రగా, బక్కపలచగా ఉన్న ఓ కుర్రాడు లేచి నిలబడ్డాడు.

"క్లాసికల్స్ వచ్చా ?"

"ఓ మాదిరిగా వచ్చండీ..." కొంచెం బిడియంగా చెప్పాడు.

"వెరీగుడ్ ! భావగీతాలు ?"

"ప్రాక్టీసు చేశానండీ!"

"పద్యాలు వచ్చా ?"

"పుష్పవిలాపం పాడితే ఘంటసాల జ్ఞాపకంవస్తాడు మాస్టారూ!" ఓ స్టూడెంటు హుషారుగా చెప్పాడు.

"సరే - ఒక మాటు కార్యక్రమం పెట్టుకుందాం ! ఇక పాఠం మొదలెడతాను..."

విద్యార్థులందరూ కుదురుగా కూర్చున్నారు.

భానుమూర్తి చాలా రసవత్తరంగా ఆనాటి పాఠం విన్పించాడు.

ఏదో డ్యూటీగా వచ్చి ఉపన్యసించే విశాలాక్షికి, ఎంతో విపులంగా సుబోధకంగా చెప్పిన భానుమూర్తికి గల తేడాను స్పష్టంగా చూశారు ఆనాడు-విద్యార్థులు.

రోజూ భానుమూర్తి చెబితే ఎంతో బావుండు నన్పించింది వాళ్ళకి.

"దట్సాల్ ఫర్ దిడే" అని ముగించగానే, ఓ కుర్రాడు లేచి నిలబడ్డాడు. ఇంకా గంట కొట్టటానికి అయిదు నిముషాలుంది.

"యస్ - ఎనీడౌట్ ?" సౌమ్యంగ అడిగేడు - భానుమూర్తి.

"నో డౌట్ సర్; మాదొక చిన్న రిక్వెస్టు..."

"ఏమిటది ?"

"ఇహనుంచి మా క్లాస్ మీరే తీసుకోవాలి !"

"అవునుసార్" - మిగతా విద్యార్థులు

గొంతు కలిపారు.

"అదేం? విశాలాక్షిగారు వస్తున్నారుగా మీకు ?!"

"ఇవేళ మీరు చెబితే మాకు బాగా అర్థమయింది సార్..."

"అయామ్ సారీ ! మీ క్లాసుకి విశాల గారిని నిర్ణయించారు. నేను అన్ని క్లాసు లకీ వెళ్ళి 'అసెస్మెంటు' తీసుకోవాల్సి ఉంటుంది. మీకు తెలియని విషయాలుంటే డిపార్టుమెంట్ కొచ్చి అడగండి, చెబు తాను..." ఇంతలో గంట మ్రోగింది.

"థాంక్యూ" అంటూ వెళ్ళిపోయేడు భానుమూర్తి.

* * *

"మీకు రూమ్ దొరికిందిసార్! చాలా లక్కీ అనుకోవాలి..."

"ఎందుకని?"

"ఇంతకు ముందు టీ కంపెనీ మానే జరు అద్దెకున్న మేడనిప్పుడు రూమ్స్‌గా చేసి అద్దెకిస్తున్నాడు ఆనందరావుగారు.."

"ఆయనెవరు ?"

"అరే! ఆనందరావుగారు తెలియర్దండీ-అదే.. మన విశాలాక్షిగారి మేనమామ.."

ఆశ్చర్యపోయేడు భానుమూర్తి.

"చివరకి విశాలగారి యింట్లోకి నన్ను ప్రవేశ పెడుతున్నారన్న మాట?" ధలో క్తిగా నవ్వేడు.

"ఆ ప్రమాదం లేదులెండి ! ఆయన 'న్యూకాలనీ'లో బంగళా కట్టించుకుని ఉంటున్నాడు... మరి, రూమ్ బుక్ చెయ్య మంటారా?" రాజు అడిగాడు.

"భలేవారే మీరు ! ఇంకా బుక్ చేశా రను కుంటున్నాను..."

"చేసినట్లేలెండి గట్టిగా చెప్పి వచ్చాను..."

"ఎవరికి?"

"వాళ్ళ గుమాస్తాకి..."

"పదండయితే డబ్బు కట్టివద్దాం... ఓ మాటు రూమ్ కూడా చూద్దాం." ఇద్దరూ స్కూటర్ల మీద బయలేరారు.




'రూమ్' మేడమీద ఉంది.

చాలా విశాలంగా, శుభ్రంగా ఉంది.

ఏ అవసరానికీ మేడ దిగనక్కరలేదు! పక్కనే కొబ్బరి చెట్లు, ధారాళంగా వీస్తున్న గాలి, విశాలమైన కిటికీలు, తెరిస్తే గదినిండా వెలుతురే !

చూడగానే ఒప్పుకున్నాడు భాను మూర్తి.

డబ్బు కట్టేశారు గుమస్తాకి.

"అద్దెకోసం ముసలాయన ఎప్పుడూ రాడాయిటు?"

"అద్దెకోసం కాదుగానీ, యింటికేదన్నా మరమ్మతులుంటే దగ్గరుండి చేయిసాడు."

"మీరు నా కోసం చాలా శ్రమ తీసు కున్నారు రాజుగారూ! ధన్యవాదాలు చెప్పు కుంటున్నాను..."

"మనలో మనకి అవన్నీ ఎందుకు సార్ ! నా 'మోరల్ డ్యూటీ' నేను చేశాను. అంతే"

"రేపే యిక్కడికి మారిపోతాను. హోటల్‌లో నాకేమీ తోచటం లేదు".

"ఏం తోస్తుంది? ఏదో ఒకటి రెండు రోజులయితే ఫర్వాలేదు"

రూమ్‌కి తాళం వేసి, గుమాస్తాకి మర్నాడు దిగుతామని చెప్పి బయల్దేరారు,

* * *

భానుమూర్తి దిగిన వారం రోజుల్లోనే అక్కడ రూములన్నీ నిండిపోయాయి. అందరూ ఒంటరి యువకులే. ఎక్కువగా ఉద్యోగస్థులున్నారు.

అవుట్ హౌసులోకి మాత్రం గంపెడు పిల్లలతో ఒక పెద్ద గుమాస్తా దిగేడు!

నలుగురు ఎదిగిన ఆడపిల్లలు.

ఇద్దరు మగపిల్లలు.

మరో యిద్దరు ఆడపిల్లలు చిన్న వాళ్ళు!

దీర్ఘ రోగంతో తీసుకుంటున్నట్లున్న భార్య. ఇదీ ఆ గుమాస్తా సంసారం.

ఒంటిన ఖద్దరు చొక్కా ఉంది. సర్వ కాలాలకూ అదేలా ఉంది. పంచకట్టు, కళ్ళజోడు, నెరిసిన తల-పెద్దరికాన్ని పుణికి పుచ్చుకున్నాయి.

ఓ రోజు భానుమూర్తి స్కూటరు తుడుచుకుంటుండగా, వచ్చి పక్కన నిలబడ్డాడు-ఆ పెద్దాయన.



తలెత్తి చూశాడు భానుమూర్తి.

నవ్వి "నమస్కారం సార్! నన్ను మాధవరావ్ అంటారు. ఈ యింటి యజమాని ఆనందరావుగారికి బావమరిది వరస అవుతాను" అని పరిచయం చేసుకున్నాడు.

"అంటే విశాలాక్షిగారికి పినతండ్రా"

"అరే! మా విశాల ఎలా తెలుసు మీకు?!" ఆశ్చర్యపోయేడు.

నవ్వి "మేమిద్దరం ఒకే కాలేజీలో పన్జేస్తున్నాం లెండి" అన్నాడు 'స్పార్క్ ప్లగ్' తుడుస్తూ.

"చెప్పారు కాదేం మరి?!" అంటూ సిమెంటు రాతి గట్టుమీద కూర్చున్నాడు మాధవరావు.

"విశాల తండ్రి స్వయంగా నాకు పెత్తల్లి కొడుకు. చాలా ఉత్తముడు లెండి. చిన్న వయసులోనే కాలం చేశాడు. లేకపోతే యీ పాటికి కలెక్టరు కావాల్సినవాడు" విచారంగా నిట్టూర్చాడు.

ఈ మాధవరావు ద్వారా విశాల గురించి వివరంగా తెలుసుకొనవచ్చనిపించింది భానుమూర్తికి.

అందరి ఆడవాళ్ళలా ప్రవర్తించి ఉంటే, విశాల మీద భానుమూర్తికింత ఆసక్తి పుట్టకపోను.

కాలేజీలో అడుగు పెడుతూనే ఆమె గురించి విడ్డూరంగా వినటం, తనతో ఆమె ప్రవర్తన, అసాధారణమైన ఆమె అందం, ఆమె వెనుక ప్రచారంలో ఉన్న కథలు- ఇవన్నీ భానుమూర్తిని అప్రయత్నంగానే ఆమెవైపు లాక్కు వెళ్ళసాగినాయి.

మొదటి నుండీ అతనికి జిజ్ఞాస ఎక్కువ.



'సైకాలజీ' ఎంచుకున్న కారణం కూడా అదే.

భానుమూర్తి, మాధవరావు మాట్లాడుతున్నప్పుడే తమ స్కూటర్లు, సైకిళ్ళ కోసం మిగతా రూంలలోని వాళ్ళు ఒక్కొక్కరూ రాసాగేరు. మేడమీది వాళ్ళు కారు గారేజిలో ఉంచుకుంటుంటారు తమ వాహనాలు.

"సాయంత్రం నా రూముకి రండి, సర్దాగా మాట్లాడుకుందాం" అంటూ సంభాషణ తుంచేశాడు భానుమూర్తి.

"తమరే ఓమాటు మా యింటికొస్తే బావుంటుంది. ఎంతయినా గృహస్థును గనుక ఆ ధర్మం నాకుంది! ఏమంటారు?"

"వస్తాలెండి" అని ఓమాటు 'స్కూటర్'ని స్టార్టు చేసి చూసేడు.

బాగానే వుంది.

"వస్తానండీ. నాకూ ఆఫీసు టైమవుతోంది" అని వెళ్ళబోతూ ఆగి "అన్నట్లు మీ పేరు అడగలేదు..."

"భానుమూర్తి!"

"వెరీగుడ్ - చాలా మంచిపేరు! సాయంత్రం తప్పక రండి" మరో మాట చెప్పి వెళ్ళాడు మాధవరావు.

భానుమూర్తి పైకి వెళ్ళి బట్టలు మార్చుకుని, కారేజీలోంచి భోజనం వడ్డించుకు తిని, కాలేజీకి బయల్దేరాడు.

కాలేజీ మరో మూడు ఫర్లాంగులుండగా పక్కనుంచీ 'హారను' కొట్టుకుంటూ దూసుకు పోయింది చిన్నకారు.

వెనక సీట్లో కూర్చున్న విశాల స్పష్టంగా కన్పించింది.

స్కూటర్ వేగం పెంచాడు.

దాదాపు రెండూ ఒకేమారు కాలేజీ చేరుకున్నాయి.

తలుపు తీసుకు దిగుతున్న విశాల ముందునుండి స్కూటర్ పోనిచ్చి మెల్లగా "గుడ్‌మార్నింగ్" అన్నాడు.

వి శా ల గంభీరంగా నడిచి వెళ్ళి పోయింది డిపార్టుమెంటులోకి.

భానుమూర్తి స్కూటర్ పార్క్ చేస్తుండగా రాజు వచ్చాడు.

ఇద్దరూ 'విష్' చేసుకున్నారు.

ఏవో కబుర్లు చెప్పుకొంటూ ప్రిన్సిపాల్ రూమ్‌లోకి వెళ్ళి, హాజరు రిజిష్టర్‌లో సంతకాలు పెట్టారు.

అంతలో శలవునుండి తిరిగొస్తున్న ప్రిన్సిపాల్, ఆయనతోబాటు వస్తున్న విశాల కన్పించారు.

"హల్లో! మీరేనా భానుమూర్తిగారు?" అ ం టూ కరచాలనం చేశాడాయన. మనిషిని చూడగానే మంచి చలాకీ వ్యక్తని తెలిసి పోతోంది.

లెక్చరర్లందరూ మరో అ యి దు నిమిషాల్లో అక్కడకు చేరుకున్నారు.

'టరమ్' పరీక్షల గురించి కొద్దిసేపు మాట్లాడి, అందర్నీ పంపేస్తూ "భాను మూర్తిగారూ ! మీరు కొంచం ఉండండి" అన్నాడు. కూర్చునే వున్నాడు భాను మూర్తి. అందరూ వెళ్ళాక, "చూడండి. కొన్ని మరీ 'డెలికేట్ మేటర్సు' ఉంటాయి. వాటిని మనం జాగ్రత్తగా అర్థం చేసుకో వాలి. మీమీద నాకు ఆ నమ్మకం వుంది" సూటిగా భానుమూర్తి కళ్ళల్లోకి చూశా డాయన.

"చెప్పండి" అన్నాడు భానుమూర్తి 'ఏమై వుంటుందా?' అనుకుంటూ.

"ఈ కాలేజీ కమిటీలో ఆనందరావు గారు సభ్యులు. ఆయన పెద్ద విరాళ మిచ్చిన దాత..."

భానుమూర్తికి ఆనందరావుగారంటే ఎవరో అర్థమైపోయింది !

వింటూ కూర్చున్నాడు.

"నిజానికి విశాల చాలా మంచిపిల్ల ! ఒకప్పుడు ఈ కాలేజీలోనే చదువు కుంది..."

'ఇవన్నీ ఎందుకో!' — అనుకున్నాడు భానుమూర్తి.

"కావటానికి ఆమె సైకాలజీ లెక్చరరే అనుకోండి! కానీ, ఆమెలో చాలా డెలికసీ వుంది. తను, తన ప్రపంచంగా వుండి పోతుంది. ఇతరులెవరికీ దానివల్ల నష్టం లేదుగనుక, అభ్యంతరం కూడా వుండ రాదని ఆమె సిద్ధాంతం..."

ఇంతకూ అసలు సంగతి ఏమిటో ! తనమీద 'రిపోర్టు' చేసిందా?

—భానుమూర్తి లోలోన అనుమా నిస్తున్నాడు.

"కొంచెం ఆవిడ ధోరణిని కనిపెట్టి మసలుకోవటం మంచిదని నా సలహా"అని ముగించాడు ప్రిన్సిపాల్.

"నావల్ల ఏదైనా ఇబ్బంది కలిగినట్లు ఆమె చెప్పారా?" సూటిగా అడిగాడు.

"అఫ్‌కోర్సు అలాంటిదేననుకోండి" నాన్చేశాడు ఆయన.

లేచి నిలబడ్డాడు—

"ఉద్యోగ రీత్యా తప్ప వ్యక్తిగతంగా ఆమెను పట్టించుకోనని హామీ ఇస్తున్నాను. కనీసం కాలేజీ ఆవరణలో అలాంటిది జరగదు !"

"బై దిబై, ఈ ఊరెలా వుంది మీకు?" నవ్వుతూ అడిగాడు ప్రిన్సిపాల్ మాట మారుస్తూ.

"అంతా తెలుగు నేతే కదా? హాయిగానే వుంది" తనూ నవ్వుతూ జవాబిచ్చాడు భానుమూర్తి.

"మీకేమయినా యిబ్బంది కలిగితే నాకు చెబుతుండండి"

"థాంక్యూ సర్ ! వస్తాను..."

"ఓకే..." అంటూ ఆయన తన పనిలో నిమగ్నమైనాడు.

భానుమూర్తి డిపార్టుమెంటుకి తిరిగి వస్తూ, విశాల గురించే ఆలోచించాడు.

తనమీద ప్రిన్సిపాల్‌కి రిపోర్టు చెయ్యటం చాలా 'సిల్లీ'గా అన్పించింది. మొదటినుండీ అతనిది పట్టుదల స్వభావం.

'ఈ విశాల విషయమేదో గట్టిగానే తేల్చుకోవాలి. ఉద్యోగం ఊడినా ఫర్వా లేదు!' అని నిర్ణయించుకున్నాడు.

ప్రిన్సిపాల్‌కిచ్చిన వాగ్దానం మేరకు, కాలేజీ ఆవరణలో మాత్రం కేవలం ఉద్యోగ సంబంధమున్న మేరకే మాట్లాడ దలిచాడు.

అతను వెళ్ళేసరికి విశాల లేదు.

మొదటి 'అవర్' వుందామెకు.

వయొలెట్ ఏదో ఇంగ్లీషు నవల చదువుతోంది.

కృష్ణస్వామి రాసుకుంటున్నాడు.

రాజు న్యూస్ పేపరు చూస్తున్నాడు.

భానుమూర్తిని చూడగానే, "రండి సార్" మందహాసంతో ఆహ్వానించాడు రాజు.

వయొలెట్ మెల్లగా సొరుగులోకి నెట్టేసింది నవలని.

అలా చెయ్యకపోతే, అలాంటి పుస్తకాలు తీసుకురావద్దని చెప్పదలుచు కున్నాడు. పైగా అది 'సెక్సు బుక్' అని స్పష్టంగా తెల్సిపోతోంది.

కాలేజీ అవర్స్‌లో యిలాంటివి చదవటంవల్ల ఏకాగ్రత చెదిరి, సరిగా బోధించలేమని అతని విశ్వాసం.

వయొలెట్‌ని ఒక్కమారు సున్నితంగా హెచ్చరించటం మంచిదనిపించింది.

ఆమె ఏకాంతంగా ఉన్నపుడు మెల్లగా ఆ విషయం కదిలించాడు.

"మిస్ వయొలెట్ ! మీరింకా పెళ్ళి ఎందుకు చేసుకోలేదు?"

ఆ ప్రశ్న ఎందుకు వేసిందీ తెలియక తడబడి, కొంత సిగ్గుని అభినయిస్తూ "సరైన పార్టనర్ దొరక్క" అంది చమత్కారంగా నవ్వుతూ.

"పోనీ అంతవరకు ఒక పని చెయ్యండి..."

"ఏమిటది ?" పావురం రెక్కల్లా కనురెప్పలు తాటిస్తు అడిగింది.

"హాట్ బుక్స్ చదవటం మానె య్యండి..."

మొహంలో వెలుగు మాయమయింది.

"అయామ్ సారీ సర్ ! ఏదో టైమ్ పాస్‌కి..."

"కనీసం కాలేజీలోకి తీసుకు రాకండి.. స్టూడెంట్స్ చూస్తే ఆట పట్టిస్తారు..."

"అలాగే సార్ !" తలవంచుకుని, వినయంగా అంది.

తను చాలా సౌమ్యంగానే చెప్పాననిపించింది భానుమూర్తికి.

వయొలెట్ ఆ తర్వాత అలాంటి పుస్తకాలు తీసుకురాలేదు.

కాలేజీకి వచ్చినదాదీ - ఏదో రిఫర్ చేసుకుంటూనో, మరేదన్నా రాసుకుంటూనో కనిపించేది.

భానుమూర్తికి తృప్తికలిగింది.

కానీ— ఒక్క విశాల విషయంలోనే అతను నెగ్గలేక పోతున్నాడు.

అలాగని ఓటమి స్వీకరించలేక పోతున్నాడు.

'గెలవాలి... ఎలగయినా గెల వాలి...' పట్టుదలగా అనుకునేవాడు.

అతనికి ఒక్క విషయమే అర్థం కావటంలేదు.

ఆమె హృదయం శిలాసదృశమై పోయిందా ? అందులో లాలిత్యానికి, స్త్రీ సహజమైన కోమలత్వానికి తావులేదా !

అది హిమశిలే అయితే తను కరిగించ గలగాలి. పాషాణమే అయితే-బ్రద్దలు కొట్టాలి !

అయితే అందువల్ల ప్రయోజనం !

తలెత్తి విశాలకేసి చూశాడు భాను మూర్తి.

అప్రయత్నంగా విశాల కూడ యిటు చూసి, వెంటనే నిరసనగా మొహం తిప్పేసుకుంది.

భానుమూర్తి పిడికిళ్ళు బిగుసు కున్నాయి.

* * *

"ఇది మా పెద్దమ్మాయి రుక్మిణి. రెండోది మంగ. మూడోది సుగుణ. నాలుగోది లక్ష్మి. తర్వాత యిద్దరు మగ పిల్లలు. పెద్దవాడు భాస్కరం. రెండో వాడు వాసు. చివరి వాళ్ళిద్దరూ ఉమ, రాగిణి..."

పరిచయం చేస్తూ ఆగేడు మాధవరావు.

"ఏవిట్రా ఈ కుచేల సంతతి అని నవ్వుకుంటున్నారల్లే ఉంది" అన్నాడు నవ్వుతూ.

"అబ్బే— అదేం కాదు. ఇంతమంది పిల్లలతో ఎంత సందడిగా ఉంటుందా అని ఊహిస్తున్నాను..."

అదో పెద్ద జోకయినట్లు ఫెళ్ళున నవ్వేశాడు మాధవరావ్.

"సందడిని మెల్లగా అంటారేమిటండీ బాబూ ? పండుగలు వస్తున్నాయనగానే 'ఇండెంట్లు' రావటం మొదలు. ఒకళ్ళకి ఓణీ, ఒకళ్ళకి పరికిణీ, లాగూలు, చొక్కాలు... ఆఁ... మధ్యలో మా ఆవిడకో చీర, ఏం చెప్పమంటారులెండి ?" అని విషాదంగా మాట విరిచేసి జేబులోంచి బీడీ తీశాడు.

"క్షమించండి. మీరిలాంటివి ముట్టు కోరను కుంటాను" పళ్ళ మధ్య పెట్టు కున్న బీడీ వెలిగించబోతూ అడిగేడు.

"నో-థాంక్స్ ! మీరు కాల్చండి..."

అనడం తడవుగా చివ్వున వెలిగించు కుని, గట్టిగా ఓ దమ్ములాగి కాస్త కుదుట పడ్డాడు – మాధవరావ్.

ఇంతలో పెద్దమ్మాయి రుక్మిణి వయస్సునీ-ఒత్తరితనాన్నీ దాచుకుంటూ, పమిట నిండుగా కప్పుకుని గ్లాసుతో కాఫీ తీసుకొచ్చింది.

కాఫీ అందుకుంటూ భానుమూర్తి పరి శీలనగా చూశాడు- జాలివేసింది.

ఆమె-చాలాకాలం పెళ్ళికాని కొందరు ఆడపిల్లల్లాగే లావుదేలి ఉంది. ఆమె మొహంలో లావణ్యం, లేతదనం అంతగా లేవు.

అంత సిగ్గులోనే ఓమాటు అతని మొహంలోకి చూసి మరీ వెళ్ళిందామె.

కప్పు పెదవుల కానించి ఒక్కగుటక వేశాడు.

అందులో కాఫీ రుచిలేదు సరికదా, అదేదో ఆయుర్వేదం టానిక్‌లా ఉంది !

ఈ మాటు రెండో అమ్మాయి మంగ వచ్చి ఖాళీ కప్పు తీసుకెళ్ళింది.

ఈ పిల్లాగొప్ప అందంగా లేదుగానీ, చూపులో గడసరితనం ఉంది.

సిగిరెట్ వెలిగించుకున్నాడు.

అగ్గిపుల్ల ఎక్కడ పారెయ్యటమా అనుకుంటుండగా, మూడో పిల్ల సుగుణ ఖాళీ టెంకాయ చిప్ప తెచ్చి దగ్గర్లో ఉంచింది! అది 'ఆష్ట్రేట్రే' గా వాడు కోవాలని అర్థమయింది. భానుమూర్తికి..

అగ్గిపుల్ల అందులో వేశాడు.

ఆ పిల్ల వచ్చిన తీరు చూసే-ఎవరో బలవంతాన పంపినట్లు తెలిసిపోతోంది.

మాధవరావు తాపీగా గోడ కానుకుని, భానుమూర్తికి మర్యాదలు పూర్తయ్యే వరకు మౌనంగా ఉండదలిచినట్లు, శూన్యంకేసి చూస్తూండి పోయేడు.

"ఆఁ ఇప్పుడు చెప్పండి విశేషాలు..." అన్నాడు భానుమూర్తి పాత పడ క్కుర్చీలో వెనక్కివాలి.

"విశేషాలకేముచ్చె గానీ, యింతకూ తమరు ఫామిలీని తీసుకురాని కారణం- డెలివరీకి గానీ పంపారేమిటి?" నొసలు బిగించి, కుతూహలం నిండిన కళ్ళు చికిలిస్తూ అడిగేడు, మాధవరావ్.

"ఇంకా అలాంటి బాదరబందీల్లోకి దిగలేదు!" టెంకాయ చిప్పలోకి సిగిరెట్ నుసి రాలుస్తూ చెప్పాడు.

"ఆహా"-క్షణం సేపు మాధవరావ్ మొహంలో వింతకాంతి మెరిసింది. తన ధోరణిని సమర్థించుకుంటూ - "పెళ్ళి, చేసుకుంటే చేసుకున్నారు కానీ, నాలాగా ఊబిలో యిరుక్కోవద్దని మాత్రం మనవి" అన్నాడు.

"ఆ విషయంలో జాగ్రత్త పడితీరుతా లెండి!" అన్నాడు నవ్వేస్తూ భానుమూర్తి.

మాధవరావు అంతటితో వదలదల్చు కోలేదు.

"నాకు తెలియక అడుగుతాను, ఏ దన్నా కట్నాల విషయంగా సంబంధాలు కుదర్లేదా?" విషయాన్ని మళ్లీ మొదటికి లాగేడు.

"అబ్బే-నాకలాంటి పట్టింపులేవీ లేవండీ?"

"మరి, పిల్లలు నచ్చకా?"

"అదీ కాదు".

"మరి..." ఇంకే కారణాలుంటాయో ఊహించలేక పోయాడు మాధవరావు.

"ప్రత్యేకమయిన కారణాలంటూ ఏమీ లేవు. ఆ విషయానికి అంత ప్రాముఖ్యత ఇవ్వలేదంతే..."

వివాహం అనేది ప్రాముఖ్యతలేని విషయంగా ఎలా అన్పించిందో అర్థం కాలేదు మాధవరావ్‌కి!

తనకి పంథొమ్మిదోయేట పెళ్ళయింది

ఆ రోజుల్లో అదే ఆలశ్యం!

మరి, ఇతనికి ముప్పై అయిదుకి తగ్గవ్.

కొంపదీసి తిరుగుబోతు కాడుకద!!

ఏం చెబుతాం?

ఏమో-మనిషి ధోరణి అలా లేదు. సౌమ్యంగా, మంచిగానే కన్పిస్తున్నాడు.

ఒప్పుకుంటే రుక్మిణినివ్వొచ్చు!

కట్నం ఆశకూడ లేదంటున్నాడు.

ఏ ప్రయత్నమయినా అదను చూసు కుని చెయ్యాలి-

మాధవరావు మనసులో గిర్రున తిరి గేయి ఆలోచనలు.

"అన్నట్లు ఉదయం విశాలాక్షిగారి విషయం చెబుతూ ఆపేశారు" భాను మూర్తి మెల్లగా విషయం కదిలించాడు.

ఉలిక్కిపడ్డాడు మాధవరావ్.

తక్షణం అతని మనస్సులోకి తాజా శంక మొలకెత్తింది.

'కొంపతీసి యితగాడు విశాలమీద

కన్ను వెయ్యలేదుకద !! అది మనిషి కూడ బావుంటుందాయె'

తన ఆలోచనలు కప్పెట్టుకుంటూ "అలా మీ గదిలోకి వెళ్ళి మాట్లాడుకుందాం పదండి" అంటూ లేచాడు—మాధవరావు.

భానుమూర్తి కూడ అదే యిష్టపడ్డాడు.

"పదండి"—అంటూ మేడమీదకు దారి తీశాడు.

గదిలోకి అడుగు పెట్టేలోగా విశాల గురించి ఏం చెప్పటమా అన్న విషయం గురించి ఒక నిర్ణయానికి వచ్చాడు. మాధవరావ్.

అతన్ని కుర్చీలో కూర్చోమని కిటికీలు తెరిచాడు భానుమూర్తి.

కొబ్బరిచెట్ల మీదనుండి చల్లటిగాలి దూసుకు వస్తోంది.

సిగరెట్ అందిస్తే "ఆఁ మనకి బీడీ మాటు గానీ పని చెయ్యదు. సర్లెండి,- మీ రంతయిదిగా ఇస్తుంటే ఎందుకువద్దనాలి!" అంటూనే వెలిగించుకున్నాడు.

కిటికీ పక్కగా కూర్చుని, తనూ ఒకటి వెలిగించుకుని, "ఊఁ యిప్పుడు చెప్పండి" అన్నాడు భానుమూర్తి.

"విశాల గురించి యిక్కడ చెబుతా నన్న కారణం ఉంది. నాకా పెళ్ళికాని పిల్లలున్నారు. ఆ పిల్ల గత చరిత్ర అంత మంచిదికాదు. నలుగురిలో చెప్ప తగ్గది అంతకన్నాకాదు." ఆగి ఒకదమ్ము పీల్చుకున్నాడు, మాధవరావ్.

"అలాగా! ఏమిటది? అన్నాడు భానుమూర్తి తనకేమీ తెలియనట్లు.

"అసలది చిన్నతనం నుంచీ గర్విష్టే ఎవర్నీ లెక్క చేసేదికాదు. కొంత వాళ్ళ నాన్న చేసిన గారాబంకూడా కారణంలెండి. మా ఆనందరావు బావకొక్కడే కొడుకు. వాడికి విశాలనిచ్చి పెళ్ళిచెయ్యాలని వాగ్దానాలు చేసుకున్నారు.మానవుడు అనుకున్న వన్నీ అయితే దేవుడెందుకు?వాడికి మశూచి వచ్చిపొయ్యాడు. "విశాల చిన్నతనం నుండీ ఆనందరావు దగ్గరే పెరిగిందిలెండి. ఆయనే చదువు చెప్పించాడు. అంతలో దురదృష్టవశాత్తు ఒక జీపు ప్రమాదంలో భార్యాభర్తలిద్దరూ చనిపోవటంతో విశాల అనాథ అయింది. ఆ క్షణంనుండీ ఆనందరావే విశాలకి అన్నీ అయ్యాడు. ఆ పిల్ల కోరిందల్లా తీర్చాడు. విచారం అన్నది తెలియకుండా పెంచడానికి ఎన్నోతిప్పలు పడ్డాడు. కానీ, అతిగారాబం, అతిచనువు, ఒక్కో మాటు కొంప ముంచుతాయి. విశాల విషయంలో అదే జరిగింది.

ఎలా జరిగిందో తెలియదు గానీ, మొత్తానికి ఎక్కడో కాలు జారింది. ఆ ఉపద్రవంలోంచి బయట పడటానికి ఆనందరావు చాలా ఖర్చు చేశాడంటారు."

"అంటే—ఎబార్షన్ చేయించారా?"

"ఏం చేయించాడో నాకయితే ఖచ్చితంగా తెలియదనుకోండి. ఇలాంటివి దాచటం కష్టం.గనక చుట్టపక్కాలందరికీ పాకిపోయింది. విశాలని పెళ్ళి చేసుకునేందుకు ఎవరూ ముందుకు రాలేదు. ఎవరో ఒకళ్ళిద్దరు డబ్బు ఆశకొద్దీ వచ్చినా విశాల తిరగ్గొట్టేసిందంటారు."

"ఎందుకనో ?!"

"ఎందుకనేదేముందిలెండి ఖర్మ చాలక ఆ గొడవల్లో యిరుక్కుంది గానీ. దాని తెలివికేం తక్కువ ? డబ్బుకోసం చేసుకున్నవాడు, ఆస్తి చేజిక్కాక దీని గొంతు పిసికి అవతల పారేస్తే దిక్కేమిటి ? లోకంలో యిలాంటివి ఎన్ని జరగటం లేదు ?!"

"అయితే చాలా కష్టాలు పడింవన్న మాట-పాపం !"

"పాపం చేసేక కష్టపడకేమిలెండి! అయినా, దాని కిప్పటికయినా తెలివుందా? ఏదో ఆ ముసలాడు మూడు ముళ్లూ వేయిద్దామన్న తాపత్రయంతో ఉన్నాడు కదా-మంచో, చెడో జీవితానికో మనిషిని



ఆసరాగా ఎన్నుకోకూడదూ ? ఆ పనిచేయ లేదు. ఇప్పుడు ఆయన కాస్త కన్ను మూసారనుకోండి. దీని పాట్లు దేవుడికే తెలియాలి"

"ఆవిడకి తగిన మనిషి దొరక లేదేమో"

"బాగా అన్నారు! దానికి తగినవాడు ఏ మూడో పెళ్ళివాడో కావాలి, దాని కిప్పుడు ముప్పైకి తక్కువ లేవు! అప్పుడే దానీడు వాళ్ళు పిల్లల్ని కని పెళ్ళిళ్ళు కూడా చేస్తున్నారు"

"మనిషిని చూస్తే అంత వయస్సు కన్పించదే ?!"

"బాబూ ! తమరితో అబద్ధం చెప్పా ల్సిన పనేముందండీ ? నా పెద్ద కూతురికి పాతికేళ్లు. అది పుట్టేనాటికి విశాల అయి దేళ్ళ పిల్ల! అక్షరాభ్యాసం జరిగి స్కూలుకి కూడ వెళ్తుండేది"

"మీరింత కుటుంబంతో యిబ్బంది పడుతున్నారు కదా ? మీ బావగారు ఆర్థి కంగా ఆదుకోరా?" విషయం మార్చేడు.

ఘొల్లున నవ్వేడు మాధవరావు.

ఆశ్చర్యంగా చూస్తున్న భానుమూర్తి నుద్దేశించి "మీరు భలేవారండీ మాస్టారూ ! అడిగేరు గనుక, చెబుతా వినండి-

"డబ్బున్న వాళ్ళదంతా ఒక వర్గం. వాళ్ళుండేది స్వర్గం.

లేని వాళ్ళది నరకం. వాళ్ళ జీవితం ఓ రకం.

ఇహ నాలాంటి వాడిది త్రిశంకు స్వర్గం.

విన్నారా ?

ఇహ ఆదుకోవటం సంగతి-

ఆదుకోవటం వెనక ఒక ప్రయోజనం ఉండాలి. కనీసం పేపర్లో పేరు పడాలి. ఫలానా కాలేజీకింత విరాళమనో, ఆ కాలే జీలో యిన్ని స్కాలర్‌షిప్పులనో, ఫలానా సంస్థకి మహారాజ పోషకుడనో-అయ్యా ! యివన్నీ లెక్కకు వచ్చే ధర్మాలు. నా లాంటి చవటకిస్తే ఏముంది ? లోకానికెలా తెలుస్తుంది ? తెలిసినా, బంధువు గనక యిచ్చారంటారు.

మాట వరసకి మీరే ఉన్నారు.

లేదు-మీరంటే మీరు కాదు. మీలాంటి సజ్జనులున్నారు. మేడమీద హాయిగా, చల్లగాలిలో, ఎత్తునుండీ ప్రపంచాన్ని చూస్తూ బ్రతుకుతున్నారు. క్రింద, అయి మూలగా మాధవరావ్ అనే ఓ బక్క వెధవ గంపెడు సంసారంతో బతుకు తున్నాడు. వాడి కూతుళ్లు ఎదిగిపోతుంటే ఏమీ చెయ్యలేక గుండెల్లో దిగులు పెంచు కుంటున్నాడు-ఇదిగో చూడు మాధవరావ్! నువ్వలా ఏడవకు. నీ పెద్ద కూతురు నా పెళ్ళాం. నీ రెండో కూతురు నా స్నేహి తుడి పెళ్ళాం. బతకవోయ్. నువ్వో జీవితంలో అపుడపుడూ నవ్వుతూ బ్రతక వోయ్-అనే దేవుళ్ళెవరయినా ఉన్నారా ? అహఁ ఊన్నారా అని ?"

ఏమంటాడు భానుమూర్తి ?!

కళ్ళు, చెవులూ వప్పగించి 'ఔరా ! నా కాళ్ళకే వేస్తున్నాడు బంధం' అను కున్నాడు మనసులో.

భానుమూర్తి మౌనం చూసి, మళ్ళీ కొనసాగించేడు.

"కనుక, ఎవరికెవరూ లేరు ! ఎవరి సానుభూతి అయినా పెదవి మీదనే. ఏదో కాస్త దయతల్చి యాభై రూపాయల అద్దెకయినా ఆ ఔటుహౌసు యిచ్చాడు. అక్కడికదే తృప్తి నాకు !"

"మీరు దానికి అద్దెకడుతున్నారా?!" ఆశ్చర్యం దాచుకోలేక పోయేడు.

మందహాసం చేస్తూ "అద్దె యింత అన్నారు. సరే నన్నాను. ఇహ కట్టడం అన్నది మన వీలు..." అన్నాడు.

'ఫర్వాలేదు – బ్రతకనేర్చినవాడు' అనుకున్నాడు భానుమూర్తి మనసులో.

"తమరెంత మంది అన్నదమ్ములు ?" సిగిరెట్టు ఆఖరిదమ్ము పీల్చి విసిరేస్తూ అడిగేడు మాధవరావ్.

"నేను ఒక్కణ్ణే !"

"అదా సంగతి ?! అందుకే మీ తల్లి దండ్రులు మీ కళ్యాణం చూడాలని ఆందోళన పడుతున్నారు !" అని నవ్వి, "అయినా పాపం, ఎంత కాలమని వాళ్ళ నలా యిబ్బంది పెడతారు ? త్వరలో మీకు నచ్చిన పిల్లని చూసి చేసేసు కోండి... ఎలాగో మీకు కట్నకానుకల మీద ఆశలేదు గనుక బీదయింటి దయినా ఫర్వాలేదు! పోనీ, నన్ను చూడమంటారా చెప్పండి..." ధలోక్తి విసిరినట్లు మొహం పెట్టాడు.

అతను తెలివిగా అల్లుకుంటూ వస్తున్న ఉచ్చులు చూసి, 'లోకంలో ఎంతమంది యిలా ఆడపిల్లనో యింటి దాన్ని చెయ్య డానికి ఆత్మాభిమానం చంపుకుంటు న్నారో-' అని జాలి పడ్డాడు.

"మాధవరావ్ గారూ! నాకు నిజంగా పెళ్ళి చేసుకోవాలనిపిస్తే మిమ్మల్నే మధ్య వర్తిగా ఉంచుకుంటాను. సరేనా?"

వేసిన బాణం గురితప్పి నేలమీద పడి నట్లు మొహం పెట్టి "అలాగే, అంత కంటేనా?!" అని యాంత్రికంగా నవ్వేడు.

ఇంకేమీ మాట్లాడాల్సింది లేనట్లు, కుర్చీలోంచి లేచి, "మరి నేవస్తా. శలవు! దయ ఉంచండి. అప్పుడప్పుడు అలా మా యింటికేసి వస్తూండండి. పరిచయం పిడి కెడు ధనం అన్నారు..."

మర్యాదగా లేచి నిలబడి "అలాగే! మీరు కూడ అప్పుడప్పుడు వస్తూండండి" అని సాగనంపాడు.

తిరిగి గదిలో కొచ్చి బట్టలు మార్చు కున్నాడు. స్నానాల గది వైపు వెళ్ళి మొహం కడుక్కొని తిరిగి వస్తూ, ఎత్తు తక్కువగా ఉన్న పిట్టగోడ మీద నుండి అప్రయత్నంగా క్రిందకి, దొడ్డి వైపు చూశాడు.

'అవుట్ హౌస్' కోసం ఉన్న బాత్ రూమ్‌లో నిలబడి స్నానం చేస్తున్న రుక్మిణి తల, భుజాలు కన్పిస్తున్నాయి!

ఆ 'బాత్‌రూమ్' పైన కప్పులేదు!

అదే క్షణంలో రుక్మిణి కూడ పైకి చూసింది.

భానుమూర్తి తొట్రుపడ్డాడు.

ఆమె లీలగా నవ్వినట్లు తోచిందతనికి.

వెంటనే ఆదరా, బాదరా రూమ్‌లోకి వెళ్ళిపోయాడు.




పది గంటలయింది.

తలుపు ఓరగా వేసి, కుర్రాడు తెచ్చిన 'క్యారియర్' తీసి కంచంలో వడ్డించు కున్నాడు భానుమూర్తి.

తినబోతుండగా తలుపు తోసిన చప్పు డయింది.

తలెత్తి ఆశ్చర్యంగా చూశాడు.



రుక్మిణి.

ప్లేటు నిండుగా ఏదో పెట్టుకొచ్చింది. పైన అరిటాకు బోర్లించి ఉంది.

"ఏమిటది?" అనడిగాడు ఆశ్చర్యంగా చూస్తూ భానుమూర్తి.

మందహాసం చేస్తూ ముందు కొచ్చింది.

ఆకు తీస్తూ "ఊరగాయలు..." అంది.

కప్పుల్లో ఆవకాయ, మాగాయ, గోంగూర, మిరపపళ్ళకారం, కందిసున్ని చిన్న సాసరులో రెండు గుత్తివంకాయలు!

"ఎందుకివన్నీ తెచ్చావ్?" – అతనికి కొంచెం చిరాకు కలిగింది.



"మా అమ్మ పంపించింది..." రెప్పలు బెరుగ్గా తాటిస్తూ అంది.

"వద్దు పట్టుకెళ్ళు..."

రుక్మిణి మొహం చిన్నబోయింది.

మనసు గాయపడినట్లు చూసింది.

"సరే - యీ రోజుకి తీసుకుంటున్నాను ... ఇంకెప్పుడూ యిలా తేవద్దు." అంటూ ఆమె తెచ్చినవన్నీ అందుకున్నాడు.

రుక్మిణి మొహంలో కాంతి తిరిగి వచ్చింది.

తనలో తను నవ్వుకున్నాడు భానుమూర్తి.

వెళ్ళబోతూ, తలుపు దగ్గర ఆగి వెనక్కిచూస్తూ "ఆ వంకాయకూర నేనే చేశాను..." అంది మెల్లగా.

"చాలా బావుంది!"

ఉషారుగా వెళ్ళిపోయింది.

అప్పటికతను కూర నోట్లో పెట్టుకోనేలేదు!

* * *

"మిస్. విశాలా! మీ క్లాస్‌టెస్ట్‌పేపర్లివ్వండి"

సొరుగులోంచి కట్ట తీసి ముందు ఉంచింది.

అక్కడక్కడ కొన్ని పేపర్లు తీసి చూశాడు.

జవాబులు చాలా ఘోరంగాఉన్నాయి.

మార్కులు వెయ్యడంలో ఒక పద్ధతిని అనుసరించినట్లు కనిపించలేదు. ఒక చోట అరపేజీ జవాబులో విషయాన్ని స్పృశించకపోయినా మార్కులివ్వడం జరిగింది.

ఆ పేపరు విడిగా పట్టుకొని "మిస్. ఈ జవాబుకి మార్కులెలా యిచ్చారో కాస్త చెబుతారా?" అనడిగాడు.

"నేనెవరి దగ్గరా లంచాలు తీసుకొని మార్కులు వెయ్యలేదు. నాకు తోచినట్లు దిద్దాను..." పెడసరంగా చెప్పింది.

ఆమె మొహంలోకి సూటిగా చూశాడు.

"మళ్ళీ ఒకమారు చెప్పండి ..."

విశాల కూడా అతని మొహంలోకి తేరిచూసింది. అంతలో ఏదో అనూహ్యశక్తి, ఆమె ధైర్యాన్ని జయించినట్లనిపించి తల వంచుకుని "మీకు నచ్చకపోతే మార్కులు తగ్గించండి అంతకంటే నేనేమి చెప్పలేను" అంది.

భానుమూర్తి మందహాసం చేస్తూ, పేపర్లనుకట్టకట్టి యిస్తూ "తీసుకోండి" అంటూ అందించాడు.

డిపార్ట్‌మెంట్‌లో వాళ్ళిద్దరు తప్ప యింకెవరూలేరు. రాజు శలవుమీదున్నాడు స్వామి, వయొలెట్, క్లాసులకి వెళ్లేరు.

భానుమూర్తి సిగిరెట్ వెలిగించుకుని పొగ మెల్లగా విడుస్తూ, ఆమెనే పరిశీలనగా చూస్తుండిపోయాడు.

ఆమె మౌనంగా సైన్సు మ్యాగజీన్ తిరగేసోంది.

ఆమె మనస్సు మ్యాగజీన్ మీదలేదని స్పష్టంగా తెలిసిపోతోంది.

భానుమూర్తి నవ్వుకుని "చూడండి మిస్ విశాలా!..." అని ఏదో చెప్పబోతుండగానే చటుక్కున తలెత్తి "యస్"- అంది.

"ముందా మ్యాగజిన్ పక్కనుంచి, నే చెప్పేది వినండి.."

యాంత్రికంగా మ్యాగజీన్ పక్కన పడేసింది.

"నావల్ల మీ మనసుకేమైనా కష్టం కలిగిందేమో తెల్సుకోవాలనుకుంటున్నాను"

"ఎందుకలా అనుకుంటున్నారు?"

"మీరు నన్ను శత్రువులా చూస్తుంటే యింకేమనుకోవాలో మీరే చెప్పండి"

"మిమ్మల్ని శత్రువుగా చూస్తున్నానని ఎవరు చెప్పారు?"

"మీ కళ్ళూ, మాటలూ, చేతలూ... వాటికి భాషలేకపోయినా భావం ఉంది!"

"చూడండి సర్! మీరు డిపార్ట్‌మెంట్ హెడ్. నేను మామూలు లెక్చరర్‌ని. దట్సాల్. అంతకంటే నేను ఎక్కువ ఆలోచించను. ఒకళ్ళ గొడవ నాకనవసరం. నాసంగతి ఒకరు పట్టించుకుంటే ఎలర్జీ నాకు" మొహం ఎర్రబడింది.

నవ్వేడు భానుమూర్తి.

"నేను మీ వ్యక్తిగత విషయాలలో పొరబాటున కూడ తల దూర్చలేదే! మీ అందం నాకు నచ్చినా, మీరు అజంతా సుందరిలా ఉన్నారనలేదే. మీరింతవరకూ ఎందుకు పెళ్ళి చేసుకోలేదనే ప్రశ్నలతో వేధించలేదే!"

"ప్లీజ్ స్టాపిట్! మీరువేమీలేదంటూనే మాటలతో గుచ్చుతున్నారు. మీరు నా విషయంలో యింతవరకూ ఎవరూ చూపని ఆసక్తి కనబరుస్తున్నారు. నాలో ఉన్న దేదో త్రవ్వి బయటకు లాగాలని చూస్తున్నారు. ఎందుకు? ఎందుకిలా చేస్తున్నారు? మీరూ అందరిలా ఎందుకుండరు?' ఆవేశంతో ఊగిపోయింది.

ప్రశాంతత చెరగిన మొహంతో అన్నీ విన్నాడు. భానుమూర్తి.

"మీరు హిమసానువుల్లో కాదు, మనుష్యుల మధ్య ఉన్నారు. నల్లపరదా కప్పుకోగానే-అదృశ్యమైపోతామనే భ్రమ మంచిది కాదు!"

"మీరేదో గూఢార్థాలతో మాట్లాడుతున్నారు. ధైర్యం ఉంటే మనసులోని మాట సూటిగా చెప్పండి" ఆమె కళ్ళు ఎర్రబడ్డాయి.

"ఎందుకలా భుజాలు తడుముకుంటారు?" అన్నాడు చిన్నగా నవ్వుతూ. ఆమె రెచ్చిపోతున్న కొద్దీ అతనిలో విజయ గర్వం పొంగసాగింది.

"మీరు విన్న గాలికబుర్లన్నీ నా కన్వయించాలని చూస్తున్నారు కదూ ?" అదురుతున్న పెదవుల్ని బలవంతంగా అణిచి పెడుతూ ప్రశ్నించింది.

ఆమె ప్రతి కదలికా, ప్రతిమాటా ముగ్ధంగా తోస్తున్నాయతనికి. 'కోపంలో అందమంటే యిదే కాబోలు!' అనుకుంటున్నాడు.

"అంటే-నేనేదో మీ గురించి విన్నానని మీకు రూఢి అయిందన్నమాట? ఇతరులు మీ గురించి ఏం చెప్పుకుంటున్నారో కూడా మీకు తెలిసే వుండాలి..."

చప్పున ఆమె రుమాల్ తీసి కళ్ళకు అదుముకుంది.

భానుమూర్తి కర్థమయింది ఉరిమిన మేఘం వర్షిస్తోందని.

"నేను మీ గురించి చెడుగా విన్నానని మీరనుకోచ్చుగాక. విన్నంతలో అన్నీ నమ్మేస్తాననుకోవటం మాత్రం వెర్రితనం. నలుగురితోబాటు నేనూ ఒకడిననే అభిప్రాయం మీరెంత త్వరగా వదిలేస్తే అంత మంచిది."

ఆమె లేచింది.

"మీరు నమ్మినా, నమ్మకపోయినా నలుపు ఎన్నటికీ తెలుపు కాదు-కాలేదు" బయటికి విసవిస నడిచి వెళ్ళిపోయింది.

భానుమూర్తి ఆశ్చర్యంతో అలాగే కూర్చుండిపోయాడు.

తనేమైనా తొందరపడ్డానేమోనని బాధ పడ్డాడు.

అసలే ముక్కుమీద కోపం. ప్రిన్సిపాల్‌తో మళ్ళీ ఏమి చెబుతుందో అని మధనపడ్డాడు.

అనుకుంటున్నట్లుగానే మరి కాసే పటిలో ప్యూన్ ఓ కాగితం అందించాడు.

"వెంటనే నన్ను చూడండి"

—ప్రిన్సిపాల్

భానుమూర్తి తలపంకించి, ప్రిన్సిపాల్ గదివైపు దారి తీశాడు.

విశాల ఎదురుగా వసూ కనిపించింది.

కళ్ళు కలుసుకోగానే చటుక్కున తల



దించుకుని పక్కనుండి మౌనంగా దాటుకు వెళ్ళిపోయింది.

అతనికి విద్యార్థి దశ జ్ఞాపకం వచ్చింది.

నవ్వుకున్నాడు.

అప్పుడు తనెంతో బుద్ధిమంతుడుగా పేరు తెచ్చుకున్నాడు.

ఆడపిల్లలకి ఆమడ దూరంలో మసలే వాడు.

ఇన్నాళ్ళు ఉద్యోగం చేసినా ఎప్పుడూ, ఎక్కడా ఇలాంటి సంఘటనలు జరగ లేదు.

ఇక్కడ ఎందుకిలా తన ప్రమేయం లేకుండా పరిస్థితులు తనను మార్చివేస్తు న్నాయో, ఎక్కడికివి దారి వేస్తున్నాయో ఊహకందటం లేదు.

ప్రిన్సిపాల్ గదిలోకడుగు పెట్టాడు.

* * *

"కూర్చోండి! ముందు ఆ 'కూల్ డ్రింక్' తీసుకోండి" అన్నాడు ఆనంద రావు.

మరోమాట లేకుండా 'కూల్ డ్రింక్' అందుకున్నాడు.

ఆయన సగం తాగిన గ్లాసు టేబిల్ మీద వుంచి, సిగరెట్ 'ఆఫర్' చేశాడు భానుమూర్తికి.

"థాంక్స్"—అందుకున్నాడు.

లైటర్‌తో భానుమూర్తికి వెలిగించి, తను వెలిగించుకున్నాడు ఆనందరావు.

"నేను మిమ్మల్ని ఎందుకు పిలిచానా అని మీరు ఆశ్చర్యపోతుండవచ్చు! బహుశ మీ ఉద్యోగం ఊడబీకించటమో, అథవా బదిలీ చేయించటమో చేస్తానని అనుకుని వుంటారు. అవునా?"

భానుమూర్తి మందహాసం చేశాడు.

"మనం వద్దనుకున్నా అనేకం అనుకో వాల్సి వుంటుంది. దానిదేముందిలెండి! ఇంతకూ విషయం చెప్పండి..."

"చెబుతాను. అందుకే పిలిపించాను. నిన్న మా విశాల చాలా తీవ్రంగా యింటి కొచ్చి గదిలో ముసుగుతన్ని పడుకుంది. వంట్లో కులాసాగా లేదేమోనని లాలనగా అడిగాను..." ఆయన మళ్ళీ ఒక గుటక మింగాడు కూల్ డ్రింక్.

"ఏమన్నదో తెలుసా?" నవ్వు మొహంతో ప్రశ్నించాడు ఆనందరావు.

"చెప్పండి" అన్నట్లు తలాడించాడు.

"ఆ బోడి ఉద్యోగం నాకొద్దు మామయ్యా! ఇంట్లోనే కూర్చుంటానంది. అయినా, దాని పట్టుదలమీద చేస్తున్న ఉద్యోగమేకానీ ఒకరు చెయ్యమన్నది కాదు. ఉద్యోగం చేస్తేనేగానీ జీవికవెళ్ళని పరిస్థితి లేదు. ఆ...ఇక విషయం చెబు తాను. ఇన్ని సంవత్సరాలలో ఎన్నడూ లేనిది హఠాత్తుగా ఉద్యోగంమీద విరక్తి పుట్టటానికి గట్టి కారణమే వుండాలని పించింది. అదికూడా అడిగాను. 'అక్కడ లెక్చరర్లకి కొంటె వేషాలూ, కుర్రకారు ధోరణులూ పోలేదు' అంది. గట్టిగా ఆలో చించాను. పాతవాళ్ళెవరూ ఆ సాహసం చెయ్యరు. కారణం నేను కాలేజీ కమిటీమెం బరునవటం కావొచ్చు. అయితే కొత్తవాళ్ళు చెయ్యాలి. ఇహ విశాలనడిగి ప్రయోజనం లేదనిపించింది. ప్రిన్సిపాల్‌కి ఫోన్ చేశాను. అప్పటికే ప్రిన్సిపాల్‌కి, మీకు అరగంటపైగా వాదన జరిగింది. విశాల రాజీనామాకి మీరే కారణం అని ఆయన మిమ్మల్ని నిందిస్తున్నారు. అవునా?"

"అందులో అబద్ధం లేదు!"

"నేను సైకాలజీ చదువుకున్న వాడిని

కాదు. అయినా ఒక్కటి చెప్పాలనుకుంటు న్నాను. ఆడది ఏ వ్యక్తి ఎదుట తను పీగిపోగలనని భయపడుతుందో ఆ వ్యక్తి నేదో విధంగా దూరంగా నెట్టి, లేదా తనే దూరంగా వచ్చి తనను తను కాపాడు కోవాలని చూసుకుంటుంది. ఆడది అని ఎందుకన్నానంటే స్త్రీ జాతిలో యీ లక్షణం ఎక్కువ గనక! కాదంటారా?"

"జీవితాన్ని నా కంటే ఎక్కువ విపులంగా పరిశీలించిన మీ మాటలు కాదనే అర్హత నాకు లేదు. మీది కళ్ళతో చూసి, అనుభవంలోకి తెచ్చుకున్న విజ్ఞానం. నాది చదువుకున్న పరిజ్ఞానం. ఈ తేడా ఎప్పుడూ ఉంది"

"పెద్దవాళ్ళమీద మీకున్న గౌరవానికి చాలా సంతోషిస్తున్నాను. ఇప్పటి యువకుల్లో లేని లక్షణం మీలో ఉన్నందుకు అభినందిస్తున్నాను! అదలా ఉంచండి. నేను ఫోను చెయ్యగానే అనేక క్షమాపణలు చెప్పుకుంటూ ప్రిన్సిపాల్ మాట్లాడటం మీరూ వినే ఉంటారు! నేను ఆయనతో ఒక్కటే అన్నాను–మీరు అతన్నేమీ అనకుండా నా వద్దకు పంపించండని."

"నన్ను పిలిపించడంలో ప్రిన్సిపాల్ గారు మంచి కన్నా చెడే ఎక్కువ ఊహించుకుని నన్ను మరింత వత్తిడి చేసి పంపించారు. ఉద్యోగం పోతే బాధపడే పరిస్థితులు నాకు లేవు నిజానికి! కానీ, ఒకమాటు మిమ్మల్ని చూడాలని నాకూ అన్పించింది. అందుకే వచ్చాను."

"చాలా ఆనందిస్తున్నాను. అసలు యిన్నాళ్ళూ నేను ఎదురు చూసింది మీలాంటి వ్యక్తి కోసమే!"

ఆశ్చర్యంగా చూశాడు భానుమూర్తి.

"అవును – యిందులో ఏమీ అబద్ధం లేదు! విశాలకి నేను చూసినన్ని సంబంధాలు బహుశః ఏ కన్న తండ్రి కూడా చూసి ఉండడు. చివరకు ఒక నిర్ణయానికి వచ్చాను. దానిలోనయినా మార్పు వచ్చి 'మామయ్యా! నీ యిష్టప్రకారం కానియ్యి' మనాలి. లేదా – ఎవరయినా తనంత తనుగా ఆమె జీవితంలోకి బలవంతాన ప్రవేశించాలి. క్షమించండి మిమ్మల్నో ముఖ్యమైన విషయం మొదటే అడగటం మర్చిపోయేను. మీరు వివాహితులా?" కుతూహలంగా ప్రశ్నించాడు.

"కాదు!" ఆశ్చర్యంగా చూస్తూ జవాబిచ్చాడు.

ఆయన తేలిగ్గా నిట్టూర్పు విడిచి "చూడండి, యిదంతా ఏదో ముందుగా పన్నిన ఉచ్చులని భ్రమ పడకండి! అలాంటివేమీ లేవు. నేను చాలా సూటిగా ప్రవర్తించే తత్వం గలవాణ్ణి."

"అలాంటి అపోహలకి నేను దూరంలెండి. మీరు చెప్పదలచుకుంది చెప్పండి" సిగిరెట్ 'ఆష్ట్రే' లో ముంచాడు.

"నేను చెప్పే ముందు ఒక సంగతి చెప్పండి. మీరు విశాల గురించి ఏమేమి విన్నారు?"

భానుమూర్తి ఆశించని ఆ ప్రశ్నకి కాస్త తబ్బిబ్బయ్యాడు.

"విన్నవన్నీ నిజంకావాలని లేదుగా?"

"అన్నీ అబద్ధాలు కావు కూడాను! మీరు విన్నవేమయి ఉంటాయో కూడా నేనే చెబుతాలెండి. విశాల పెళ్ళి కాక మునుపే తల్లి అయిందని, వచ్చిన సంబంధాలన్నీ నిరాకరిస్తుంటుందని అవునా?"

"మొదటి విషయం గురించే నాకింకా నమ్మకం కుదర్లేదు."

"మీరు నిరభ్యంతరంగా నమ్మొచ్చు" కుండ బ్రద్దలుకొట్టినట్లు చెప్పాడు.

భానుమూర్తి ఆయన ముక్కుసూటి తనానికి అబ్బురపడ్డాడు.

"అయితే ఆ పసికందు..."

"మాకు సంబంధించినంత వరకు మరణించినట్లే!"

భానుమూర్తి ఒక్క నిమిషం ఏమీ మాట్లాడలేకపోయేడు.

అంతలోనే లేచి "నాకు శలవుయిప్పించండి" అని చేతులు జోడించాడు.

"అదేం?!" అన్నాడు తెల్లబోతూ ఆనందరావు.

"ఇంతవరకూ మీ మాటల్ని వింటూ, సమాజాన్నీ పరిస్థితుల వైపరీత్యాన్నీ ధైర్యంగా ఎదుర్కోగల ధీరులనుకున్నాను. హంతకులనుకోలేదు."

"బాబూ!" ఆయన రెండు చెవులూ మూసుకుని ఆక్రోశించాడు.

మొహంలో విపరీతమయిన బాధ, కలవరం కన్పించాయి.

"నా అంతరాత్మ సాక్షిగా అలాంటి పాపకార్యం చెయ్యలేదంటే నమ్మరేవా నాయనా?" అప్రయత్నంగానే ఆయన నోట ఏకవచనం వచ్చింది.

ఆయన మొహంలోకి పరిశీలనగా చూశాడు, ఒక్క క్షణం.

భానుమూర్తికి ఆయన మాటల్లో నిజాయితీ తోచింది.

"మరి మీరన్న మాటలకి అర్థం?"– సమన్వయం కుదరక ప్రశ్నించాడు.

"అంతా చెబుతాను. అలా స్థిమితంగా కూర్చో" మెల్లగా అతని మాటల వల్ల తిన్న 'షాక్' నుండి తేరుకుంటూ అన్నాడు.

భానుమూర్తి కూర్చున్నాడు.

* * *

'రూఫ్ గార్డెన్'లో నేలమీద కూర్చుని రంగురంగుల కాగితాలను రకరకాల డిజైన్లలో కత్తిరిస్తున్న విశాల, తనకంత దూరంలో — ఎవరో నిలబడి గమనిస్తున్నట్లనిపించి, చటుక్కున తలెత్తి చూసింది.

భానుమూర్తి చూస్తున్నాడు.

ఇద్దరూ ఓ నిముషం తబ్బిబ్బయ్యారు.

చేతిలోంచి కత్తెర జారవిడిచి "మీరు.. మీరు..." అంటూ మాటలు దొరక్క ఇబ్బంది పడింది. లేచి నిలబడి, సర్దుకుంది గాభరాగా.

"క్షమాపణ చెప్పుకోవటానికి వచ్చాను..." మందహాసంతో అన్నాడు.

ఆమెలో ఒక్కమాటుగా ధైర్యం ప్రవేశించినట్లయింది.

"మీరు ఇక్కడికి కూడా రాకుండా ఉంటే చాలా ఆనందించే దానిని..." కటువుగా చూస్తూ అంది.

"థాంక్స్! వస్తాను..." తిరిగి వెళ్ళిపోతున్న అతణ్ణి చూస్తూ మనసులోనే నొచ్చుకుంది.

తనెందుకలా అంది!

మెల్లగా మెట్లుదిగి వస్తుంటే, మేనమామ ఎదురుపడ్డాడు.

"విశాలా! అతను వెంటనే వెళ్ళిపోయాడేం?"

"ఎవరు మామయ్యా?"

"భానుమూర్తి!"

"ఆయన మీకెలా తెలుసు?"

"నాకు తెలియటమేమిటమ్మా – నిన్ను చూడాలని వచ్చాడు. పైకి వెళ్ళమని చెప్పాను..."

"ఎవర్ని బడితే వాళ్ళనట్లా పంపిం

చెయ్యడమేనా మామయ్యా ?" నొచ్చు కుంటూ అడిగింది.

"ఇప్పుడేమయిందమ్మా? అతనేమన్నా అసభ్యంగా మాట్లాడాడా ?"

"అతను కాదు - నేనే అసభ్యంగా మాట్లాడేను ?"

"అదేమిటి ?!" తెల్లబోయాడు ఆనందరావ్.

"అదంతే మామయ్యా! నీకు తెలుసు. నేను అందరితోనూ కలవలేనని, ఎవరితోనూ మాట్లాడటానికిష్టపడనని...... మరి ఎందుకతన్ని పైకి పంపించినట్లు ?"

"అతని వల్లనే నువ్వు రాజీనామా చేసినట్లు, నువ్వు తనని క్షమించని పక్షంలో తనుగూడా రాజీనామా చెయ్యదల్చినట్లూ చెబితే, 'సరే వెళ్ళి మాట్లాడ'మని పంపించాను. మనకంటే ఉద్యోగం అక్కర్లేదుగానీ, అందరికీ అలా కాదుగా! నీ వల్ల ఒక వ్యక్తికి అపకారం జరగటం నా కిష్టం లేకపోయింది..."

విభ్రాంతితో వింది !

"ఏమిటి ? ఇవన్నీ చెప్పాలని వచ్చాడా... అతను !"

"ప్రిన్సిపాల్‌తో చెప్పు మామయ్యా- అతని రాజీనామా ఒప్పుకోవద్దని చెప్పు.."

నవ్వేడు ఆనందరావు.

"ప్రిన్సిపాలంటే ఇండియా ప్రెసిడెంటు అనుకుంటున్నావా ఏమిటి? ఈరోజు కాకపోయినా 'రిలీవరు' రాగానే ఒప్పుకుని తీరాలి కదా ?"

"వాటీజ్ దిస్ మామయ్యా ! నాకూ అతనికీ లంకె ఏమిటి ? నేను ఉద్యోగం మానేస్తే అతనూ మానెయ్యటం ఏమిటి నాన్సెన్స్..." చిరాకు పడింది.



"నేనేం చెప్పగలను విశాలా ! అవన్నీ నువ్వు అడిగి తెల్సుకోవాల్సింది మరి. లేదా, ప్రిన్సిపాల్‌కి ఫోను చేసి నీవు రాజీనామా విత్‌డ్రా చేసుకోబోతున్నావని చెప్పమంటే చెబుతాను..."

"నేనెందుకు విత్‌డ్రా చేసుకోవాలి !" మొండిగా ప్రశ్నించింది.

"నీ వల్ల ఒకరి ఉద్యోగం నిలవటానికి-!"

"నీ యిష్టం వచ్చినట్లు చెయ్యి... నాకేం తెలియదు..." విసురుగా తన గదిలోకి వెళ్ళిపోయింది.

ఆనందరావు నవ్వుకున్నాడు.




"గుడ్ మార్నింగ్ సర్ !" - అంటూ విష్ చేస్తూ, తన సీటు వైపు దూసుకు వెళుతున్న విశాలకేసి 'కొలీగ్స్' విస్మయంతో చూశారు.

"వెరీ గుడ్ మార్నింగ్ టూయూ..." గంభీరంగా బదులు పలికి, సీరియస్‌గా ఏదో రాసుకుంటున్న భానుమూర్తికేసి మరీ విడ్డూరంగా చూశారు.

వయొలెట్ వాళ్ళిద్దర్నీ మార్చిమార్చి చూసింది.

స్వామి, రాజు అయోమయంగా ఒకరికేసి ఒకరు చూసుకున్నారు.

వాళ్ళకేమీ అంతుపట్టకుండా ఉంది.

రాజీనామా యిచ్చిన విశాల డ్యూటీకి రావటం ఏమిటి ?

భానుమూర్తి నీడసైతం అంటని మనిషి, తనంత తాను విష్ చెయ్యటం ఏమిటి ?

ఏమిటీ వైష్ణవమాయ !

భానుమూర్తి ఏదన్నా వశీకరణ మంత్రం ప్రయోగించాడా ?

లేక - యిన్నాళ్ళూ విశాలని పీడించిన దెయ్యం వదిలిపోయిందా !

అప్పుడప్పుడు యిలాంటి అద్భుతాలు జరిగిపోతాయి కాబోలు అనుకున్నారు మనసులో.

'టైమ్ టేబుల్' ప్రకారం ఎవరి



క్లాసులోకి వారు వెళ్ళేరు.

"మీ క్లాసు నేను తీసుకోబోతున్నాను" అంటూ సమాధానానికి ఎదురుచూడకుండా వెళ్ళేడు భానుమూర్తి. విశాల చూస్తుండిపోయింది.

అతన్ని చూడగానే విద్యార్థులు సంతోషంతో పొంగిపోయారు.

యథాప్రకారం ఓ పావుగంట సరదా కబుర్లు చెప్పాడు. కాస్సేపు నాటకాల గురించి, సినిమాల గురించీ మాట్లాడేడు.

విద్యార్థులు 'మూడ్'లోకి రాగానే పాఠం ప్రారంభించాడు.

ఈ విధానం చాలా నచ్చింది వాళ్ళకి!

'అవర్' పూర్తి కాబోతుండగా ఒక విద్యార్థిని లేచింది.

"మేముచాలావెనకబడి ఉన్నాంసార్! మీరు క్లాసులు తీసుకోకపోతే ఈ సబ్జక్టులో తప్పడం ఖాయం."

"లోగడ ఒకమాటు చెప్పాను కదా! మీరట్లా అనటం మంచిదికాదు. విశాలాక్షి గారుకూడా చక్కగా చదువుకున్నారు. ఫస్టు క్లాసులో ప్యాసైనారు."

"కానీ, అర్థమయేలా చెప్పలేరు."

"అర్థంకానివిషయాలు అప్పటికప్పుడు అడిగి తెలుసుకోవటం మీ ధర్మం"

"పాఠం మధ్యలో ప్రశ్నలు వేయొద్దంటారు సార్. మరి సందేహాలు ఎలా తీర్చుకోవాలి?" మరో విద్యార్థి ఫిర్యాదు.

అంతలో గంట మోగింది.

"ఓ.కే, మళ్లీ మాట్లాడుదాం" అని బయటకొచ్చేశాడు భానుమూర్తి ఆలోచిస్తూ డిపార్ట్‌మెంట్ లోకడుగుపెట్టాడు.

విశాల బుగ్గన చెయ్యి ఆన్చుకుని, ఏదో దీర్ఘాలోచనలో కన్పించింది.

భానుమూర్తి రాకకి ఉలిక్కిపడి, అంతలోనే సర్దుకుని ఎదురుగావున్న మ్యాగజీన్ తిరగేస్తూ కూర్చుంది.

తన కుర్చీలో కూర్చుని సిగిరెట్ వెలిగించుకున్నాడు భానుమూర్తి. పొగవిడుస్తు విశాలకేసే పరీక్షగా చూస్తుండిపోయాడు.

విశాల ఓరకంటితో ఆ సంగతి గమనించి, యిబ్బందిగా ఫీలయింది.

ఆమెయిబ్బంది తొలిగేలా, వయొలెట్ ప్రవేశించింది గదిలోకి.

రుమాలుతో విసురుకుంటూ "కరెంట్ లేకపోవటం చాలా ఇబ్బందిగా ఉంది సార్"అందితనసీట్లోకి వెళ్ళి కూర్చుంటూ.

సమాధానంగా చిరునవ్వు నవ్వి ఊరుకున్నాడు భానుమూర్తి.

అంతటితో వదల్లేదు-

"నాకెందుకనో చెమట ఎక్కువండీ.. దీనికి రెమిడీ ఏమిటో తెలీడంలేదు.." బాధగా మొహం పెట్టి అంది వయొలెట్.

"మీరు కొవ్వు పదార్థాలు ఎక్కువగా తింటారనుకుంటాను"

"నిజమేసార్! బట్టర్ అంటే మహా యిష్టంనాకు, అయితే, కారణం అదేనంటారా?" కుతూహలంగా అడిగింది.

"కొంతవరకు!'

"అయితే పూర్తిగా మానేస్తాను." సమస్య విడిపోయిన సంతోషంతో అంది నవ్వి.

పూర్తిగా మానెయ్యటంకన్నా మితంగా తినడం మంచిది" అన్నాడు భానుమూర్తి.

"అలాగే సార్" అంది సంబరంగా.

* * *

'షెడ్'లో స్కూటరు పార్కు చేస్తుండగా "మాస్టారూ!" అంటూ వచ్చింది రుక్మిణి.

'ఏమి'టన్నట్లు చూశాడు.

"మీకు రెండు ఉత్తరాలు వచ్చాయి" అంటూ చేతికందించింది.

చించి చూసుకున్నాడు.

ఒకటి తండ్రి నుంచీ–

మరోటి మిత్రుడి నుంచీ–

ఇంకా అక్కడే నిలబడ్డ రుక్మిణి నుద్దేశించి ''థాంక్స్ !'' అన్నాడు. ఉప్పొంగిపోయి "నో మెన్షన్"–అంటూ గబ గబ తమ వాటాలోకి వెళ్ళిపోయింది.

"పిచ్చిపిల్ల !" అనుకున్నాడు నవ్వు కుంటూ.

మేడమీద నిలబడి తమని గమనిస్తున్న కుర్రాళ్ళు నవ్వుకోవటం విన్పించింది భాను మూర్తి కి.

వాళ్ళకేసి చూడగానే ఎరగనట్లుండి పోయేరు!

పైకిఎక్కి, పక్కనుండి వెళ్తూ 'హల్లో బ్రదర్స్! గుడీవినింగ్" అన్నాడు,

"గుడీవినింగ్ సార్" అన్నారు వాళ్ళు గతుక్కుమని.

గదిలోకివెళ్ళి, బట్టలు మార్చుకుని 'బాత్ రూమ్' కెళ్ళగానే–అవుట్ హవుస్ బాత్ రూమ్‌లో నిలబడి మేడకేసిచూస్తున్న రుక్మిణిని గమనించి–కొయ్యబారిపోయేడు!

రుక్మిణి నవ్వుతోంది...తల తిప్పేసు కున్నాడు.

స్నానంచేసి రూమ్‌లోకి తిరిగొచ్చాడు భానుమూర్తి.

ట్రాన్సిస్టర్‌ని ట్యూన్ చేసి వింటూ, అద్దం ముందు నిలబడి తల దువ్వుకో సాగాడు.

మాధవరావు కొడుకు పన్నెండేళ్ళ వాడు తలుపు తోసుకుని లోపలికొచ్చాడు.

"ఏమిటి బాబూ?"వెనుదిరిగి అడిగాడు.

"మా అక్కయ్య ఏవన్నా పుస్తకాలు అడిగి తెమ్మంది..."

భానుమూర్తి భ్రుకుటి ముడిపడింది.

'రుక్మిణి ధోరణికి మొదటే ఆనకట్ట వెయ్యకపోతే ప్రమాదం!' అనుకున్నాడు మనసులో.

అల్మారులో అందంగా అమర్చబడి వున్న పుస్తకాల దొంతరలోంచి రామకృష్ణ పరమహంస జీవిత చరిత్ర తీసి యిచ్చాడు.

కుర్రాడు వెళ్ళి, వెంటనే అయిదు నిమిషాల్లో తిరిగి వచ్చాడు.

చేతిలో అదే పుస్తకం వుంది. అందు లోంచి చిన్న కాగితం మడత తొంగి చూస్తోంది. పుస్తకం అందుకుని, కాగితం విప్పి చదివాడు—

'మాస్టారూ !

మీ దగ్గర డిటెక్టివ్‌లు కానీ, యింకా అలాంటి పుస్తకాలేమన్నా వుంటే పంపిం చండి...నేనే వద్దామంటే, మీ పక్క గదుల వాళ్ళు తినేసేలా చూస్తుంటారు.

మీ

—రుక్మిణి'

తలెత్తి చూశాడు.

కుర్రాడు గది నలుమూలలాపరిశీలనగా చూస్తున్నాడు.

చీటీ వెనకాల 'నా దగ్గర నువ్వడిగిన పుస్తకాలు లేవు. అలాంటివి నేను చదవను. ఇంగ్లీషు పుస్తకాలున్నాయి. కావాలంటే పంపుతాను' అని రాసి కుర్రాడి చేతి కిచ్చాడు.

అందుకుని బాణంలా దూసుకు పోయాడు వాడు.

తెలుగు పుస్తకాలు నిజంగానే తన దగ్గర లేవు.

వెళ్ళిన కుర్రాడు ఎంతసేపటికీ రానందుకు సంతోషంగా 'అమ్మయ్య' అనుకున్నాడు భానుమూర్తి.

* * *

"మిస్ విశాలా! మీ క్లాసునుండీ తరచుగా కంప్లయింట్స్ వింటున్నాను. ఏ కారణం చేతయినా మీ మనసు బాగా లేక, లెక్చర్ సరిగా యివ్వలేకపోతుంటే లీవుకి అప్లై చెయ్యండి. నేను రికమండ్ చేస్తాను..."

బాణం దెబ్బతిన్న లేడిలా అతనికేసి చూసింది విశాల.

ఆమెకు లోపల్నుండి ఉక్రోషం, ఉద్రేకం పొంగి వచ్చాయి.

"నాకు మనసు బాగాలేదని ఎందుకనుకుంటున్నారు?"

"చెప్పానుగా....మీ స్టూడెంట్స్ మిమ్మల్ని ఫాలో కాలేకపోతున్నారు. పైగా మీరు టీచింగ్ ప్రోగ్రామ్ ప్రకారం చెప్పటంలేదు. బాగా వెనకబడి వున్నారు. అవన్నీ ఎప్పుడు కంప్లీట్ చేస్తారు?"

"స్పెషల్ క్లాసులు పెడతాను..." పట్టుదలగా అంది.

నవ్వేడు భానుమూర్తి.

"చూడండి మిస్ విశాలా! పోర్షన్లు



పూర్తి చెయ్యటమే ధ్యేయంగా పెట్టుకుంటే స్పెషల్ క్లాసుల్లేకుండానే పూర్తి చేయవచ్చు. కానీ, మన ఉద్దేశం అది కాకూడదు. స్టూడెంట్స్‌కి బాగా అర్థమయి, వాళ్లు దానిని రీ ప్రొడ్యూస్ చేసే స్థాయిలో టీచ్ చెయ్యాలి. లేకపోతే మన జాబ్‌కి అన్యాయం చేస్తున్నట్లే! ప్రశాంతంగా ఆలోచించి చూడండి....మీరే అంగీకరిస్తారు..."

విశాల సీరియస్‌గా మొహంపెట్టి, న్యూస్‌పేపరు అందుకుంది.

ఏమిటీ దబాయింపు?

'హిప్నటైజు' చేస్తున్నట్లు కళ్ళలోకి చూసి చెప్పటం దేనికి?

తను లొంగిపోతాననుకుంటున్నాడేమో.

తనకూ ఆత్మవిశ్వాసం వుంది.

ఇంతలో 'అవర్ బెల్' మ్రోగింది.

లేచి క్లాసువైపు దారి తీసింది.

లోపలికి అడుగుపెడుతుండగానే ఎవరో పెద్దగా ఆవలించారు.

సీరియస్‌గా చూసింది. నిశ్శబ్దంగా వుండిపోయారు.

పాఠం ప్రారంభించే ముందు పది నిమిషాలు ప్రశ్నలు వేసింది. ఎవరూ సరిగా సమాధానాలు చెప్పలేదు.

"ఏమిటి, ఏమైంది మీకు? నేను చెప్పేవి బుర్రకెక్కటం లేదా?" కోపంగా అడిగింది.

ఓ కుర్రాడు లేచాడు.

"సారీ మేడమ్! మీరెందుకనో ఇటీవల సరిగా చెప్పలేక పోతున్నారు. పూర్వంలాగా పాఠాలు అర్థం కావటం లేదు..."

ఆడపిల్లలకేసి చూసింది.

ఒక అమ్మాయి లేచి "అవును మేడమ్!" అంది.

విశాలకి ఒక్కమాటు ప్రపంచం గిర్రున తిరిగినట్లయింది!

ఏమిటి?

తను పూర్వంలా చెప్పలేకపోతోందా?

వీళ్లు...వీళ్ళిలా ఎందుకు తనమీద కక్ష గట్టారు? భానుమూర్తితో తనమీద ఫిర్యాదులు చేయబట్టే, తనను శలవు పెట్టమన్నాడు. లేకపోతే, అతనంత చులకనగా అనగలడా?

'మీ క్లాసునుండి కంప్లయింట్స్ విన్నా' నన్నాడు పైగా!

నిజంగా వీళ్ళకి చదువుమీద శ్రద్ధ తగలడిందా? తనంటే మొదటి నుంచీ అందరికీ ఒక తేలికభావం..కానీ-ఎవరూ తనముందు అవమానకరంగా ప్రవర్తించలేదింతవరకూ.. అందుకు కారణం తన మేనమామ పలుకుబడేగాక, తన గంభీరత్వంకూడా!

ఇన్నాళ్ళకి-ఆ పరిస్థితి తారుమారయిందంటే, అందుకు కేవలం భానుమూర్తే కారణం! అవును..అతనే కారణం.

కానీ, తను అతన్నెలా సాధిస్తుంది? ఎలా జయిస్తుంది? తన్ను తాను రక్షించుకోవడమే సమస్యగా పరిణమించిందిప్పుడు.

"మేడమ్! లెసన్ ప్లీజ్''

ఉలిక్కిపడి ప్రస్తుతంలోకి వచ్చింది. ''ప్లీజ్ డూ సెల్ఫ్ స్టడీ..' అని చకచక డిపార్ట్‌మెంట్ కేసి నడిచింది.

భానుమూర్తి ఒంటరిగా కూర్చుని ఇంగ్లీషు పేపరు చూస్తున్న వాడల్లా, విసురుగా వస్తున్న విశాలకేసి ఆశ్చర్యంగా చూశాడు.

అతను ప్రశ్నించేలోగానే "అమ్మాయ్ నాట్ ఫీలింగ్ వెల్'' అంది కణతలు గట్టిగా అదుముకుంటూ విశాల.

వెంటనే లేచి, ఆమె క్లాసు తీసుకోవ డానికెళ్ళాడు భానుమూర్తి.

* * *

ఆనందరావ్ తృప్తిగా నవ్వేడు.

"మారుతుంది . . ఇంకా మారుతుంది. మీరు విశాలని కొత్త మనిషినిచేయగలరు మీ మీద నాకా నమ్మకంఉంది.."అన్నాడు భరోసాగా.

"కానీ-మనిద్దరం ఒక ప్రణాళిక వేసు కుని ఆమెను మార్చబూనామన్న సంగతి బయట పడితే గొడవవుతుంది !"

"అది నాకు వదిలెయ్యండి! మీరు విశాలని మళ్ళీ మామూలు ప్రపంచంలో పడేసే నా జీవితాశయం నెరవేరినట్లు భావిస్తాను. అందుకు నావల్ల చాతనయిన దేమి చెయ్యమన్నా సంతోషంగా చేస్తాను."

''నేను బహుశా, మీనుండీ ఏమీకోరను నాకు ప్రతిఫలం ఆశించే అలవాటులేదు."

''అయితే, పెద్దవాణ్ణిగనుక, అడిగి పొందే అర్హత ఉన్నది గనుక నేనే అడుగుతాను."

భానుమూర్తి మందహాసం చేస్తూ "ఏమడుగుతారు ?" అన్నాడు.

"అవసరం కలగనియ్యండి! అప్పు డెలాగు వింటారు కదా ?"

''సరే-మీ యిష్టప్రకారం చెయ్యండి గానీ, నన్ను మీరు మరీ పెద్దవాడిని చేసెయ్యటం నాకు నచ్చలేదు !"

"అంటే ?!"

"మీరు - అని మన్నించటం దేనికి ? ఆప్యాయంగా ఏకవచనంతో పిలవండి, ఆనందిస్తాను."

ఆయన కళ్ళలో నీళ్ళు చిప్పిల్లాయి.

"పిలుస్తాను. తప్పకుండా పిలుస్తాను!"

భానుమూర్తి తృప్తిగా లేచేడు.

"మళ్లీ మనం ఎప్పుడు కల్సుకుందాం?"

"మీరు నన్ను ఎప్పుడు చూడదలుచు కున్నా-నేరుగా నా రూమ్‌కొచ్చేయ్యండి. అదీ మీ ఇల్లేగా? ఇలా హోటల్‌లో కలు సుకోవాలంటే ముందుగా అప్పాయింట్ మెంటులాంటి బాదరబందీలున్నాయి."

"సరే-యికనుండీ నీరూమ్‌కేవస్తాను." వెళ్ళటానికి లేచాడు ఆనందరావు.




"గుడ్‌మార్నింగ్‌సర్!" అంటూ విష్ చేసి ప్రిన్సిపాల్‌కెదురుగా కూర్చున్నాడు భానుమూర్తి.

''గుడ్‌మార్నింగ్ టూయూ.. విశాల లీవ్‌కి అప్లయిచేసిందికదా ? టరమ్ పరీ క్షలు దగ్గరకొస్తున్నాయ్.. మీరుసమర్థించు కోగలరో లేదో కనుక్కుందామని కబురు చేశాను." అన్నాడాయన.

"అవన్నీ నాకు విడిచిపెట్టి మీరు నిశ్చింతగా ఉండండి. పరీక్షలకెలాంటి యిబ్బందీ రాదని హామీ యిస్తున్నాను" అన్నాడు భానుమూర్తి.

"ఐనో..ఐనో..యూకెన్ మానేజ్.." అన్నాడాయన సంతోషంగా.

"సరే-నేను వెళ్ళొస్తాను-క్లాసుతీసు కోవాలి.." అన్నాడు కుర్చీలోంచిలేచి.

ఆయన నవ్వి" విశాలక్లాసేగా? ప్లీజ్ ప్రొసీడ్." అన్నాడు.

భానుమూర్తి నేరుగా విశాల క్లాసు కెళ్ళాడు.

అతన్ని చూస్తూనే స్టూడెంట్లు సంబర పడ్డారు.

వాళ్ళ సంబరాన్ని రెట్టింపు చేస్తూ, ఆరోజునుండీ వాళ్ళక్లాసుని తనే తీసుకో బోతున్నట్లు చెప్పాడు.

పోర్షన్లు సకాలంలో పూర్తి కావాలంటే స్పెషల్ క్లాసులు తప్పవనిపించింది. ఆ మాటే స్టూడెంట్సు నడిగేడు.

వాళ్ళు సంతోషంగా రావడం ప్రారంభిం చారు.

పాఠాలు జరుగుతున్నాయి.

ఆదివారం ఉదయంపూట ప్రైవేటు క్లాసులు పెట్టసాగేడు.

మొదట్నించీ సబ్జెక్టు రివిజన్ చేసి చిన్న, చిన్న ప్రశ్నలకి సమాధానాలు చెప్పటం అలవాటుచేస్తూ—విషయం వాళ్ళ మనస్సుల్లో ముద్రించుకు పోయేలా కృషి చేశాడు.

విశాల సరిగా చెప్పలేదన్న పాఠ్య భాగాలన్నీ తిరిగి చెప్పాడు. అవసర మయిన నోట్సుయిచ్చాడు.

రెండు రోజుల తర్వాత 'క్లాసు టెస్టు' పెట్ట బోతున్నాననీ, ఫస్టు మార్కు, సెకండు మార్కు తెచ్చుకున్నవాళ్ళకి బహుమతులిస్తానని ప్రోత్సాహించాడు భానుమూర్తి.

పట్టుదలగా చదువుకొచ్చి పరీక్షలు రాశారు విద్యార్థులు. పేపర్లు తనుదిద్ద కుండా రాజు, స్వామి, వయొలెట్ లకు మూడు భాగాలుచేసి యిచ్చి 'మెరిట్'లో ఉన్నవాళ్ళను విడిగా తెలియ జెయ్య మన్నాడు.

పేపర్లు దిద్దుతూ వాళ్ళుఎంతో ఆశ్చర్య పోయేరు

పాతిక మంది విద్యార్థులు అరవైపైన తెచ్చుకున్నారు మార్కులు. వాళ్ళసమా ధానాలు క్లుప్తంగా, సూటిగా విషయాన్ని స్పృశిస్తూ ఉన్నాయి.

అందర్లోకీ ఎక్కువమార్కులు తెచ్చు కున్నది సుశీల అనే విద్యార్థిని! ఆ అమ్మాయే—విశాల చెప్పిన పాఠాలు అర్థం కావడంలేదని లోగడ చెప్పింది,.

రెండవస్థానం—ఫిర్యాదుచేసినకుర్రాడు సుందరానిది·

ఇద్దరికీ చెరొక పెన్ను బహూకరించాడు భానుమూర్తి

"జీవితాంతం దీన్ని మీ జ్ఞాపకంగా దాచుకుంటాను మాస్టారూ" అన్నాడు సుందరం కృతజ్ఞత నిండిన గొంతుతో.

"నేనూ అంతే మాస్టారూ!" అంది సుశీల వినయంగా

భానుమూర్తి నవ్వి—

"మీరు నన్ను జ్ఞాపకం ఉంచుకుంటే చాలదు. కాలేజీ మిమ్మల్ని జ్ఞాపకం ఉంచు కునేలా మెరిట్ మార్కులు తెచ్చుకో వాలి అప్పుడే మీరు నాకు గుర్తుంటారు" అన్నాడు

"తప్పకుండా కృషిచేస్తాం మాస్టారూ" అన్నారిద్దరూ.

క్లాసులోని యితర విద్యార్థుల్ని ప్రోత్స హిస్తూ "మీరూ పోటీపడి చదవాలి. మీలో ఎవ్వరూ తెలివి తక్కువ వాళ్ళు కాదు. జిజ్ఞాసికి కృషిజోడిస్తే సుశీల, సుందరా లతో సమంగా మార్కులు తెచ్చుకోవచ్చు మీ శక్తిమీద నమ్మకం పెంచుకుని పట్టు దలతోచదవండి. విష్‌యూ ఆల్ ద బెస్ట్"

అని క్లాసులోంచి వెళ్తుండగా, స్టూడెంట్స్ హర్షాతిశయంతో పెద్దగా చప్పట్లుకొట్టారు.

* * *

'శలవు పెట్టి పొరబాటు చేశానా ?" అనుకుంది విశాల చాలామాట్లు, ఇంటివద్ద ఆమెకి బొత్తిగా తోచడమేలేదు

అలాగని కాలేజీకి వెళ్ళి స్టూడెంట్ల ముందు గిల్టీగా నిలబడటానికి మనస్కరించలేదు. మనసంతా చికాగ్గా, అస్థిమితంగా తయారయింది.

రోజంతా బద్ధకంగా, జడపదార్థంలా గడపాలంటే-ఏదో ఆస్పత్రి పాలయినట్లు అన్పిస్తోంది! అంతకు పూర్వం ఎన్నడూ ఆమె యిలాంటి విచిత్రపరిస్థితి అనుభవించి ఎరగదు.

ఇదంతా భానుమూర్తి రాకవల్ల వచ్చిన మార్పా? ఇంతకు మునుపు ఉన్న డిపార్ట్మెంట్ హెడ్ మాధవరావు గారు ముసలాయన. "అమ్మా, తల్లీ" అంటూ ఆపేక్షగా మాట్లాడేవాడు. అప్పట్లో తనకి ఉద్యోగం చేస్తునట్లే అనిపించేది కాదు. ఇప్పుడు ఉద్యోగ విధులు నిర్వర్తించడం లోనే ఏదో అపసవ్యత తలెత్తింది.

జీవితంలో తొలినుండీ తను శాపోహతురాలే!

తను చెయ్యని నేరానికి శిక్ష అనుభవిస్తోంది.

తనను తనే శిక్షించుకుంటోంది.

మేనమామ ఎంత ఆపేక్షగా చూసినా ఆయనతో చెప్పలేనివి ఎన్నో వుంటాయి.

దీర్ఘంగా నిట్టూర్చింది విశాల.

'పెళ్ళి, పెళ్ళి' అంటూ వేధిస్తాడు మామయ్య.

తన జీవితానికదొక్కటే పరిష్కారమని ఆయన నమ్మకం!

తనలోని లోపాలు పట్టించుకోని మహాత్ములింకా యీలోకంలో ఉన్నారా ?

తోటి ఆడవాళ్ళే తనను చూసి చెవులు కొరుక్కుంటారు! పరిహాసంగా మాట్లాడుకుంటారే...

ఈమగవాళ్ళలో ఎందరు తనని తిరిగి ఆ 'పంకిలం' లోనికి కూలదొయ్యాలని ప్రయత్నించలేదూ?

ఎన్ని వెకిలి వేషాలతో తనను వేధించారూ!

మామయ్య డబ్బు, పరపతి తనను అనుక్షణం ఆదుకున్నాయి గనక సరిపోయింది.

ఇలాగయినా తను బ్రతకగలుగుతోంది 'పెళ్ళి' పేరుతో ఒక వ్యక్తికి లోబడిపోతే-"నేను" అనేది ఆ క్షణం నుంచే మాసిపోతుంది

వ్యక్తిత్వమే చచ్చిపోతుంది

మామయ్య కేంతెలుస్తాయివన్నీ?

ఆడపిల్లకి పెళ్ళి చేయాల్సిన బాధ్యత ఉన్నవాళ్ళు ఎలా ఆలోచిస్తారో, ఆయనా అలాగే ఆలోచిస్తాడు.

ఈ దేశంలో ఆడపిల్లకి పెళ్ళి చెయ్యడంతో తమ బాధ్యతలు తీరిపోయాయని, సమస్యా పరిష్కారం అయిందని తృప్తి పడే అల్ప సంతోషుల జాబితాలోకి మామయ్య కూడా జేరాడు.

'ఆడదానికి, సమస్యలు ఉత్పన్నమయ్యేది పెళ్లి తర్వాతనే!' అని ఎందరికి తెలుసు!

తనని పెళ్లి చేసుకుంటానని ముందుకొచ్చే మహానుభావు లెవరయినా ఉంటే, తన హీన చరిత్ర కప్పి పెట్టగల ఐశ్వర్యాన్ని చూసే!

అలాంటి ఐశ్వర్యాన్ని చాలా చుల

కనగా వాడేసుకుంటారు.

ఐశ్వర్యం తొలగి పోగానే, మళ్లీ తను– నీటి బయటి చేప!

తన కళంకం మరింత అధికంగా ఆ వ్యక్తికి కన్పిస్తుంది.

హింసించటం ప్రారంభిస్తాడు!

ఇది కేవలం తన ఊహ కాదు. కల్పించుకున్న భయ హేతువులంత కన్నా కాదు.



కళ్ళముందు నడిచే జగన్నాటక రంగం మీద ఎన్నో పాత్రలు రుజువు చేస్తున్న నగ్నసత్యం!

లేక, తనకోసం ప్రత్యేకంగా ఓ అవతార పురుషుడు ఉద్భవించి, ఉద్ధరిస్తాడని ఎలా భ్రమ పడటం?

ఈ విపరీత కాలంలో అలాంటి వ్యక్తులెవరుంటారు?

ఎవరుంటారు?!- విశాల వియుక్తాలోచనల మధ్య వూగిసలాడింది. ఇంతలో- 'కాలింగ్ బెల్' మోగింది.

ఉలిక్కిపడి, ఆలోచనల్లోంచి తేరుకుంది విశాల.

మామయ్య యిప్పుడే రాడే!

పని మనిషి తలుపు తీయటం, భానుమూర్తి లోపలికి రావటం క్షణాల మీద జరిగింది.

'సోఫా'లోంచి లేచి ఆశ్చర్యంగా చూస్తూ నోటిమాట లేకుండ నిలబడి పోయింది విశాల.

అతనోక్షణం- అక్కడే నిలబడి, ఆమె మొహం కేసి చూశాడు.

ఇద్దరి చూపులూ క్షణం సేపు కలిశాయి.

"ఆనందరావు గారు లేరా?"

"లేరు..."

అంతలో పని మనిషి కల్పించుకుని "కూర్చోండి బాబూ" అంది- మర్యాద పూర్వకంగా.

ఇంకా అతను అక్కడే సంశయంగా నిలబడి ఉన్నాడు.

"కూర్చోండి" అంటూ ఎదురుగా ఉన్న సోఫా చూపింది విశాల.

వచ్చి కూర్చున్నాడు.

"మీరూ కూర్చోండి"

యాంత్రికంగా కూలబడింది.

"మీకొక సంతోషకరమైన వార్త!"

'ఏమిటది?' అన్నట్లు చూసింది.

"మీ క్లాసులో ఈ మాటు చాలా మంది అరవై పైగా మార్కులు తెచ్చుకున్నారు! ఒక్కళ్లూ తప్పలేదు..." చిరునవ్వు నవ్వేడు.

'అంతే కద' అన్నట్లు చూసి "అందులో నా గొప్ప ఏముంది లెండి !" అంది పెడసరంగా.

"తప్పకుండా మీ గొప్పే" నవ్వుతూ అన్నాడు భానుమూర్తి.

"నేను డివోషన్‌గా ఎన్నడూ టీచ్ చెయ్యలేదు. డ్యూటీగా చెప్పాను. కాబట్టి ఎలాంటి క్రెడిటూ తీసుకోలేను"

"పోనీ, ఇహ నుంచైనా డివోట్ చెయ్యవచ్చుగా"

"నా వల్లకాదు !"

"ముమ్మాటికీ మీ వల్లనే అవుతుంది!"

ఆమెకు చటుక్కున కోపం వచ్చింది.

"నేను అనే మాటకి వ్యతిరేకం అంటారెందుకు ?"

"మీరన్న మాటల్లా అవుననాలని మన మధ్య ఒప్పందాలేమీ జరగలేదే !"

"సిల్లీ రియల్లీ సిల్లీ!" చిరాగ్గా తనలో తను గొణుక్కుంటూ మొహం చిట్లించుకుంది.

"వెరీ కరక్ట్! మీరెంత సిల్లీగా ప్రవర్తిస్తున్నారో ఇన్నాళ్ళకు తెల్సుకున్నారు. చాలా సంతోషం !"

ఆమె కోపం పై మెట్టెక్కింది.

"బై దిబై మీరు నన్నెందుకిలా వేధిస్తున్నారు ?"

"నేనలా అనుకోవటం లేదే !"

"కానీ నేను అనుకునేలా చేస్తున్నారు"

నిందగా అంది.

"అది నా అపరాధం కాదేమో"

"ఏది కాదు?" నిగ్రహం కోల్పోతోంది.

"మీలో కలిగే వింత ఊహలకి నేను బాధ్యుణ్ణి కాదు"

అతని సమాధానాలు కంపరమెత్తిస్తున్నాయి, ఆమెకు.

"మనస్సాక్షిగా చెప్పండి వచ్చిన దగ్గర్నుండీ మీరు నా మీద ప్రత్యేకమయిన ఆసక్తి చూపటం లేదూ? నేనెంతగా తప్పించుకు తిరుగుతున్నా, అడుగడుగునా ఎదురు నిలబడి వేధించటం లేదూ? మీరు ఉన్నత విద్య చదివిన వారూ, నలుగురికి దారి చూపవలసిన వారూ, సంస్కారం మరచి ఇలా ప్రవర్తిస్తుంటే ఏమనుకోవాలి?"

పక పక నవ్వేడు భానుమూర్తి.

ఆమె విడ్డూరంగా చూస్తోంది. అందులోనే కొండంత కోపం.

"ఉన్నత విద్య, సంస్కారం" నొక్కి పలుకుతూ ఆమెకేసి గుచ్చుతున్నట్లు చూశాడు.

"ఇవి ఒకళ్ళకి చెప్పటం వరకే గానీ ఆచరించడానిక్కాదు గదూ?"

"ఏమిటి మీ ఉద్దేశం"

"నేను మీ పట్ల ప్రవర్తిస్తున్న విధానానికి కారణం మీరే!"

"నేనా!?" ఆమె నిర్ఘాంత పోయింది.

"అవును నిస్సందేహంగా మీరే? ఉన్నత విద్యా సంస్కారాల్ని గురించీ మాట్లాడే మీకు, ఎదుటి మనిషిని గౌరవించడం రాదు. మీ పట్ల చూపిన మర్యాదను గ్రహించుకోలేని అమాయకులు మీరు. నలుగురిలో మసలుతూ నన్నంటుకోకు నామాల కాకి అన్నట్లు ప్రవర్తించడం మీకే చెల్లింది!

"నేను కాలేజీలో అడుగు పెట్టిన మొదటి రోజున ఎలా ప్రవర్తించారో ఒక మాటు జ్ఞాపకం తెచ్చుకోండి! చాలా అనాగరికంగా ప్రవర్తించి, నన్ను గాయపరచారు. మీకొక పాఠం నేర్పాలనే పట్టుదలను నాలో రగిలించారు.

"గుడ్మార్నింగ్ విష్ చేస్తే జవాబియ్యటం తెలియని అసభ్యురాలినని మీరే చెప్పుకున్నారొకమాటు!

"మిస్ విశాలా! మన ప్రవర్తనని బట్టే ఎదుటి వాళ్ళు ప్రవర్తిస్తారనే ప్రాథమిక సూత్రం అర్థం కానప్పుడు, ఇంకేమీ అర్థం కాదు. మీకు ఎవరూ అర్థం కారు.

"నా గురించి కాదు, మీ గురించి మీరు మారాలి! మీరు సృష్టించుకునే ఏకాంతం ఒక జైలు. అందులో చీకటి తప్ప మరేమీ ఉండదు, నిరాశ తప్ప మరొకటి తొంగి చూడదు.

"రోడ్డు మీద ఎంతో మంది ఆడవాళ్ళు వెళ్తుంటారు. అందరి పట్లా ఆసక్తి కలగదు. కొందరు కృత్రిమాలంకారాలతో, వన్నెల విసనకర్రల్లా అలంకరించుకుని నలుగురి దృష్టినీ ఆకర్షించి, వాళ్ళ ఛలోక్తులకు గురవుతారు.

"ఇందులో ఎవరిది తప్పు? చెప్పండి.

"దీనికి మీరు సమాధానం చెప్పగలిగితే, నేనెందుకు మీ పట్ల ఆ విధంగా ప్రవర్తించిందీ అర్థమౌతుంది!

"వస్తాను"

విస విస నడిచి వెళ్ళిపోయేడు భానుమూర్తి.

విశాల చేష్టలుడిగి అతను వెళ్ళిన వేపు చూస్తూండి పోయింది!

* * *

ఆవేశంగా నాలుగు మాటలూ అని



బయటకు వెళ్ళిన భానుమూర్తి, నేరుగా పబ్లిక్ పార్కుకి వెళ్లేడు.

అక్కడ అన్ని వయసుల వాళ్ళూ, ఏదో ధోరణిలో పడి సాయంత్రపు ఆహ్లాద వాతావరణాన్ని అనుభవిస్తున్నారు.

భానుమూర్తి ఏకాంతంగా ఉన్న జాగా వెతుక్కుని వెళ్ళి కూర్చున్నాడు.



జరిగినదంతా ఒకమాటు మననం చేసుకున్నాడు.

'విశాల మారితే యీ సంఘటనతోనే మారాలి! లేదా, జీవితంలో ఎన్నటికీ మారదు' అనుకున్నాడు.

ఆమె మారినా, మారకపోయినాయిటు పైన ఆమెను పట్టించుకోవడం తగ్గించి వెయ్యదలచాడు.

ఆమె ఎలా ప్రవర్తిస్తే తనకేం?

ఆమె తనకు ఎవరని?!

ఇప్పటికే తను అవసరంలేని శ్రద్ధ

చాలా కనబరిచాడు. కొన్ని అపవాదాలు, అపార్థాలు నెత్తి కెత్తుకున్నాడు.

ఇకపైన అయినా తన పని తను చూసుకోవటం మంచిదేమో.

"గుడీవినింగ్ సార్" - పెద్దగా అంటున్న గొంతు 'ఎవరిదా?' అనిఉలిక్కి పడి చూశాడు.

వయొలెట్!

అసాధారణంగా అలంకరించుకుని ఉంది.

రకరకాల సువాసనలు వెదజల్లుతున్నది.

వయ్యారంగా నిలబడి "మీ ఏకాంతాన్ని చెడగొట్టలేదుకదా?"అందికొంటెగా చూసి.

"అలాంటిదేమీ లేదు! కూర్చోండి" అని జాగా చూపేడు.

ఆమె కూడా అతనికి సమీపంలో, పచ్చటి గడ్డి తివాచీ మీద ఆసీనురాలైంది.

"రోజూ ఈ పార్కుకి వొస్తుంటారా?"

"లేదు,యీరోజే...మనస్సేమీ బాగాలేక - కాస్సేపు కూర్చుందామని వచ్చాను!"

"మనసు బాగాలేకనా? ఎక్కడన్నా పారేసుకున్నారేమిటి కొంపదీసి ? లేకపోతే సాధారణంగా రిపేరుకి రాదే?!" చమత్కారంగా నవ్వింది.

తనూ నవ్వేడు భానుమూర్తి.

"జీవితంలో చాలా జాగ్రత్తగా కాపాడుకుంటూ వస్తున్న ఆస్తి అది ఒక్కటే నాకు?"

"విన్నానులెండి,తొల్లి ఆర్యావర్తంబున నివసించిన ప్రవరాఖ్యుడు మీ ముందు ఓడిపోగలడని!" ముసిముసిగా నవ్వింది.

"అంటే?" అర్థంగాక ఆమె భావాలు చదవటానికి ప్రయత్నించాడు.

"ఏముంది? ఘోటక బ్రహ్మచారులని!" చిలిపితనం తొంగి చూసింది కళ్ళలో.

వయొలెట్ చాటు మాటుగా చదివే 'సెక్స్ బుక్స్' ప్రభావం కాబోలు యిది అనుకున్నాడు మనసులో.

"అన్నట్లు ఏమిటిలా వచ్చారు? రోజూ వస్తుంటారా ?" ఆమె ప్రశ్ననే తిరిగి వేశాడు.

అదొకలా చూసి "దాదాపు రోజూ వస్తుంటాను!" అంది.

"ఐసీ..." అన్నాడు.

అంతలో ఎవరో యువకుడు ఈలవేసి 'వయొలెట్!'అని అంత దూరంలో నిలబడి పిలవటం విన్పించింది.

ఆశ్చర్యంగా అటు చూశాడు భానుమూర్తి.

ఆమె తడబాటు దాచుకుంటూ నవ్వి "మా కజిన్ జేమ్స్. కొంచెం పనుంది. మరి వసాను. మళ్ళీ కాలేజీలో కలుసుకుందాం" చేతులు జోడించింది వీడ్కోలుగా.

తనుకూడా నమస్కారం చేశాడు.

జేమ్స్ తో చెట్టాపట్టాలేసుకుని నవ్వుతూ, తుళ్ళుతూ బయటకు వెళ్ళింది వయొలెట్.




'టరమ్' పరీక్షలు పూర్తయినాయి.

లెక్చరర్లకి శలవు రోజులన్నీ పేపర్లు దిద్దటంలో గడిచిపోయాయి.

భానుమూర్తి ఏకాగ్రతగా కూర్చుని అందరికన్నా ముందుగానే పేపర్లు దిద్దేశాడు. మిగతా విరామంలో తనకు సాహిత్యంమీదున్న అభిమానం చెడకుండా రచనలమీద దృష్టి నిలిపాడు.

ఇటీవలి కాలంలో కొన్ని పత్రికల్లో అతని రచనలు వచ్చాయి. అయితే, అతను 'భాను' అనే పేరుతో రాయడం వల్ల చాలా మందికి అతను కవి, రచయిత అనే సంగతి తెలియదు.

కాలేజీ వార్షికోత్సవం ఏర్పాట్ల గురించి మీటింగు ఏర్పాటు చేసిన ప్రిన్సిపాల్, ఆ ఏడాది కార్యక్రమాలకి విద్యామంత్రిని ఆహ్వానించే ఆలోచన వుంది గనుక అభిరుచి, అభినివేశం వున్నవాళ్ళంతా పూనుకుని కార్యక్రమాన్ని రసవత్తరంగా చెయ్యాలని కోరాడు.

'కల్చరల్ అసోసియేషన్' నిర్వహిస్తున్న వ్యక్తి ఇంగ్లీషు లెక్చరర్ విన్సెంట్.

అతను 'షేక్‌స్పియర్' నాటక దృశ్యాలు కొన్ని ప్రత్యేక శ్రద్ధ తీసుకుని సిద్ధం చేస్తున్నాడు.

తెలుగు నాటకాలమీద అతనికి పెద్ద ఆసక్తి లేదు.

అనుభవం అంతకన్నా లేదు!

మిగతావాళ్లలో ఎవరికన్నా అనుభవం ఉండేమోగానీ ఎవరూ ముందుకు రాలేదు.

భానుమూర్తి ఊరుకోలేకపోయాడు.

"మీరు అనుమతిస్తే తెలుగు కార్యక్రమాలు నేను నిర్వహిస్తాను" అన్నాడు.

అందరూ అతనికేసి ఆశ్చర్యంగా చూశారు.

ప్రిన్సిపాల్ పొంగిపోతూ "అనుమతించడమేమిటి, మీ చొరవకి అభినందిస్తున్నాను. ఈ సంవత్సరం కార్యక్రమాల బాధ్యతలన్నీ మీరే తీసుకుంటే బావుంటుందనుకుంటాను. మేమూ కాస్త మార్పు చూడొచ్చు.ఏమంటారు విన్సెంట్‌గారూ?" అనడిగాడు.

అతను మొహానికి గంటుపెట్టుకుని "మీ యిష్టం" అన్నాడు.

ప్రిన్సిపాల్ మరీ బోళాగా "ఇంకేం మన విన్సెంట్‌గారు కూడా సహకరిస్తున్నారు. భానుమూర్తిగారూ! మాకు మీ సత్తా ఏమిటో చూపించాలి" అన్నాడు నవ్వుతూ.

విన్సెంట్ అయిష్టతను కనిపెట్టి "విన్సెంట్‌గారికంటే నాకు ఎక్కువ తెలుసనుకోను! ఆయన ఇంగ్లీషు నాటకాలు చూస్తున్నారుగనుక, ఇంతవరకు కుర్రవాళ్ళే సొంత ఊహలతో తెలుగు ప్రదర్శనలిస్తున్నట్లు తెలిసింది గనుక, వాళ్ళకు కాస్త తోడ్పడాలనే ఉద్దేశంతో ముందుకు వచ్చాను..." అంటూండగానే ప్రిన్సిపాల్ అడ్డుకుని,

"దట్సాల్ రైట్ ! మీరు మనం అనుకుంటున్న ప్రకారం చెయ్యండి..." అనేశాడు.

అక్కడితో ఆ సమావేశం ముగిసింది.

అందరూ బయటకొచ్చేసిన తర్వాత, విన్సెంట్‌తో "అయామ్ రియల్లీ సారీ!" అన్నాడు భానుమూర్తి, అతను అపార్థం చేసుకోరాదన్న ఊహతో.

"నెవర్ మైండ్ !" అంటూనే వెళ్ళిపోయాడతను.

వెనుకనుండి వస్తున్న విశాల అతనికేసి జాలిగా చూసినట్లు తోచింది.

గబగబ 'డిపార్టుమెంట్'వైపు దారి తీశాడు.

* * *

'టరమ్' పరీక్షల ఫలితాలు తెలిశాయి.

విశాల క్లాసు స్టూడెంట్స్ కాలేజీ మొత్తం మీద 'సైకాలజీ'లో సగటు కంటే అధికంగా మార్కులు సంపాయించారు.

మరో విశేషం-ఆమె స్టూడెంట్సయిన సుందరం, సుశీలలు ఫస్ట్, సెకండు మార్కులతో పూర్వపు రికార్డుల్ని అధిగమించటం!

కొలీగ్స్ అందరూ ప్రశంసలతో ఆమెని ఆకాశానికి కెత్తేశారు.

సంతోషంతో ఆమె మనసు దూది పింజెలా తేలిపోయింది.

ఈ సంఘటన ఆమె మనస్తత్వంలో ఎవరూ ఊహించలేని మార్పు తీసుకొచ్చింది.

ఇప్పుడామె మొహం చిరునవ్వులకి నిలయం!

విద్యార్థినీ, విద్యార్థులతో మనసువిప్పి ఆత్మీయంగా మాట్లాడగలుతోంది. కొలీగ్స్‌తో కలివిడిగా ఉంటోంది. ఛలోకులు-నవ్వులు... ఇప్పుడామె మాటల తీరే మారిపోయింది.

స్టూడెంట్సు కదంతా గారడీలా ఉంది!

కొలీగ్స్ కూడా అలాగే ఫీలయ్యారు.

విశాల లేనప్పుడు తెగించి, వయొలెట్ అనేసింది కూడా-

"మాస్టారూ! మీకు ఇంద్రజాలం తెలుసనుకుంటాను..."

"ఏం?" అన్నాడు భానుమూర్తి నవ్వుతూ.

"విశాల లాంటి రాతిని నాతిగా మార్చాలంటే రాముడే మరోమాటు పుట్టాలనుకుంటుండేదాని యిన్నాళ్లూ..."

ఆమె మాటలకి కొలీగ్స్ గలగల నవ్వారు.

వయొలెట్ కేసి చూస్తూ, నిగర్వంగా అన్నాడు భానుమూర్తి-

"ఇదంతా నా ప్రయోజకత్వంగానే ఎందుకను కోవాలి?"

* * *

ఆ రోజు అన్ని క్లాసులకి నోటీసు వెళ్ళింది – వార్షికోత్సవంలో ప్రదర్శనలు యివ్వదలిచినవాళ్ళు 'కాలేజీ ఆడిటోరియమ్'లో సాయంత్రం సమావేశం కావాలని.

భానుమూర్తి అనుకున్న దానికంటే అధికంగానే వచ్చారు. షుమారు ఓ పాతిక మంది ఉన్నారు.

అతనికి సందేహం కలిగింది, వీళ్ళలో కొందరయినా అనుభవం గలవాళ్లున్నారా అని.

విచారించి చూశాక తృప్తికలిగింది.

అందులో కొందరు చక్కగా పాడగలరు.

కొందరు తబల, మృదంగం, గిటార్ వంటి వాద్యాలు వాయించగలరు.

మరి కొందరు నాటకానుభవం ఉన్న వాళ్ళు!

వాళ్ళందర్నీ విభజించి, చిత్తుగా ఒక కార్యక్రమం తయారు చేశాడు.

రెండు నాటికలు అనుకున్నారు.

నాలుగు ఏకపాత్రాభినయాలు – ఒక్కొటీ అయిదు నిమిషాలు! విచిత్ర వేషధారణకు పది నిమిషాలు.

పాటలకు యిరవై నిమిషాలు.

మొత్తం తన కార్యక్రమం గంటన్నరలో ముగిసేలాగ నిర్ణయించాడు.

అప్పుడు వచ్చాడు విన్సెంట్.

కార్యక్రమాలూ, టైమూ చూసి 'యిలాగయితే కష్టం!" అన్నాడు పెదవి విరిచి.

"ఏం?" అన్నాడు భానుమూర్తి ఆశ్చర్యంగా.

"మీవే గంటన్నర పడితే, షేక్స్పియర్ డ్రామాలకి ఒక గంట పడుతుంది! మొత్తం కార్యక్రమాలు రెండు గంటలకి మించరాదని రూలింగ్. మీరు గంటలో ముగించండి..." అన్నాడు.

భానుమూర్తి ఓపిగ్గా అతనికి నచ్చజెప్పాడు, గంటన్నరలో తను యిస్తున్న వెరైటీ ఎక్కువనీ, నాటికలు రెండు ఉన్నాయనీ, అప్పటికీ ఎన్నో జాగ్రత్తలు తీసుకోవాల్సి వస్తుందనీను...

"నా డ్రామాలకు గంట తక్కువయితే కష్టం! సీన్సు పూర్తికావు..." అన్నాడు ఖండితంగా.

భానుమూర్తికి అర్థమయింది, అతనితో వాదించి శుష్కప్రయోజనమని.

"సర్లెండి. ఇంకా టైము ఉందిగా, ఈలోగా నిర్ణయించుకుందాం..." అని ప్రసంగం తుంచి వేసి, వచ్చిన వాళ్లని రెండురోజుల తర్వాత సమావేశం అవమని చెప్పి వెళ్లిపోయాడు.

ఆ రాత్రి స్వయంగా రెండు చిన్న నాటికలు- కాలేజీ జీవితానికి సంబంధించినవి రాశాడు.

అవి పూర్తయే సరికి రాత్రి రెండయింది.

ఒక మాటు రెంటినీ చదువుకుని, తృప్తి పడి లైటు తీసి పడుకున్నాడు.

తెల్లవారు ఝామున అలవాటుగా మెలుకువ వచ్చింది. టైము చూసుకున్నాడు.

అయిదు గంటలయింది.

ఇంకా బయట చీకటిగానే ఉంది.

వెనక తలుపు తెరుచుకుని, చల్లగాలికి బయటకు వెళ్లేడు.

మేడ వైపు నుండి 'అవుట్ హౌస్'కి గబ, గబ వెళ్తున్న రుక్మిణి రూపం దొడ్డి వైపు లైటు కాంతిలో స్పష్టంగా తెలియ వచ్చింది.

అతనికి కొండంత ఆశ్చర్యం కలిగింది!

పిట్టగోడ మీదకు వంగి పరిశీలనగా చూశాడు.

రుక్మిణే! - సందేహం లేదు.

మేడవైపు ఎందుకొచ్చింది ?

దొడ్డివైపున్న తలుపు మెల్లగా తీసుకుని వెళ్లబోతూ, తలెత్తి మేడ మీద నుండీ చూస్తున్న తనని చూసి, గతుక్కుమంటూ యింట్లోకి జారుకోవటంతో అతనికి అర్థమైపోయింది.

రుక్మిణి 'సాలెగూడు'లో చిక్కుకుందని!

మాధవరావుని హెచ్చరించటమా ? మానటమా?

ధర్మసందేహం పీడించిందతన్ని ఒక్క నిమిషం.

'సర్లే-సందర్భం వస్తే చెప్పొచ్చులే' అనుకుని గదిలోకి తిరిగి వచ్చేశాడు. కిటికీ రెక్కలు పూర్తిగా తెరిచాడు.

అప్పుడే తూరుపు దిక్కున తెల్లటి వెలుగులు విచ్చుకుంటున్నాయి.

ఉషః కాలంలో పాటలు పాడే పక్షుల గొంతులు మనోహరంగా విన్పిస్తున్నాయి.

కొబ్బరి ఆకులు ఉల్లాసంగా కదులుతున్నాయి.

అతని మనసులో ఏదో తన్మయత కలిగి కాగితాలందు కున్నాడు.

'అతని మనస్సులో యిప్పుడు ఏదో భావావేశం ఉరకలు వేస్తోంది తప్ప, మిగతావేమీ స్మృతిలో లేవు!

ఉత్సాహంగా రాసుకుంటూండి పోయేడు.




భానుమూర్తి చెప్పిందంతా విన్నాడు ప్రిన్సిపాల్.

"ప్రతి సంవత్సరం ఆయనగారి షేక్స్పియర్ డ్రామాలు చూసి, చూసి విసుగెత్తి ఉన్నాం! పైగా ఈ మాటు గంటసేపు బోరు కొడతా నన్నాడా? అసలు యింగ్లీషు నాటకాలు 'కాన్సిల్' చేసేస్తేపోలా?'

గొడవ మరీ పెద్దదయి, స్టాఫ్ మధ్య అభిప్రాయ భేదాలు రాగలవనిపించింది భానుమూర్తికి.

ప్రిన్సిపాల్‌కి అర్థమయేలా నచ్చజెప్పి, విన్సెంట్ కార్యక్రమాలు అరగంటలో ముగిసేట్లు ఏర్పాటు చేసుకోవలసిందిగా చెప్పమన్నాడు.

ప్రిన్సిపాల్ అంగీకరించి, విన్సెంట్‌ని పిలిచి ఆ మాటే చెప్పాడు. విన్సెంట్ ఏమీ జవాబు చెప్పకుండానే వెళ్ళిపోయేడు.

అతని ధోరణి చూస్తేనే అర్థమయింది భానుమూర్తికి. ఈ వ్యక్తి సహకరించే రకం కాదని. లేనిపోని సమస్యలు ఉత్పన్నం కాకుండా ఉంటే అదే చాలను కున్నాడు మనస్సులో.

నాటికలు, పాటలు, ఏకపాత్రాభినయాల 'రిహార్సల్సు' ప్రారంభం అయినాయి. పాత్రధారులు శ్రద్ధగా హాజరవుతున్నారు.

వార్షికోత్సవాలు దగ్గర పడుతున్నాయి.

మరో రెండు రోజుల్లో కార్యక్రమాలనగా ఒక విచిత్రం జరిగింది!

విన్సెంట్ తన కార్యక్రమాలు రద్దు చేసుకున్నట్లు కాలేజీ అంతా పొక్కిపోయింది.

అప్పటికే కరపత్రాలు, ఆహ్వానాలు అచ్చయిపోయినాయి.

అందులో కార్యక్రమం వివరాలున్నాయి.

రాబోయే అతిథి విద్యామంత్రి!

ఈ వార్త 'ప్రిన్సిపాల్' వరకు వెళ్ళగానే తక్షణం విన్సెంట్‌కి కబురు పంపించాడు.

ఏమీ ఎరగనివాడిలా హాజరయ్యాడు.

"కాలేజీ అంతా ఏదో గాలివార్త ప్రచారంలో ఉంది – ఏమిటిదంతా?" అన్నాడాయన.

"గాలివార్త కాదు, నిజం వార్తే! యింగ్లీషు నాటికలు వేసే పాత్రధారుల్లో యిద్దరి ఆరోగ్యం బాగాలేదు"
వాళ్ళు రంగం ఎక్కే పరిస్థితిలో లేరు!''

ప్రిన్సిపాల్‌కి అతని కుత్సితం అర్థమయింది.

ఆయనకున్నట్లుండి బి.పి. పెరిగిపోతుంది! మొహం జేవురించి కళ్ళు ఎర్రబడుతూండగానే వివేకం మేలుకుంది.

ప్లీజ్, యూ మే గో!'' అన్నాడు ఎంతో బలవంతాన నిగ్రహించుకుంటూ.

విన్సెంట్ విజయ గర్వంతో ఛాతి విరుచుకుని మరీ వెళ్ళేడు.

జేబులోంచి మాత్ర తీసుకుని, ప్యూనుతో మంచి నీళ్ళు తెప్పించుకుని, వేసుకున్నాడు ప్రిన్సిపాల్.

అయిదు నిమిషాలు కళ్ళు మూసుకున్నాక కాస్త సేద దీరాడు.

"భానుమూర్తి గారిని రమ్మను'' అన్నాడు ప్యూనుతో.

అయిదు నిమిషాల్లోనే వచ్చాడు అతను.

"ఇంగ్లీషు కార్యక్రమాలు రద్దు చేస్తున్నాను. ఈ సంవత్సరమే కాదు. నేను ప్రిన్సిపాల్‌గా ఉన్నంత కాలం అవి జరగవ్ రెండు గంటల కార్యక్రమాన్ని మీరే నిర్వహించాలి''

భానుమూర్తి పెద్ద చిక్కులో ఇరుక్కున్నాడు.

అరగంట కార్యక్రమాన్ని ఎలా సిద్ధం చెయ్యటం?

అది కూడ రెండు రోజుల్లో!

"సరే ప్రయత్నిస్తాను'' అన్నాడు అన్య మనస్కంగానే.

ప్రిన్సిపాల్‌కి అతని మీద ఆప్యాయత పొంగింది.

"భానుమూర్తిగారూ! ఇది మీకూ, నాకూ, కాలేజీ ప్రతిష్ఠకి పరీక్ష...ఎలా నెగ్గుకొస్తారో మీదే భారం''

"నిశ్చింతగా ఉండండి! మీకు, కాలేజీకి ఎన్నడూ అప్రతిష్ట రానివ్వను......'' అన్నాడు ఆత్మ విశ్వాసంతో.

"గాడ్ బ్లెస్ యూ'' మనసులోనే ఆశీర్వదించాడతన్ని.

* * *

ఏర్పాట్లన్నీ మామూలుగానే జరిగి పోతున్నాయ్. భానుమూర్తి కంటికి నిద్ర లేదు.

'వార్షికోత్సవం' ఆసన్నమైంది.

రోజంతా కాలేజీలోనే ఉండిపోయేడు.

ఆరోజు భోజనానికి వెళ్ళే తీరిక కూడా లేకపోయింది, భానుమూర్తికి.

రంగస్థలం మీద లైట్లు పర్యవేక్షిస్తూ నీరసంతో తూలి పడిపోయేడు.

రెండు నిమిషాలు వంటి మీద స్పృహ లేదు!

ప్రిన్సిపాల్‌కి కబురు వెళ్ళగానే ఆయన ఆదరా, బాదరా పరుగున వచ్చారు. ఆ సమయంలో ప్రిన్సిపాల్ గదిలో వున్న లెక్చరర్లు కూడా వచ్చారు. వాళ్ళలో విశాల కూడ ఉంది.

వాళ్ళు వచ్చేలోగానే అక్కడి వాళ్ళు చేసిన సపర్యలకి కోలుకున్నాడు భానుమూర్తి. చన్నీళ్ళతో మొహం కడుక్కుంటుండగా అందరూ చేరారు.

"వాట్ హేపెండ్ మిస్టర్ భానుమూర్తీ! ఆర్ యూ ఆల్‌రైట్ ''ఆదుర్దాగా అడుగుతున్న ప్రిన్సిపాల్ ప్రశ్నకి మందహాసంతో ''ఓకే. సర్'' అన్నాడు.

"అసలేమయింది? ఎందుకట్లా జరిగింది ?" ఆయన ఆదుర్దా యింకా శాంతించలేదు.

"అలసటమీద అలా జరిగి ఉంటుందంతే మరేమీ కంగారులేదు" అంటూ తన పనిలోకి మళ్ళబోయినాడు భానుమూర్తి.

"ఆయన యింత వరకు 'లంచ్'కి వెళ్ళలేదుసార్" అన్నాడొక విద్యార్థి ఉండబట్టలేక.

"వాట్ ?" ప్రిన్సిపాల్ అదిరిపడ్డాడు

"మూడుగంటలవుతుంటే మీరింకాభోజనం చెయ్యకుండా ఇక్కడ పనిచేస్తున్నారా?"

"కాఫీ తీసుకున్నానుసార్ నాకిది అలవాటే!" తప్పించుకోబోయాడు.

వైస్‌ప్రిన్సిపాల్ ఛలోక్తిగా "భానుమూర్తిగారింకా బ్రహ్మచారి! ఇంటి దగ్గర చక్కగా వండి 'క్యారేజి' పంపే అర్ధాంగి ఉంటే, ఈ ఉపద్రవం జరిగేదికాదు" అన్నాడు.

గలగల నవ్వేరంతా

ప్రిన్సిపాల్, విశాల మాత్రం నవ్వలేకపోయేరు.

ఆయన చాలా విచార పడసాగేడు.

''మీరు పని వదిలి పెట్టి ఉన్నపళంగా నాతో రండి'' సమాధానం కోసం ఎదురు చూడకుండా తన రూమ్‌కి వెళ్తున్న ప్రిన్సిపాల్ వెంట వెళ్ళక తప్పింది కాదు.

నిద్రలేమి, నీరసంతో ఉన్న భానుమూర్తి మొహంకేసి జాలితో కరిగిపోతూ చూసింది విశాల.

భానుమూర్తి మౌనంగా ప్రిన్సిపాల్ గదిలోకి వెళ్ళేడు.

ఆయన మిగతా లెక్చరర్లందర్నీ పంపేసి, విశాలతో ''అమ్మా! మన ప్యూను నరసయ్యతో అర్జంటుగా మా యింటికెళ్ళి క్యారేజీ నిండా భోజనం పెట్టించుకు రమ్మన్నానని చెప్పు'' అన్నాడు అలసటగా కుర్చీలో కూలబడి. ఆయన ఉండేది కాలేజీకి ఫర్లాంగు దూరంలోనే.

"మీకెందుకు సార్ శ్రమ! నేను హోటల్‌కి వెళ్తానులెండి" అభిమానపడ్డాడు భానుమూర్తి.

"నో నో మీరేమీ చెప్పొద్దు! నేను వినను" ఆయన తీవ్రంగా అనేసరికి కిమ్మనలేదు.

విశాల ప్యూన్‌కి చెప్పి పంపించి, లోపలికి వచ్చింది.

"కూర్చో విశాలా!" అన్నాడాయన.

ఆయనకు ఆమె మీద ప్రత్యేక వాత్సల్యం, చనువూ ఉన్నాయి.

"చూడమ్మా! ఆడవాళ్ళ అండదండలు లేకపోతే మగవాడి కష్టాలు యిలాగే ఉంటాయి. వైస్ ప్రిన్సిపాల్‌గారన్నట్లు భానుమూర్తిగారికి ఓ అర్ధాంగి ఉంటే పొరబాటున కూడా యిలా జరగనివ్వదు"

ఈ మాటలు కేవలం తనతోనే చెబుతూంటే సిగ్గనిపించింది విశాలకి.

తల వంచుకుని మందహాసం చేసింది.

భానుమూర్తికి అసౌకర్యంగా అన్పించింది ఆయన ధోరణి.

వేళ్ళ కొనలు చూసుకుంటూ మౌనంగా ఉండిపోయేడు.

"ప్లీజ్ డోంట్ మైండ్! ప్రిన్సిపాల్‌గా కాదు, పెద్దవాడుగా ఈమాటలు అన్నాను" అన్నాడాయన-భానుమూర్తి కష్టపెట్టుకోకుండా.

"అబ్బే! నేనేమీ అనుకోను సార్. మీకా అధికారం ఎప్పటికీ ఉంది"అన్నాడు గౌరవం చూపుతూ.

మాటల్లోనే నర్సయ్య 'క్యారేజి' తెచ్చాడు.

"నా 'ప్రైవేట్ రూమ్'లో కెళ్ళండి, అన్నీ ఏర్పాటు చేసాడు నర్సయ్య" అని నర్సయ్యతో క్యారేజీని లోపల ఉంచమని చెప్పాడు.

తనకు తానుగ వెళ్ళి ఒంటరిగా కూర్చుని తినాలంటే కాస్త యిబ్బందిగా తోచిందతనికి. అతని సంకోచాన్ని గమనించిన విశాల చప్పున లేచి "పదండి

నేను వడ్డిస్తాను మీరు తిందురుగాని" అంది.

ప్రిన్సిపాల్ ఆమెకేసి మెప్పుదలగా చూసేడు. ఇంకా కదలకుండా కూర్చున్న భానుమూర్తిని "ప్లీజ్ గో" అన్నాడు. భానుమూర్తి కేసే చూస్తున్న విశాల, అతను లేవటం చూసి తను ముందుకి నడిచింది.

నర్సయ్య మంచినీళ్ళ కూజా, గ్లాసు తీసుకొచ్చి సమీపంగా ఉంచాడు.

విశాల నీళ్ళు జల్లి అరిటాకుని శుభ్రం



చేసింది.

కారియర్‌లోంచి ఒక్కొక్క పదార్థమే తీసి ఆకుమీద వడ్డించింది.

భానుమూర్తి వాటికేసి చూస్తున్నాడు.

టొమాటో పప్పు, దొండకాయవేపుడు, ఆవకాయ, వెన్నపూస, అప్పడాలు, పిండి వడియాలు !

చప్పున అతనికి ఇల్లు గుర్తుకొచ్చింది. తల్లి వంటలో సిద్ధహస్తురాలు !

శలవులో వెళ్ళినప్పుడు తృప్తిగా ఆమె చేతివంట తిని, అయ్యరు హోటలు తిండితో విసుగెత్తిపోయిన జిహ్వకి ఆనందం కలిగిస్తుంటాడు.

"తినండీ" అన్న విశాల హెచ్చరికతో, స్మృతులనుండీ తేరుకుని, భోజనాని కుపక్రమించాడు. అవతల యింకా చేయవలసిన పనులుండటం వల్ల, మధ్య మధ్య చేతిగడియారం చూసుకుంటూ ఆదరా బాదరాగా తింటున్న అతన్నిగమనిస్తున్న విశాల–"మెల్లగా తినండి. అవతల రైలు వెళ్ళిపోవటం లేదు" అంది నవ్వుతూ.

"కానీ గడియారం ముళ్ళు పరుగెత్తిపోతున్నాయిగా !" అన్నాడు.

"ఆ గడియారం యిటివ్వండి. భోజనం చేసేవరకు నా దగ్గర ఉంచుతాను" అంది చెయ్యి చాస్తు.

"అవసరం లేదులెండి" అన్నాడు నవ్వుతూ.

నవ్వుల మధ్య అతని భోజనం ముగిసింది.

నర్సయ్యని పిలిచి క్యారేజి సర్దమని చెప్పి, బయటకు నడుస్తూ "థాంక్యూ వెరీమచ్ మిస్ విశాలా!" అన్నాడు భానుమూర్తి. "మెన్షన్ నాట్" అంది నవ్వుతూ.

తర్వాత వార్షికోత్సవ కార్యక్రమాలు అద్భుతంగా వెంట వెంటనే జరిగేయి.

భానుమూర్తి స్వయంగా రాసిన నాటకాలు ప్రదర్శనలో ఉండగా ఎవరో తుంటరులు 'మెయిన్' తీసేశారు ! ఆ చీకట్లో ఆడపిల్లలు కూర్చున్న వైపు గలభా మొదలయింది గానీ, సకాలంలో భానుమూర్తి నియమించిన వ్యక్తులు హాలులో అన్నివైపులా టార్చిలైట్లు ఫోకస్ చెయ్యడంతో, ముగ్గురు వ్యక్తులు పట్టుబడ్డారు ! వాళ్ళు యింగ్లీషు నాటకంలో నటించవలసినవాళ్ళు !

ప్రిన్సిపాల్ వాళ్ళ ముగ్గురినీ పోలీసుల కప్పగించవలసిందని ఆదేశించాడు. లైట్లు రాగానే కార్యక్రమాలు పునః ప్రారంభమైనాయి. మెయిన్ స్విచ్చి దగ్గర యిద్దరు మనుషుల్ని ఉంచాడు భానుమూర్తి.

కార్యక్రమాలు ప్రశాంతంగా కొనసాగాయి.

మరొక యిరవై నిమిషాలు మిగిలింది !

విన్సెంట్ కోసం కేటాయించిన అర్ధగంటలో లైట్లు పోయిన గొడవతో పది నిమిషాలు వ్యయమైనాయి.

మొత్తంమీద ఆనాటి కార్యక్రమాలు అవాంతరాల నన్నింటినీ అధిగమించి, విజయవంతంగా ముగిశాయి.

కార్యక్రమాలను ఆద్యంతముచక్కగా నడిపించిన భానుమూర్తి సేవను కళాశాల ఎన్నటికీ మర్చిపోలేదని మెచ్చుకుని, తుది పలుకులు పలికేరు ప్రిన్సిపాల్.

ఆరోజు కార్యక్రమాలలో ఆనందరావు కూడ ప్రేక్షకులైనారు.

భానుమూర్తి రూమ్‌కి చేరుకునేసరికి

పదకొండు గంటలయింది-ఆనాటి రాత్రి.

మనిషి చాలా అలిసిపోయి ఉన్నాడు. నిద్ర ముంచుకు వస్తోంది. దానికితోడు భుక్తాయాసం.

స్కూటర్ పార్కు చేసి పైకివచ్చే సరికి తన గుమ్మం దగ్గర దిగాలుగా కూర్చున్న మాధవరావు కన్పించాడు

అతనికి ఆశ్చర్యం కలిగింది.

"ఏమిటి మాధవరావ్‌గారూ! ఏమైంది?" అన్నాడు తలుపు తియ్యకుండానే.

"ముందు తలుపు తియ్యండి, లోపల మాట్లాడుకుందాం" అన్నాడు లేచి నిలబడుతూ.

తలుపు తీసి, లైటు వేశాడు.

మాధవరావ్ లోపలికొచ్చి ఆడదానిలా 'బావురు' మన్నాడు

భానుమూర్తి కంగారుగా "ఏమైంది ? ఏమైంది ? ఎందుకలా ఏడుస్తున్నారు" అన్నాడు.

"మా రుక్మిణి నా కొంపముంచేసింది" అన్నాడు.

రుక్మిణి అనగానే విషయం కొంత అర్థమయింది భానుమూర్తికి.

"ఇల్లు వదిలి వెళ్ళిపోయిందా?" అన్నాడు తాపీగా.

మాధవరావ్ ఆశ్చర్యపోతూ "మీకీ గొడవలు ముందే తెలుసా ?" అన్నాడు.

"చూచాయగా తెలుసు. మీతో చెబుతా మనుకుంటుండగానే యీ కాలేజీ పనుల్లో వీలుకాలేదు..ఇంతకీ అసలు ఏంజరిగింది"

"ఇంకా ఏం జరగాలి ? దానికిప్పుడు నాలుగోనెల"

"ఇంట్లోనే వుందా?"

"ఇంకెక్కడికి వస్తుంది? అలాచచ్చినా బావుండేది" కడుపుమంటతో మాట్లాడేడు.

లేచిపోనందుకు కొంత సంతోషించాడు భానుమూర్తి.

"ఇంతకూ ఎవరో చెప్పిందా?"

"నిజం చెప్పొద్దూ - మొదట మీరే నేమోలే, ఎలాగోలా గౌరవంగా వ్యవహారం సర్దుబాటవుతుందనుకున్నాను! తీరా అడిగితే ఒక పట్టాన చెప్పిందా? వారా, వీరా అని అడగ్గా అడగ్గా వాడెవడో రంగారావ్‌ట, వెధవ ! వాడు దొరికేడు దీనికి..."

"రంగారావ్ అంటే ఫుడ్ కార్పొరేషన్‌లో పనిచేస్తున్న కుర్రాడేనను కుంటాను.." సాలోచనగా అన్నాడు భానుమూర్తి.

"ఎవడయితేనేం బాబూ! వాడిప్పుడు నా కూతురు మొగుడు! వాడిని నేను వెళ్ళి అడిగితే కాయకూతలు కూశాడా... కోపంలో హత్యకూడా చేస్తాను. అదేదో మీరే చక్కదిద్దుతారనే ఆశతో కనిపెట్టు కూర్చున్నాను. ఇంతవరకు కూడూ, నీళ్ళూ లేవు యింట్లో ఎవ్వరికీ."

చాలా జాలివేసిందతనికి.

"మీరు యీ రాత్రికి ప్రశాంతంగా పడుకోండి, ఉదయం చూద్దాం గదా?" అన్నాడు

ఆ మాటలతో భరోసాచెంది "యింకా మాకు ప్రశాంతతఎక్కడిది లెండి. బక్క బ్రతుకులింతే వాళ్ళకి సకాలంలో పెళ్ళిళ్ళు చేస్తే యిలా చెడిపొయ్యేవాళ్ళా"? అని గొణుక్కుంటూ వెళ్ళేడు.

భానుమూర్తికి నిద్ర తేలిపోయింది.

పక్కమీద పడుకుని అశాంతిగా అటూ, ఇటూ, దొర్లాడు.

* * *

రంగారావ్ అద్దంలో చూస్తూనిలబడి, తల దువ్వుకుంటున్నాడు.

గుమ్మం దగ్గరనిలబడిన భానుమూర్తి, మాధవరావ్‌లను అదంలోంచే చూసి, ఆశ్చర్యంగా వెనుదిరిగేడు.

"మేము లోపలికి రావొచ్చా రంగా రావుగారూ?" భానుమూర్తి మర్యాద ఉట్టి పడేలా అడిగాడు.

"రండి!" అన్నాడు దుప్పెన బల్లమీద పడేస్తూ.

లోపలకి అడుగు పెట్టగానే కుర్చీలు చూపించాడు.

సంభాషణ ఎలా ప్రారంభించాలో ఒక్క_క్షణం యోచించాడు భానుమూర్తి. ఈలోగా రంగారావే కల్పించుకుని "చెప్పండి!" అన్నాడు.

భానుమూర్తి మందహాసం చేస్తూ "నేను, మాధవరావ్‌గారు వచ్చిన కారణం ఏమై ఉంటుందో కొంత మీరు ఊహించుకునే ఉంటాలి! మనం చదువు కున్న వాళ్ళం, సంస్కారం తెల్సిన వాళ్ళం గనుక యీ సమస్యని ప్రశాంతంగా పరిష్కరించుకోవటం అందంగా ఉంటుంది. ఎవరూ బజారు కెక్కవలసిన పరిస్థితి ఏర్పడదు. మీకు అంగీకారమేనని తలుస్తాను..." ఆగేడు.

అతనొక్కక్షణం మౌనంగా ఊరుకుని "అంగీకారమే-చెప్పండి!" అన్నాడు సర్దుకూర్చుని.

భానుమూర్తికి కాస్త ఆశ కనిపించింది.

"మాధవరావ్‌గారి పరిస్థితి మనందరకూ తెలుసు! కేవలం, ధన లోపం వల్ల ఆయన ఏ పిల్ల పెళ్ళి చెయ్యలేకపోయేరు. వయసొచ్చిన పిల్లల్లో చెలరేగే ఉద్రేకాలకు ఎవర్నీ నిందించి ఉపయోగం లేదు: ఆడ, మగలో యిద్దరికీ యీ వికారం ఉంటుంది. అనునిత్యం జరిగే ఎన్నో కథల్లో మీదీ ఒకటి! యిదేమీ కొత్త కథ కాదు. ఎలాచ్చీ ముగింపు సుఖాంతమా, దుఃఖాంతమా అన్నది మీ చేతుల్లో ఉంది. రుక్మిణి ఎవరో నాకు తెలియదనగలరు మీరు, ఆమె నా ఒక్కడితోనేనా? ఎందరితో తిరిగిందోననే అభాండం వెయ్యడం కూడా చాలా తేలిక. ఇది అందరూ మామూలుగా చేసే పనే. కానీ మీరూ వాళ్ళల్లో ఒకరని నేననుకోలేక పోతున్నాను..."

"ఎందుకలా అనుకుంటున్నారు?"

చిరునవ్వు నవ్వేడు భానుమూర్తి.

"మనుషుల మనస్తత్వాల గురించి క్షుణ్ణంగా చదువుకున్న వాణ్ణి! అంతకు మించి, ఎదుటివారిలో చెడుకన్నా మంచిని వెతుక్కోవాలనే తత్వం నాది..."

రంగారావు అతని మాటల్లోని నిజాయితీకి, మంచితనానికి చలించాడు.

కానీ, యీ విషయం యిలా మలుపు తిరుగుతుందనీ, తను యిలాంటి సమావేశాన్నెదుర్కోవాల్సి ఉంటుందనీ ఆశించని కారణంగా, చప్పున ఒక నిర్ణయానికి రాలేక, తనలో తను మధనపడుతూ కూర్చుండి పోయేడు.

ఆ అవకాశాన్ని జారవిడువలేదు భానుమూర్తి.

డోలాయమాన పరిస్థితిలో ఉన్న మనః స్థితికి, బలమైన సందేశాలందకపోతే అది ఎటు స్థిరపడుతుందన్నది అనూహ్యం! ఆ సమయంలో తీసుకున్న నిర్ణయాలకు చాలా శక్తి ఉంటుంది.

ఈ విషయం ఎరిగిన భానుమూర్తి తన ధోరణిని కొనసాగించాడు-

"మధ్య తరగతి కుటుంబాలకు పరువు ప్రతిష్ఠే ఆస్తి. మొదటి ఆడపిల్ల తప్పుదారి పట్టిందని తెలిసిన వెంటనే, అంతంత మాత్రపుటవకాశాలు కూడా వెనక్కి

పోతాయి. మిగతా పిల్లల జీవితాలు కూడా నాశనమైపోతాయి. మీ కళ్ళముందే, మీ అజాగ్రత్త వల్ల ఒక కుటుంబం సర్వనాశనం కావటం మీరు భరించగలరా? జీవితంలో మీరు ఎంత గొప్ప వ్యక్తిగా ఎదిగినా, మీ మనసులో ఈ పాపచింత ఏదో రోజున బాధించక మానుతుందా? అజాగ్రత్తగా విసిరిన ఒక్క అగ్గిపుల్లతో కోట్లకొలది విలువగల ఆస్తులు దగ్ధమైన వార్తలు వింటుంటాం. ఇదీ అంతే! అది ధనం, యిది జీవితం. అంతే తేడా! ఒకటి కళ్ళకి కనిపించేది, రెండోది మనసుకర్థమయేది"

అతని మాటల ప్రభావానికి పూర్తిగా కట్టుబడిపోయాడు రంగారావు.

"చాలు మాస్టారూ! ఆపండి...మీరే గెలిచారు. నేను రుక్మిణిని గౌరవంగా పెళ్ళి చేసుకుంటాను" అన్నాడు ఒక నిర్ణయానికి వచ్చి.

భానుమూర్తికి చాలా ఆనందం కలిగింది.

"గెలిచింది నేను కాదు మీరు, మీలోని మంచితనాన్ని, ఆత్మౌన్నత్యాన్ని ఋజువు చేశారు. మీరు ఈ తరం యువకులకే ఆదర్శం, గర్వకారణం" మనస్ఫూర్తిగా అభినందించాడు.

ఇంతవరకూ ప్రేక్షకుడిగా మిగిలిపోయిన మాధవరావు వివశత్వానికి తట్టుకోలేక రంగారావు చేతులు పట్టుకుని "బాబూ! నన్ను ఒడ్డున పడేశావ్. నా కుటుంబం కూలిపోకుండా కాపాడావ్" అంటూ జలజల కన్నీళ్ళు రాల్చాడు.

రంగారావుకి ఒక మంచిపని చేశానన్న తృప్తితో మనసు నిండింది.

"నిజానికి నేను చేసినదానికన్నా మాస్టారు చేసిందే ఎక్కువ. ఆయన మాటల్లో గొప్పశక్తి వుంది. అది ఆయన మంచితనమే అనుకుంటాను. ఇలాగాక నన్ను దబాయించి బెదిరిస్తే ఈ సంబంధమే జరిగేది కాదు" వున్నమాట వున్నట్లు చెప్పాడు.

"నూరేళ్లు బ్రతుకు బాబూ! నా మనసులోని మాట చెప్పావు. భానుమూర్తిగారూ! మాటలతో మిమ్మల్ని అభినందించటం నన్ను నేనే అవమానించుకోవటం. కానీ, ఒక్కమాట అనకుండా వుండలేను. ఇంకా అక్కడక్కడా మనుషుల్లో దేవుళ్ళున్నారని ఈ రోజే అర్థమయింది నాకు. రుక్మిణికి తండ్రిని నేను కాదు, తమరే! చివరివరకు ఈ కార్యక్రమాన్ని నిర్వహించి పుణ్యం కట్టుకోండి..." చేతులు జోడించాడు సజలనేత్రాలతో మాధవరావు.

* * *

పెళ్ళి చాలా నిరాడంబరంగా జరిగింది.

తప్పదుగనుక ఆనందరావునీ, విశాలనీ పిలిచాడు మాధవరావు.

ఈ పెళ్ళికి సూత్రధారి భానుమూర్తి అని విన్న విశాల, అతని వ్యవహార దక్షతని అంతరంగంలో హర్షించకుండా ఉండలేకపోయింది.

పెళ్ళికూతురికి విలువయిన చీరలు తెచ్చింది విశాల.

ఆనందరావు కొంత ఆర్థిక సాయం చేశాడు.

ఆశించని ఈ దాతృత్వానికి మాధవరావు పేదగుండె ఉక్కిరిబిక్కిరయింది.

'దేవుడు నిజంగా దయాసముద్రుడు' అనుకున్నాడు మనసులోనే చేతులు జోడిస్తూ.

రంగారావు కుటుంబ సభ్యులు పేచీ మనుషులు కారు.

కలివిడిగా కలిసిపోయి అన్ని పనుల్లోకీ జొరబడ్డాడు.

అద్దెలకుంటున్న వాళ్ళంతా మనస్ఫూర్తిగా ముందుకి వచ్చి చేతులు కలిపారు.

ఇక భానుమూర్తి సర్వాంతర్యామిలా పెళ్ళి పందిరంతా తనుగానే తిరుగుతూ, పనులు చేస్తున్న వాళ్ళకి ప్రోత్సాహమిస్తూ విరామం మరచి కష్టపడ్డాడు.

ఆనందరావు, విశాల ఓ పక్కగా కూర్చున్నారు.

భానుమూర్తికి పనిమీద వున్న శ్రద్ధ, దీక్ష చూస్తుంటే ఆయనకెంతో ముచ్చటనిపించింది.

విశాల భానుమూర్తి ముందు మంత్రముగ్ధే అయింది.

పొద్దు తిరుగుడు పువ్వులా ఆమె దృష్టంతా అతనిమీదనే కేంద్రీకృతమైంది.

ఎవరో చెప్పుకుంటున్న మాటలద్వారా పెళ్ళికూతురుకి మంగళసూత్రం, పెళ్ళికొడుక్కి కళ్యాణపుటుంగరం భానుమూర్తి బహూకరించాడని విని మనసులోనే ఎంతో ప్రశంసించింది.

ఎంత గొప్ప మనసు!

ఎంత ఓర్పు...

ఎంత చలాకీదనం...

ఈ మనిషికి అలసట అనేదే ఉండదా?

ఎవరన్నా పలకరిస్తే చాలు, చక్కగా నవ్వుతూ సమాధానం చెప్పి ఏదో ఛలోక్తి విసిరి వాళ్ళను ఫకాలున నవ్వించి తన పనిలోకి తిరిగి మళ్ళుతున్నాడు భానుమూర్తి.

తనతో కూడా మనసు విప్పి మాట్లాడ కూడదూ?

కాస్సేపు ఇటు వచ్చి మామయ్యతో కబుర్లు చెప్పరాదూ?

పోనీ, తనే వెళ్ళి ఏదైనా పని కల్పించుకుంటే?!

చూసిన వాళ్ళు తప్పు పడతారేమో!

ఎలా... ఎలా— అతనికి సన్నిహితంగా వెళ్ళటం?

మనసు ప్రశ్నలతో, సందేహ సందిగ్ధాలతో అలజడిచెందసాగింది.

ఆనందరావుగారిలో కూడ భానుమూర్తి కార్యదక్షత పట్ల ఎంతో సదభిప్రాయం కలిగింది.

ఎన్నడో గతించిపోయిన కొడుకు స్మృతులు ఆయన మనస్సులో కదలాడి కలత పెట్టాయి.

విధి తనను వంచించి ఉండకపోతే, ఈనాడు తన కొడుకు కూడా ఇంతటి వాడయ్యేవాడు!

ఇలాగే చలాకీగా, మెరుపులా తిరుగుతూ, కనువిందు కల్గించేవాడు కాబోలు...

ఆయన కళ్ళు చెమర్చాయి.

చాటుగా అద్దుకున్నాడు.

"మామయ్యా!"

ఉలిక్కిపడి "ఏమిటమ్మా" అన్నాడు విశాలకేసి చూస్తూ.

"తలనొప్పిగా ఉంది. కాఫీ త్రాగాలి..." బిడియ పడుతూ చెప్పింది.

"అంతేకద? ఎవరికన్నా చెప్పి తెప్పిస్తాను..." అంటుండగానే ఏదో పనిమీద అటుగా వచ్చిన భానుమూర్తి, ఆయన మాటలు విని "ఏమైనా కావాలా?" అనడిగాడు సమీపించి.

విశాల సిగ్గుపడింది.

ఆనందరావు నవ్వుతూ "ఏముందీ? కాఫీ గత ప్రాణాలుగా... మా విశాలకి తలనొప్పి అందుకుంది..." అన్నాడు.

విశాల మొహం ఎర్రబడింది.

"జస్ట్ ఎ మినిట్..." అంటూ లోప లికి వెళ్ళేడు భానుమూర్తి.

అతనటు వెళ్ళగానే. చిరుకోపం నటిస్తూ "ఆయనకి చెప్పటం ఏమిటి మామయ్యా ?" అంది విశాల.

"దాన్లో ఏముందమ్మా ? భానుమూర్తే పెళ్ళి పెద్ద ఇక్కడ... అతన్నిగాక ఇంకెవర్ని అడుగుతాం ?" బోళాగా నవ్వేడాయన.

"నేనే వెళ్ళి తెచ్చేదాన్నిగా ?" అంది.

"నువ్వెందుకమ్మా... నీకేం తెలుస్తాయి ఏదెక్కడుందో..."

"తెలిసేదేమిటి మామయ్యా! పెళ్ళిలో అన్నీ అందుబాటులోనే ఉంటాయి..."

వీళ్ళు వాదించుకుంటుండగానే భానుమూర్తి రెండు గ్లాసులతో కాఫీ తీసుకొచ్చి చెరొకటీ అందించాడు.

"థాంక్యూ వెరీమచ్" అంది విశాల కళ్ళతో నవ్వుతూ.

"మెన్షన్ నాట్" అంటూ నాప్కిన్‌తో చేతులు తుడుచుకున్నాడు భానుమూర్తి.

కాఫీ రెండు గుక్కలు తాగి "నాదో చిన్న కోరిక భానుమూర్తీ !" అన్నాడు ఆనందరావు.

"పంచదార కావాలా ?" వెంటనే అడిగేడు.

నవ్వుతో ఆయనకి పులమారింది.

"నువ్వు భలే జోకులేసావోయ్! ఏనీవే- నాది పంచదారలాంటి కోరికే ననుకో.."

భానుమూర్తి కూడా నవ్వి "చెప్పండి ఏమిటో...?" అన్నాడు.

"ఏమీలేదు-రేపు నువ్వు మా విశాల పెళ్ళికూడా ఇంత సర్వీసు చెయ్యాలి" అంటూ విశాలకేసి చూశాడు.

ఆమె చటుక్కున మొహం తిప్పు



కుంది.

పెళ్ళిమాట వినగానే ఆమె మొహంలో వెన్నెల రేఖలు వ్యాపించాయి.

భానుమూర్తి గలగల నవ్వుతూ "అలాగే... అలాగే..." అన్నాడు.

చిరుకోపం నటిస్తూ అతనికేసి సూటిగా చూసింది విశాల.

*  *  *

రుక్మిణిని కాపురానికి తీసుకు వెళ్ళే మునుపు, వేరొక చోట అనువయిన ఇల్లు కుదుర్చుకున్నాడు రంగారావు.

మాధవరావు భార్య మనసులో చాలా నొచ్చుకుంది.

కొన్నాళ్ళయినా కూతురు, అల్లుడు కంటికెదురుగా చిలకా, గోరింకల్లా కాపురం చేస్తుంటే చూడాలనే కోరిక వేధించింది.

మొదట భర్తతో చెప్పి వప్పిద్దామను కుంది.

కానీ-మాధవరావు మనస్తత్వం ఎరిగుండటం వల్ల ఆ ప్రయత్నం మాను కుంది.

భానుమూర్తితో చెబితే ?!

ఈ ఆలోచన నచ్చిందామెకి. వెంటనే అతనికి కబురు పెట్టింది.

పెళ్ళి సమయం నుండీ అతనితో కాస్త చనువేర్పడిందామెకి.

భానుమూర్తి ఆవిడ చెప్పిందంతా విని—

"రుక్మిణి పెళ్ళి కానంతవరకే మీ అమ్మాయి. ఇప్పుడు కేవలం రంగారావు భార్య. అతన్ననుసరించి బ్రతకటమే ఆమెకు ధర్మం. అదే ఆమె జీవితానికి సత్యం..." అన్నాడు నిర్మొహమాటంగా.

"నువ్వు లేనిపోని చాదస్తాలకు పోకమ్మా ! నేను మాత్రం ఏం పొరుగూరు వెళుతున్నానా ? ఈ ఊళ్ళోనే మరో పేట. అంతేగా?" అంది రుక్మిణి.

ఆమె ఆశ అణగారి పోయింది.

"అదికాదు బాబూ ! అది ఒట్టి మనిషి కాదాయె. తొలిచూలు గనుక కాస్త జాగ్రత్తగా చూచుకోవాలని తల్లిగా ఆశపడుతున్నానంతే..." అంది నానుస్తూ.

"మరేం భయపడకండి. వాళ్ళిద్దరూ ఆపేక్షగా ఉండటమే మనందరం కోరుకోవలసింది ! నేనే అప్పుడప్పుడు వెళ్ళి చూస్తుంటానుగా ?" హామీ ఇచ్చాడు.

ఆమె మనసు కాస్త కుదుట పడింది.

"సరేలే నాయనా! నువ్వు చెప్పినట్లే చేద్దాం..." అంది సరిపుచ్చుకుంటూ.

భానుమూర్తి లేచి వచ్చేశాడు.

ఆలోచించి చూస్తే రంగారావు వేరే చోట ఉండటమే సబబనిపించింది.

ఒకటి-వాళ్ళిద్దరూ ఒకరినొకరు మరింత అర్థం చేసుకోవటానికి, కొత్త జీవితంలోని ఆనందాన్ననుభవించటానికి ఈ స్థలం అనువుకాదు.

రెండు-అతడు ఉన్నది బ్రహ్మచారుల మధ్య రూములో!

*  *  *

కాలేజీకి మామూలుగానే హాజరవుతున్నాడు భానుమూర్తి.

వార్షికోత్సవాలలో ఆడపిల్లల మీద అఘాయిత్యం తలపెట్టిన ముగ్గురు విద్యార్థులు అరెస్టు అయినాక వాళ్ళందరకూ కోర్టు జరిమానాలు విధించింది.

వాళ్ళు కాలేజీలోకడుగు పెట్టగానే ప్రిన్సిపాల్ పదిరోజులు 'సస్పెండు' చేశాడు.

దీన్ని అవకాశంగా తీసుకొని విన్సెంట్

ఒక వర్గం విద్యార్థుల్ని, ముఖ్యంగా ఆ ముగ్గురు విద్యార్థులను బలపరచే వాళ్ళను ఉద్రిక్త పరిచాడు.

ఫలితం ప్రిన్సిపాల్‌కి సమ్మె నోటీసు!

ముగ్గురు విద్యార్థులమీద 'సస్పెన్షన్' తొలగించకపోతే తరగతులకు హాజర య్యేది లేదని బెదిరింపు.

లెక్చరర్లందర్నీ సమావేశపరచి, సంప్రదించాడు.

విన్సెంట్ కలుగజేసుకొని "కోర్టు జుల్మానాలు విధించిన తర్వాత కూడా, ప్రిన్సిపాల్‌గారు సస్పెండ్ చెయ్యటం న్యాయంగా లేదు..." అన్నాడు.

"కోర్టు ఆడపిల్లల మీద అత్యాచారం తలపెట్టినందుకు జుల్మానా విధించింది! నేను ఒక విద్యాసంస్థలో తోటి విద్యార్థినుల మీద చూపిన అమానుషత్వానికి శిక్షిస్తున్నాను. ఏ శిక్ష అయినా మనిషి మీద ఒక ప్రభావం కలుగజేయాలి. మానసిక పరివర్తన తీసుకురాగలిగేదిగా ఉండాలి. డబ్బు కట్టివేయడంతో తమ అపరాధాన్ని మర్చిపోయే తత్వంలో ఉంటారు. నేను తీసుకుంటున్న యీ చర్య వ్యక్తికత ద్వేషంతోగాక, కళాశాల నిర్వాహకుడిగా, క్రమశిక్షణ దృష్టితో నిర్ణయించాను..."

"స్టూడెంట్లకది ఉచితంగా లేదు!" విన్సెంట్ జవాబిచ్చాడు.

"సీనియర్ లెక్చరర్ల అభిప్రాయాలు కోరుతున్నాను" అన్నాడు ప్రిన్సిపాల్ గంభీరంగా.

"అంటే మమ్మల్ని నిర్లక్ష్యం చేస్తున్నట్లేగదా?" విన్సెంట్ కయ్యానికి కాలు దువ్వేడు.

భానుమూర్తి కలుగజేసుకున్నాడు.

"ఈ విషయాన్ని పరిష్కరించవలసింది బదులు మనమే వాదోపవాదాలలోకి దిగటం బాగాలేదు! నా ఉద్దేశ్య ప్రకారం, యిది విద్యార్థులందరి మద్దతుతో నడుస్తున్నది కాదు– కొందరు తెర చాటున నిలబడి యిస్తున్న ప్రేరణతో ఒక వర్గం విద్యార్థులు చేస్తున్న అలజడి యిది! తప్పొప్పుల సంగతి ఎలా ఉన్నా, ఆ ముగ్గురు తలపెట్టిన పని విద్యాసంస్థలో జరగవలసిందీ, విద్యార్థులు చెయ్యతగ్గదీ కాదు. ఇలాంటి విద్యార్థులు సంస్థ ఔన్నత్యాన్నీ, గౌరవాన్నీ రూపుమాపుతారు. ప్రిన్సిపాల్ గారు నిర్దయత్వం చూపలేదు గనుక 'సస్పెన్షన్'తోనే పోనిచ్చారు. న్యాయానికి వాళ్ళకి టి.సి.లు యివ్వవలసింది..."

మిగతా లెక్చరర్లు భానుమూర్తిని బలపరిచారు.

విన్సెంట్ కుతకుతలాడి పోయాడు.

అవమానం భరించలేక ఒక్కడూ బయటకు వెళ్ళిపోయేడు.

"మీ సహకారానికి థాంక్స్ చెబుతున్నాను. సమ్మె జరగకుండా మీ ప్రయత్నాలు మీరు చెయ్యండి. నేను పోలీసు సహాయం కోరతాను" అన్నాడాయన.

లెక్చరర్లు బయటకు వచ్చేశారు.

విద్యార్థి నాయకులు ప్రిన్సిపాల్‌తో మాట్లాడటానికి వేచి వున్నారు.

భానుమూర్తి ఒక్కనిమిషం ఆగి వాళ్ల అభిప్రాయాలు అడిగాడు.

వాళ్ళుకూడా సమ్మె తమకు సమ్మతం కాదనీ, యిరువైపులా అంగీకారం కుదిరే విధానం సూచించడానికి వచ్చామన్నారు.

"నాతో రండి!" అని ప్రిన్సిపాల్

దగ్గరకు తీసుకెళ్ళాడు.

ప్రిన్సిపాల్ వాళ్ళు చెప్పింది సావధానంగా విన్నాడు.

"చేసింది అపరాధమేగనుక సస్పెన్షన్ యివ్వడం ఉచితమే! ఎటొచ్చీ విద్యార్థులు తృప్తిపడేలా దానిని అయిదు రోజులకు తగ్గించటం కావ్వంటుం"దన్నారు వాళ్ళు.

ప్రిన్సిపాల్ సాలోచనగా భానుమూర్తి మొహంలోకి ఒకమాటు చూశాడు. ఒక నిర్ణయానికొచ్చి—

"ఆల్ రైట్! వారం రోజులకి తగ్గించదలిచాను. అదికూడా మీరు నిజాయితీతో ముందుకు వచ్చినందువల్ల సంతోషించి చేస్తున్నాను."

"చాలు సార్! ఈ మాత్రం మీరు కనికరించారనే విషయం సమ్మె ధోరణినీ, ఉద్రిక్తతనీ చల్లారుస్తుంది" అని వెళ్ళిపోయారు తృప్తిగా.

విద్యార్థి నాయకుల కోరికను కొంతవరకు విన్నారనగానే చాలామంది చల్లబడ్డారు. అప్పటికి కొందరు పరిస్థితిలోని వేడి తగ్గనీయరాదని విఫలయత్నం చేశారు కానీ సమ్మె విఫలమయింది.

ఇది ముఖ్యంగా విన్సెంట్ కి ఘోర పరాజయంగా పరిణమించింది. భానుమూర్తి మీద మొదటే ఉన్న అయిష్టత, యిప్పుడు కక్షగా మారింది.

పగబట్టిన త్రాచులా అంతరంగంలోనే బుసలు కొడుతూ, అదను చూసి కాటు వెయ్యాలని కాచున్నాడు.

* * *

ఎంత వద్దనుకున్నా, కొన్ని సంఘటనల ప్రభావాలు ఉండకుండా పోవు.

లేత మనసులమీద అయితే, యీ ప్రభావాల శక్తి మరింత హెచ్చు!

రుక్మిణి పెళ్ళితో ఒక పెద్దభారం తగ్గించుకున్నట్లుగా మాధవరావుకి అనిపించింది గానీ జరిగింది వేరు.

రుక్మిణి తర్వాత పిల్ల—మంగకి ఒక విషయం అర్థమయింది—తండ్రి తనకు తానుగ సంబంధాలు తెచ్చి, పెళ్ళిళ్ళు చేయలేడని!

తను కన్యగానే ఉండిపోకూడదనుకుంటే, తను కూడా రుక్మిణి మార్గాన్నే ఎంచుకోవాలి!

ఈ ఊహ రావడమేగాక, అంతకంతకు బలపడసాగింది. తన ఆలోచనలు తనలోనే దాచుకుంటూండిపోయింది.

రంగారావు భార్యను వెంటబెట్టుకొని అత్తవారింటికి రెండుమార్లు వచ్చాడు.

ఇప్పుడు రుక్మిణి ఎంతో నిండుగా గంభీరంగా ఉంది.

సాంసారిక రామణీయకత ఆమెలో తొణికిసలాడుతోంది.

వచ్చినప్పుడల్లా ఏదో ఒకటి వెంట తెచ్చి, పిల్లలకిచ్చేది.

ఆ తల్లి కూతుర్ని తృప్తిగా చూచుకునేది.

"ఒక మాటు నువ్వూ, చెల్లాయిలూ రండే మాయింటికి" అంది తల్లితో రుక్మిణి ఒకసారి.

"అలాగేనమ్మా" అంది సంతోషిస్తూ.

అటు తర్వాత—భానుమూర్తి కూడా తన మాటకు కట్టుబడి, రుక్మిణినీ, ఆమె భర్తనీ పలకరించి వచ్చి, వాళ్ళ కబుర్లు చెప్పాడు—మాధవరావుకి.

రంగారావు ఇల్లు కాలేజీకి వెళ్ళే దారిలోనే.

అప్పుడప్పుడూ అతను ఎదురుపడుతూనే ఉంటాడు.

కన్పించినప్పుడల్లా నవ్వుతూ మనసిచ్చి మాట్లాడుతాడు.

రుక్మిణి తల్లిదండ్రులు కూడా సకుటుంబంగా వెళ్లి అల్లుడి యింట్లో ఒక పూట ఉండి వచ్చారు.

ఇల్లంతా ముచ్చటగా సర్ది ఉంచుకుంది రుక్మిణి.

రంగరావు మంచి ఆర్జనాపరుడు కావడంతో, ఆమె కెలాంటి లోటూ లేకుండా జరిగిపోతోంది.

మంగ ఎంతో ఆసక్తిగా రుక్మిణి జీవితాన్ని పరిశీలించింది.

ఏదో ఒక నాటికి తను కూడా యిలాంటి జీవితమే గడపబోతానని కలలు కంది.

ఆమె చూపులిప్పుడు మేడలో అద్దెకున్న యువకుల్లో తనకు కాబోయేవరుణ్ణి అన్వేషిస్తున్నాయి.

షోగ్గా కనిపించే చలపతి ఆమె కంటికి నచ్చాడు.

అతను 'గ్లాక్సో'లో పనిచేస్తున్నాడు.

అయితే, అతనికదివరకే పెళ్లి కావటం కట్నాల పేచీలవల్ల రాకపోకలు చెడి వ్యవహారం బెడిసి, అతని భార్య పుట్టింట్లోనే ఉండిపోవటం జరిగింది.

ఆ సంగతి ఎవరికీ తెలియదు.

అందుక్కారణం-అతను వివాహితుడుగా ఎప్పుడలా ప్రవర్తించక పోవటం!

చెంపలదాకా జుట్టూ, సన్నని మీసకట్టూ, ఆధునికమయిన దుస్తులూ, మొదలయిన హంగులతనికి పుష్కలంగా ఉన్నాయి.

మనిషి చక్కనివాడేగానీ, తన చక్కదనం గురించి అతనికి మించిన గర్వం ఉంది!

తన అందచందాలకు ఎలాంటిఆడదైనా దాసోహం కాక తప్పదన్న నమ్మకం ఉందతనికి.

మంగ తనకేసి వెర్రిచూపులు చూడటం గమనించాడతను.

పిట్ట తేలిగ్గానే పడుతుందని నవ్వుకున్నాడు.

వల పన్నడం ప్రారంభించాడు.

చూపులతో పలకరింపులు – మాటల దాకా వచ్చాయి.

ఒకమాటు భానుమూర్తి స్కూటరు కోసం 'గ్యారేజి'లోకి వెళ్ళినపుడు, "సాయంత్రం కల్పన సినిమాహాలు దగ్గరికి రా..." అంటున్న చలపతి గొంతు వినబడింది.

'గ్యారేజి' అవతల నిమ్మచెట్లు నాలుగున్నాయి. గడ్డీ గాదం కూడా పెరిగిఉంది. సామాన్యంగా అక్కడ పనికిరాని చెత్త పారబోస్తూ ఉంటారు మాధవరావు యింట్లో వాళ్ళు.

సాధారణంగా అటుపక్కకి ఎవరూ వెళ్ళరు కూడా.

చలపతి, మంగతో మాట్లాడటానికి ఆ ప్రదేశం అనువుగా ఎంచుకున్నాడు.

భానుమూర్తి నిశ్శబ్దంగా నిలబడి గోడ అవతల జరుగుతున్న సంభాషణ ఆలకించ సాగేడు.

"సాయంత్రం కుదరదు. మానాన్న యింటికొచ్చేస్తాడు. మధ్యాహ్నం వస్తా" అంటోంది మంగ.

"సరే-సరిగ్గా రెండు గంటలకి అక్కడికి రా" అన్నాడు చలపతి.

"అలాగే!" అంది మంగ.

మంగ కూడా రుక్మిణి దారే తొక్కుతున్నట్లు అర్థమయింది భానుమూర్తికి.

అతన్ని ఒక్కమాటుగా నిస్పృహ ఆవరించింది.

'ఈఆడపిల్లల జీవితాలు అరిటాకులలో సమం అయినా, కావాలని తామే ముళ్ళ కంపలమీదకు వెళ్ళిపడతా రెందుకో!' అని బాధపడ్డాడు.

మంగను రుక్మిణిలా కానివ్వదల్చుకో లేదతను.

చలపతికీ, రంగారావుకీ ఉన్న అంతర మేమిటో అతనికి బాగా తెలుసు.

చలపతి ఆరితేరిన ఘటంలా కని పిస్తాడు.

మంచి మాటలు గానీ, బెదిరింపులు గానీ అతన్ని లొంగదియ్యలేవు!

సకాలంలో ఆదుకొనక పోతే మంగ జీవితం నాశనం కాక తప్పదు! ఏ విధంగా ఆదుకోవాలి?

సూటిగా యింట్లోకి వెళ్ళి చెపితే 'రభస' కావటం ఖాయం.

'ఈ రోజు కల్పన సినిమాహాలు వద్ద కలుసుకొన దల్చారు గనుక అక్కడికే వెళ్ళటం మంచిది...' అని నిర్ణయించుకుని మామూలుగా కాలేజీకి వెళ్ళిపోయేడు.

ఆ పూటంతా అతని మనసులో అదే విషయం తిరగసాగింది.

మధ్యాహ్నం 'పర్మిషన్' పెట్టాడు.

'లంచ్ అవర్' కాగానే ఆదరా బాదరా రెండు మెతుకులు తిని కల్పన వైపు దూసుకు వెళ్ళేడు.

మాటి, మాటికి వాచీ చూసుకుంటు న్నాడు.

రెండు కావస్తోంది.

వేగం పెంచాడు.

'కల్పన' యింకా రెండు ఫర్లాంగు లుందనగా స్కూటరు ఆగిపోయింది!

తీరా చూస్తే 'పెట్రోలు' లేదు!

సరిగ్గా రెండయింది.

వంరగజాల్లో ఒక 'పెట్రోలు బంకు' ఉన్నట్లు జ్ఞాపకం వచ్చి, స్కూటర్‌ని ఈడ్చు కెళ్ళసాగేడు.

చెమటలు దిగజారి పోతున్నాయి.

అలాగే పట్టుదలగా లాక్కువెళ్ళాడు.

"పెట్రోలు కావాలి - అర్జెంటు" అన్నాడు కుర్రాడితో. ఎంత గబ, గబ పోసినా పది నిమిషాలు పట్టింది. నోటు విసిరి, చిల్లర కోసం కూడా చూడకుండా, 'కల్పన' వైపు వెళ్ళేడు. స్కూటర్ పార్కుచేసి 'బుకింగ్' వైపు పరుగెత్తాడు.

గబ, గబ రిజర్వ్‌డు క్లాసు కొని లోప లికి వెళ్ళేడు. అదృష్టవశాత్తు యింకా లైట్లు తియ్యలేదు.

కళ్ళతో హాలంతా గాలించాడు.

ఆశ్చర్యం-

ఎక్కడా వాళ్ళ జాడే లేదు!

అతని బుర్రపని చెయ్యడం మానే సింది. ఏమైనారు వీళ్ళు?

తను గమనించినట్లు తెలుసుకున్నారా. మళ్ళీ, మళ్ళీ అనుమానంగా హైక్లాసులన్నీ వెతికేడు.

జనం ఆట్టేలేని మీదట, ఉన్న కొద్ది మందినీ పరిశీలించటం కష్టం కాలేదు,

అంతలో లైట్లు తీసేశారు.

నిస్పృహతో బయటకు వచ్చేశాడు.

దాహంతో నాలుక పిడచగట్టుకు పోతుంటే, ఒక 'కూల్‌డ్రింక్' తాగేడు.

కాస్త సేదతీరి, తిరిగి ఆలోచించటం మొదలెట్టాడు. తన పరిస్థితి తలుచుకుంటే అతనికే నవ్వొచ్చింది.

ఎందుకు తనకీ ఆరాటం?

మంగకి తనేమవుతానని?

ఆమెకు తనలాంటి అన్న ఉండి ఉంటే ఇంత కష్టపడి ఉండేవాడేమో.

ఏదో బాంధవ్యం ఉన్నప్పుడెవరయినా చేస్తారు.

ఒక మంచి పని చెయ్యడానికి ఏ బాంధవ్యమూ అవసరం లేదు.

ఒక చెడుని నిరోధించటానికి సంకల్ప బలాన్ని మించింది లేదు.

ఆవిధంగా తను పడుతున్న శ్రమకు సార్థకత ఉందనిపించిందతనికి.

మళ్ళీ అతని ఆలోచనలు మంగ, చలపతుల మీదకు వెళ్ళాయి

చలపతి కుటిలస్వభావి గనుక. సినిమా నెపంతో మంగని మరెక్కడి కయినా తీసుకెళ్ళాడేమో!

ఈ ఆలోచన రాగానే గబ, గబ స్కూటర్ వైపువెళ్ళాడు ముందు 'లాడ్జింగు'లన్నీ వెతకదల్చుకున్నాడు

ఎక్కడికివెళ్ళి అడిగినా "ఎవరు మీరు? ఎందుకు మీకి వివరాలు?" అని అనుమానంగా అడుగుతున్నారు

అతను తన స్నేహితుడనీ, యిక్కడికి వస్తానన్నాడని బొంకి, వాళ్ళనేదోలా నమ్మించి. ముందుగా మధ్యాహ్నం రూమ్ బుక్ చేసిన వాళ్ళ పేర్లు చూసుకుంటూ, కన్పించకపోయేసరికి "సారీ" చెబుతూ, విసుగులేకుండా తిరుగుతూనే ఉన్నాడు.

ఖరీదయిన లాడ్జీలన్నీ చూడటం అయిపోయింది

సందుల్లో, మెయిన్ రోడ్లకు దూరంగా ఉన్న లాడ్జీలను గాలిస్తుండగా ఒకచోట అతనికి ఆధారం దొరికింది.

"బి. ఎస్. పతి అండ్ ఫ్యామిలీ" పేరుతో మధ్యాహ్నం రూమ్ బుక్ చేసినట్లున్న రికార్డుచూసి" అయితే యిదే కావాలి లేకపోతే, మరెక్కడయినా మారు పేరుతో దిగి ఉండాలి అనుకుని రూమ్ నెంబరు తెలుసుకుని వెళ్ళేడు.

గది ముందు నిలబడి ఒక్కక్షణం ఆలోచించాడు. లోపల చలపతి గాకమరే శ్రీపతో, సీతాపతో ఉంటే?!

ఉంటే, ఏముంది? క్షమాపణలు చెప్పుకుంటే సరి–అని టక, టక తలుపుమీద వేళ్ళతో తట్టాడు

ఎవరూ పలకలేదు

మళ్ళీ కొట్టాడు.. యీ మాటు కాస్త గట్టిగా. లోపల ఎవరో కదిలిన శబ్దం అయింది

"ఎవరు?" అన్నారెవరో కోపంగా, తలుపు తియ్యకుండానే.

ఆ గొంతు గుర్తుపట్టేశాడు, భానుమూర్తి

సందేహం లేదు– లోపల చలపతే ఉన్నాడు!

అతని వంట్లోరక్తం ఉడుకులెత్తింది.

సమాధానం చెప్పబోయి, తనగురించి తెలియడం మంచిది కాదనిపించి మళ్ళీ తలుపు కొట్టాడు.

ఈమాటు విసురుగా తలుపు తెరిచి, ఓరగాపట్టుకుని తొంగిచూస్తున్న చలపతి ఆశ్చర్యంతో బిగుసుకు పోయాడు.

లోపలనుండి మంగ "ఎవరొచ్చారు?" అంటోంది కంగారుగా.

క్షణం కూడా ఆలస్యం చెయ్యకుండా బలవంతాన తోసుకు లోపలికి వెళ్ళేడు భానుమూర్తి.

లోపల మంగ వంటి మీద అడ్డదిడ్డంగా ఉన్నాయి బట్టలు. జుట్టంతా రేగిపోయి, ఎలా ఉండాలో అలా ఉంది!

వెంటనే తలుపు మూసేడు లోప

సరిగ్గా నిలబడలేక పోతున్నాడు.

"కూర్చుంటాను" అన్నాడు చేత్తో నెత్తురు తుడుచుకుంటూ నీరసంగా.

"హుం నీలాంటి దుర్మార్గుల కారణం గానే ఎందరో అభం శుభం తెలియని ఆడ పిల్లలు వొళ్ళమ్ముకుని బ్రతుకుతున్నార్రా రాస్కెల్. నీలాంటి వాళ్ళని నిలువునా కోసినా పాపం లేదు" విసురుగా కుర్చీ లోకి పడదోశాడు.

వణుకుతున్న చేతుల్ని జోడించాడు చలపతి.

అతని కేసి చీడపురుగుని చూసినట్లు చూశాడు భానుమూర్తి.

"నేను మంగని పెళ్ళి చేసుకుంటాను" అన్నాడు చలపతి.

"నీవి నమ్మదగ్గ మాటలేనా ?!" అన్నాడు అపనమ్మకంగా చూస్తూ.

"భగవంతుడు సాక్షి" అన్నాడు నెత్తిన చెయ్యి వేసుకుని.

"సరే-చూస్తాను, ఎంతవరకు నీమాట నిలబెట్టుకుంటావో" అని మంగవైపు చూశాడు.

మంగ బెదిరిన గొడ్డులా నిలబడిఉంది

"ఆ జుట్టు సరిజేసుకుని, నీ అవతారం కాస్త మార్చుకుని యింటికి బయల్దేరు. స్కూటరు మీద దింపుతాను" అన్నాడు.

అనటమే తడవుగా బాత్‌రూమ్‌కెళ్ళి అయిదు నిముషాల్లో మామూలుగా తయారయి వచ్చింది.

చలపతి కూడా బట్టలు వేసుకున్నాడు.

అతని బనీను నిండా రక్తపు మరక లున్నాయి.

పెదవి పక్కన, ముక్కు దగ్గర రక్తం చారికలు కట్టాయి.

తను కూడా బాత్‌రూమ్‌లో కెళ్ళాడు చలపతి.

మంగని తీసుకుని బయటకు వెళ్ళాడు భానుమూర్తి.

మొదట స్కూటరు మీద ఎక్కడానికి సంకోచించి, "ఎవరన్నా చూస్తారేమో, నేను రిక్షాలో వస్తాలెండి!" అంది.

నవ్వేడు భానుమూర్తి.

"నీకింకా అలాంటివి జ్ఞాపకం ఉన్నాయా మంగా?" సీరియస్‌గా అడిగేడు. సిగ్గుతో తల దించుకుంది మంగ.

"ఎక్కు" అన్నాడు స్కూటర్ స్టార్ట్ చేసి.

మాట్లాడకుండా ఎక్కి కూర్చుంది.

వెళ్తుండగా "మా నాన్న కిదంతా చెప్పరు కదూ?" అంది భయం భయంగా.

భానుమూర్తికి చిరాకు కలిగింది.

"కాస్సేపు మాట్లాడకుండా కూర్చో" అన్నాడు కోపంగా.

కిక్కురుమనలేదు మళ్ళీ.

అదృష్టవశాత్తూ అది మధ్యాహ్నం కావటం వల్ల, ఆఫీసుల కెళ్ళినవాళ్ళతో మేడ నిర్మానుష్యంగా ఉన్నందువల్ల, వీళ్ళ రాక ఎవరూ గమనించలేదు.

మంగ తమ్ముడు మాత్రం దూరాన చూసి, పరుగున వస్తూ "హేయ్ మా అక్క స్కూటరెక్కింది, మా అక్క స్కూటరెక్కింది" అంటూ అరుస్తూవచ్చి "మాస్టారూ! నేనూ ఎక్కద్దా?" అనడిగేడు అమాయకంగా.

భానుమూర్తి ప్రేమగా చూసి "సాయంత్రం ఎక్కిస్తాలే బాబూ !" అన్నాడు.

"నిజంగా ఎక్కిస్తారు కదూ ?" కళ్ళల్లో ఆశ నింపుకుని అడిగేడు.

"నిజంగా ఎక్కిస్తాను..." అంటూనే

తన వాటాకేసి వెళ్ళిపోయేడు.

కొడుకు అరవటం విని, "స్కూటరు మీద ఎక్కావంటాడేమిటే వీడు?" అనడిగింది తల్లి.

గతుక్కుమంది మంగ.

"ఆఁ... నేను, మరేమో మా స్నేహితురాలింటికి వెళ్ళి వస్తూంటే మధ్యలో కనిపించి, ఎండగా ఉందని స్కూటరెక్కమన్నారు మాస్టారు?"— బొంకేసింది.

"చాలా మంచివాడు పాపం!" అందావిడ, మనసులో సంతోషిస్తూ.

మంగ మౌనంగా యింట్లోకి వెళ్ళి 'అమ్మయ్యా!' అనుకుంది–గుండెలమీద చేతులు వేసుకుని.

కానీ, మనసులో బెదురుగానే ఉంది–భానుమూర్తి తండ్రితో ఏం చెబుతాడోనని!

సాయంత్రం కాగానే భానుమూర్తి స్కూటరు మీద ఎక్కడికో వెళ్ళిపోయేడు. వెళ్ళేమునుపు, మంగ తమ్ముణ్ణి స్కూటరు మీద కొద్దిదూరం తిప్పాడు. ఆ కుర్రాడి ఆనందానికి అవధి లేకపోయింది!

ఆ వెళ్ళినవాడు రాత్రి చాలా ఆలస్యంగా వచ్చాడు.

అప్పటికి మాధవరావు ఇంట్లో మంగ తప్ప అందరూ పడుకున్నారు!

ఆమె ప్రతి నిమిషం ఉలిక్కి పడుతూనే ఉంది.

భానుమూర్తి వస్తాడేమో, తండ్రిని లేపి చెబుతాడేమోనని! ఆమె కళ్ళు కిటికీలోంచి మేడమీద భానుమూర్తి గదినే చూస్తున్నాయి.

అదృష్టవశాత్తు భానుమూర్తి ఆ రాత్రికిక మేడ దిగలేదు. మంగ వెయ్యి దేవుళ్ళకి మొక్కుకుంది.




మర్నాడు భానుమూర్తి కాలేజీకి వెళ్ళబోతుండగా అతని కోసం పోలీసులు వచ్చారు.

"చలపతిగార్ని కొట్టినందుకు మిమ్మల్ని అరెస్టు చేస్తున్నాం!" అన్నారు వాళ్ళు!

భానుమూర్తి స్థాణువైపోయేడు.

ఆ సాయంత్రం మాధవరావునీ, చలపతినీ సమావేశపరచదలచి, రంగారావుని ఆవేళకు రావలసిందిగా చెప్పాడు.

ఇంతలో యిది!

"చలపతి ఎక్కడున్నాడు?

"ఆస్పత్రిలో..."

అతను చేసిన కుతంత్రం అర్థమయింది భానుమూర్తికి.

"సరే–నేను లాయరుతో మాట్లాడాలి పదండి" అన్నాడు.

"ముందు మీరు స్టేషనుకు రావాల్సి ఉంటుంది. ఆటు తర్వాతే మీ లాయరు బెయిల్ యిచ్చినా!"

వీళ్ళు మాట్లాడుకుంటుండగానే ఎవరో పోలీసులొచ్చారని చెబితే విని, మాధవరావు వెలుపలకు వచ్చాడు.

వాళ్ళ దగ్గర భానుమూర్తి నిలబడి ఉండటం చూసి, ఆశ్చర్యంగా సమీపిం

చాడు.

వాళ్ళతో వెళ్ళబోతున్న భాను మూర్తితో "ఏమిటి మాస్టారూ! ఏమిటి దంతా?" అన్నాడు తెల్లబోతూ.

"అంతా మీకు వివరంగా చెబుతాను గానీ, ముందు మీరు ఆనందరావుగారికి ఫోను చేసి, నన్ను పోలీసు స్టేషనులో ఒక మంచి లాయరుతో వచ్చి కలుసుకోమని చెప్పండి" అని వెళ్ళిపోయేడు.

ఇంట్లోకి వెళ్ళి ఆదరా, బాదరా బట్టలు వేసుకుని, 'ఫోను' చెయ్యటానికి పరుగెత్తాడు మాధవరావు.

* * *

చలపతి క్రిమినల్ కేసు పెట్టాడు భానుమూర్తిమీద!

దవడ ఎముక విరిగిందనీ, ముక్కు చూలం చిట్లిందనీ డాక్టరు సర్టిఫికెట్టు పుట్టించాడు. భానుమూర్తిని 'బెయిల్' మీద విడిపించి, ఆనందరావు తన ఫామిలీ లాయరుని నియమించాడు.

మెల్లమెల్లగా ఒక్కొక్క విషయం వెలుగులోకి వచ్చింది.

కూతురు నిర్వాకం తెలిసిన మాధవరావ్ నెత్తీ, నోరు కొట్టుకున్నాడు. అతనికి సంఘటనతో తలతీసేసి నట్లయింది. భానుమూర్తికి చలపతి వివాహితుడన్న సంగతి తెలిసింది.

మంగను మోసగించి, శీలం హరించినట్లు కేసు బనాయించదలచి, మాధవరావుతో సంప్రదించాడు. అతను లాయర్ని సలహా అడిగేడు.

మంగ కోర్టుకి హాజరు కావాల్సి ఉంటుందన్నాడాయన.

'మైనారిటీ' తీరింది గనుక, ఆమె వ్యక్తిగతంగా యిచ్చే వాఙ్మూలానికి విలువ ఎక్కువని చెప్పాడు.

మంగ కోర్టుకిససేమిరా ఎక్కనంది.

అంతరంగంలో మాధవరావుకి కూడా యీ విధంగా బజారు కెక్కడం యిష్టం లేదు.

"వద్దులెండి! జరిగిందేదో జరిగింది. ఇంతకూ యిదంతా నా ప్రారబ్ధం. వీళ్ళకి పుట్టినపుడే తలోకాస్త విషం యిచ్చి ఉంటే బావుండేది..." అన్నాడు వ్యాకుల మనస్కుడై.

భానుమూర్తి బలవంతం చెయ్యలేదు. అటుపైన.

కోర్టుకి హాజరుగాక తప్పలేదు అతనికి!

వాయిదాల మీద, వాయిదాలతో అతను విసిగిపోయేడు.

'ఎందుకొచ్చిన గొడవలో యిరుక్కున్నారా భగవంతుడా!' అనీ బాధపడ్డాడు.

కాలేజీలో యీ విషయం తెలిసి, నలుగురు నాలుగు విధాలుగా అనుకోవడానికి ఆస్కారం అయింది.

కేసు ఒక ఒడ్డున పడటానికి చాలా ఖర్చయిందతనికి!

చివరి కెలాగయితేనేం, చావుతప్పి కన్ను లొట్టపోయిన చందంగా బయటపడ్డాడు భానుమూర్తి.

తనని ఇంద్రుడు, చంద్రుడు, భగవంతుడన్న మాధవరావిప్పుడు ఎదురుపడితే కూడా పలకరించడం లేదు!

భానుమూర్తి చాలా వ్యధ పడ్డాడు. తను చేసిన అపరాధం ఏమిటి?!

మంగని రక్షించదలచి, తనే ఆపదల్లో చిక్కుకున్నందుకు కనీస సానుభూతి కూడా వీళ్లు చూపలేక పోతున్నారే!

మనుషులెంత అల్ప మనస్కులు.

ఎంత సులభంగా మంచితనాన్ని హత్య చేసెయ్యగలరు!

ఆ నెల చివర్లో మాధవరావు అక్కణ్ణుంచీ మకాం ఎత్తేశాడు.

ఇల్లు మారుతున్నట్లు కనీసం ఆనందరావు కూడా చెప్పలేదు.

రంగరావు కన్పించినపుడు ఈ మాట చెబితే, అతను కూడా ఆశ్చర్యపోయేడు.

వాళ్ళకూడా మాధవరావు ఎక్కడికి వెళ్ళిందీ తెలియదు!

* * *

"రండి భానుమూర్తిగారూ! జస్ట్ యిప్పుడే మీ గురించి ఆలోచిస్తున్నాను... అంతలో మీరే వచ్చేశారు..." అన్నాడు ప్రిన్సిపాల్‌గారు నవ్వుతూ.

"ఏమిటి విశేషం?" అన్నాడు తనూ నవ్వుతూ భానుమూర్తి.

"ముందు కూర్చోండి చెబుతాను..." అని కూర్చోబెట్టి, "ఊఁ... అన్నట్లు మీ కోర్టుగొడవలన్నీ సవ్యంగా ముగిశాయా!" అనడిగేడాయన.

"ఆహాఁ! దేవుడి దయవల్ల కావలసినంత అనుభవంతో బయట పడ్డాను..." నిట్టూరుస్తూ అన్నాడు.

"పోనీలెండి–మీరు బయట పడినందుకే మనం ఆనందిద్దాం. జీవితంలో ఎతుపల్లాలు రాకుండా ఉండవనుకోండి. కానీ – అవి మన జీవనగమనానికి ఆటంకాలు కాకూడదు..."

"ఎనీవే... లెటజ్ ఫర్‌గెట్ దెమ్! అన్నట్లు – మీరేదో చెబుతానన్నారు..." అన్నాడు భానుమూర్తి గుర్తుచేసుకుంటూ.

"అవును–కానీ, అది పూర్తిగా వ్యక్తిగతం! మీరు వినేస్థితిలో ఉన్నారోలేదో.." సందేహంగా ఆగిపోయేడాయన.

"అయామ్ ఓకే! ఫర్వాలేదు చెప్పండి"

"అది యిక్కడ మాట్లాడుకునేది కాదు! సాయంత్రం ఒకమాటు మాయింటికి రావడానికి మీకు అభ్యంతరం ఉండదుగా?"

"అలాగే వస్తాను" అని లేచాడు.

ఇంతలో ఎవరో లోపలకు వస్తూండటం చూసి "తర్వాత కలుద్దాం, మీ పనులు చూసుకోండి" అన్నాడు ప్రిన్సిపాల్.

ఆ వచ్చింది విన్సెంట్!

'విలన్'లా కోరగా చూశాడు భానుమూర్తికేసి.

లెక్క చెయ్యకుండా వెళ్ళిపోయేడతను!

డిపార్ట్‌మెంట్‌లో కడుగు బెడుతూండగానే వయొలెట్ "మాస్టారూ! సమయానికి వచ్చారు. మేమందరం ఒక ప్రపోజల్‌తో ఉన్నాం. మీరు తప్పకుండా సహకరించాలి" అంది.

"ఏమిటో చెప్పండి ముందు!" అన్నాడు భానుమూర్తి మందహాసం చేస్తూ వెళ్ళి, తన కుర్చీలో కూర్చుంటూ.

"రేపు ఆదివారం చిన్న పిక్నిక్ ప్రోగ్రాం వేశాం!" అన్నాడు రాజు.

"ఎవరెవరు?"

"కేవలం మన డిపార్టుమెంటువాళ్ళం" కృష్ణస్వామి అన్నాడు.

క్షణం ఆలోచించి బాగానే ఉంటుంది! కానీ ఎక్కడికి?" అడిగేడు భానుమూర్తి.

"ఎక్కడికో కూడానా! ఊరి వెలుపల మామిడి తోపులు ఉన్నాయి. వాటి ప్రక్కన వాగు ఉంది. ఆదివారం పౌర్ణమి గనుక, మూన్‌లైట్ డిన్నర్ ఏర్పాటు

చేసుకుందాం" అంది వయొలెట్.

"కారు ఏర్పాట్లు విశాలగారు చేస్తారు" అన్నాడు రాజు.

ఆమెకేసి చూశాడు భానుమూర్తి.

"విశాలగారు వస్తారో రారో చెప్పనే లేదింతవరకు!" అంది వయొలెట్.

విశాల నవ్వి "ఎందుకు రాను? తప్ప కుండా వస్తాను మామయ్యతో చెప్పి ఏదన్నా 'వేన్' చూడమంటాను" అంది.

భానుమూర్తి పెదవుల మీద చిరునవ్వు కదలింది.

అందరికీ సంతోషమయింది.

ఆ రోజు తినుబండారా లేమేమి ఉండా ల్సిందీ రాజు, వయొలెట్ చర్చించారు.

వాళ్లు ఒక జాబితా తయారు చేశారు.

భానుమూర్తి ఆ కాగితం అందుకుని పరిశీలించాడు.

"ఏదీ-యిటివ్వండి !" అంది విశాల.

తను కూడా చూసి, "ఇవి మా యింట్లో తయారు చేయిస్తాలెండి!" అంది

"మీ కిబ్బందవుతుందేమో!" అన్నాడు కృష్ణస్వామి సందేహిస్తూ.

"అలాంటిదేమీ లేదులెండి ! మా వంట మనిషితో చేయించేస్తాను."

"మరి మనం తేవాల్సిన వేము న్నాయ్?" అంది వయొలెట్.

"లేకేం ? క్రీమ్ బిస్కెట్లూ, పళ్ళూ, కూల్ డ్రింక్స్, ఇవన్నీ ఉన్నాయిగా ?"

"అవునవును, మర్చేపోయేను..." అంది నవ్వేస్తూ.

మొత్తానికి 'పిక్నిక్' కార్యక్రమం ఖాయమయింది !

భానుమూర్తి కూడా, కాస్త మానసి కోల్లాసానికి ఇలాంటివి చాలాఅవసరమని భావించాడు.

ఆ సాయంత్రం కాలేజీ వదలగానే, ప్రిన్సిపాల్‌తోబాటు వాళ్ళ ఇంటికి వెళ్ళేడు.

ఆయన రోజూ నడిచే వస్తాడు, దగ్గర గనుక.

భానుమూర్తి ఆయన్ని స్కూటర్ మీద ఎక్కించుకుని తీసుకెళ్ళాడు.

అద్దె ఇల్లే అయినా, ఇతరులతో ప్రమేయంతేకుండా, విశ్రాంతిగా, అన్ని సౌకర్యాలతో చూడముచ్చటగా ఉంది.

ఇంటిముందున్న జాగాలో దాదాపు అన్ని రకాల పూలమొక్కలూ ఉన్నాయి ప్రహరీ కానుకుని కొబ్బరి చెట్లూ, పోక చెట్లూ ఉన్నాయి.

జాజి పందిరి విశాలంగా ఉంది.

దాని క్రింద రెండు వాలు కుర్చీలూ, మధ్యలో ఒక గుండ్రటి బల్లా ఉన్నాయి.

ఆ బల్లమీద జాజులూ, మల్లెలూ రాసులుగా పోసి ఉన్నాయి.

ఒక యువతి ఓపిగ్గా మాలకడు తోంది.

లోపలకు వస్తూన్న కొత్త వ్యక్తిని చూస్తూనే, సిగ్గుతో చేతిలో పని అలాగే వదలి, మెరపులా ఇంట్లోకివెళ్ళిపోయింది.

ఆమెను చూసింది క్షణమే అయినా, భానుమూర్తి ఆ సౌందర్యానికి చలించ కుండా ఉండలేకపోయేడు !

"మా పెద్దమ్మాయి ప్రతిమ !" అన్నాడు ప్రిన్సిపాల్ నవ్వుతూ.

'నిజంగా ప్రతిమలాగానే ఉంది !' అనుకున్నాడు మనసులో భానుమూర్తి.

"కూర్చోండి, ఇప్పుడే వస్తాను..." అంటూ లోపలకు వెళ్ళేడాయన.

వాలుకుర్చీలో కూర్చున్నాడు భాను మూర్తి.

పువ్వుల గుబాళింపు హాయిగా వుంది.

కొబ్బరిచెట్ల నుండి వస్తున్నగాలీ, చుట్టూ సంజెవెలుగులూ భానుమూర్తిని ఏదో లోకానికి తీసుకెళ్ళాయి.

"నమస్కారమండీ!" తృళ్ళిపడి చూశాడు భానుమూర్తి.

చేతిలో కాఫీట్రేతో నిలబడి ఉంది ప్రతిమ!

ఆమె పక్కన లాల్చీగుండీలు పెట్టుకుంటు నిలబడి ఉన్నాడు ప్రిన్సిపాల్. అయన పెదవులు మందహాసం చేస్తున్నాయి.

"నమస్కారం!" అన్నాడు భానుమూర్తి జవాబుగా.

ప్రతిమ కాఫీ కప్పు చేతికిచ్చింది. మృదువుగా తగిలిన వేళ్ళ కొసలు అతనిలో ఏవో పులకరింతల్ని కలిగించాయి. మెల్లగా కాఫీ 'సిప్' చేస్తూ సభ్యత కాదనుకుంటూనే— అపూర్వమైన ఆమె అందాన్ని మళ్ళీ అదృశ్యమై పోతుందేమోనన్నంత బెంగతో తదేకంగా చూశాడు.

ప్రిన్సిపాల్ మరో కప్పు అందుకుని వాలు కుర్చీలో కూర్చున్నాడు.

బల్లమీదున్న పూలరాసిని 'ట్రే'లో కెత్తుకుని లోపలికి వెళ్ళిపోయింది ప్రతిమ. అలా వెడుతూంటే వీపు మీద వయ్యారంగా అటు-ఇటు ఊగుతున్న అందమైన ఆమె పెద్దవాలుజడని చూడకుండా ఉండలేకపోయేడు.

అంతలోనే—

'ఛ... ఏమిటీ పని...' అని తన్నుతాను మందలించుకుని, సర్దుకు కూర్చున్నాడు.

ఇదరూ కాఫీ త్రాగేశారు.

"స్మోక్ చేస్తారా?"— అడిగేడు ప్రిన్సిపాల్.

"నో థాంక్స్!" అన్నాడు భానుమూర్తి సగౌరవంగా.

ఆయన ఒకమాటు ఇంటోకి చూసి కుర్చీలో వెనక్కి వాలి పడుకున్నాడు. కొద్ది క్షణాల తర్వాత మెల్లగా విషయం ప్రారంభించాడు.

"సృష్టిలో భగవంతుడు ప్రతి వ్యక్తికీ గర్వించగల ఒక ఔన్నత్యాన్నీ, క్రుంగిపోగల ఒక బాధనీ యిస్తాడు..."

ఆ మాటలని ఏటో చూస్తూండిపోయాడు. మొహం గంభీరమైపోయింది. భానుమూర్తి మౌనంగా ఆయనకేసి చూస్తూండిపోయేడు.

కొద్దిక్షణాలు - ఏదో ఆలోచనలో, మానసిక వ్యథలో కొట్టుమిట్టాడుతున్నట్టు కనిపించాడు, ఆయన.

మెల్లగా మామూలు ధోరణిలోకి తిరిగి వచ్చి దీర్ఘంగా నిట్టూర్చేడు.

"భానుమూర్తిగారూ! నేను చాలా దురదృష్టవంతుణ్ణి" చెప్పబోయేదానికి నాందీ వచనం పలికేడు ఆయన మళ్ళీ-

"విషయమేమిటో చెప్పండి'' అన్నాడు భానుమూర్తి సానుభూతిగా.

ఆయన కళ్ళజోడు తీసి, వేలితో కను కొసలు తుడుచుకున్నాడు.

"చెబుతాను! అందుకే ఇవ్వాళ - మిమ్మల్ని పిలిచాను" జీరబోతున్న గొంతుని సరి చేసుకున్నాడు.

"చిన్నతనంలోనే మా ప్రతిమకు పెళ్ళిచేశాను.." ఎందుకనో ఆయన ఆ మాటచెప్పి ఆగేడు. మరెందుకనో ధారాళంగా మాట్లాడటం కుదరడంలేదు. గొంతు దగ్గర వేళ్ళతో నిముకున్నాడు.

భానుమూర్తి విభ్రాంతితోవింటున్నాడు

'ప్రతిమకు పెళ్ళయిందా?'

"కానీ, అల్లుడు - పెళ్ళి అయిన మర్నాడే ప్రమాదంలో చనిపోయేడు"

వెయ్యి వోల్టుల షాక్ తిన్నట్లు చలించిపోయేడు భానుమూర్తి

ఏమిటి?!

ప్రతిమ...వితంతువా?!

అతనికి నమ్మాలనిపించలేదు.

ఆయన మళ్ళీ గొంతు విప్పాడు.



"నేను మనసులో ఎంత కుమిలినా, పైకి ఏమీ తెలియనివ్వలేదు. మేకపోతు గాంభీర్యంతో నా భార్యకూ, ప్రతిమకూ ధైర్యం చెప్పాను 'ఈ పెళ్ళి జరగలేదనుకుందాం! నువ్వు ఏమీ తీయనవసరంలేదు తల్లీ, ఒక్క మాంగల్యంతప్ప' అని నా చిట్టితల్లిని ఊరడించాను. పట్టుదలగా యింటివద్దనే చదివించాను. బి. య్యే.లో ఫస్టుక్లాసు తెచ్చుకుంది 'అంతటితో చాలు నాన్నా' అని యింటిదగ్గరే అల్లికలు, కుట్టుపనుల వంటివి నేర్చుకుంటూండి పోయింది"

భానుమూర్తి మౌనంగా వింటూండి పోయేడు.

అతనిమనసు ఏదోలా అయిపోయింది.

"ప్రతిమకు మరో పెళ్ళి చెయ్యాలని నేను చేసిన ప్రయత్నాలూ, పడిన శ్రమా అంతా యింతా కాదు.. నా కూతురు వితంతువని అనుకోవటానికి సైతం యిష్టపడని నేను ఆమాటే యితరుల నోటి వెంట చులకనగా వింటూంటే, కర్ణరంధ్రాల్లోకి కత్తులు దిగుతున్నట్లే బాధ



పడ్డాను.. కానీ, ఏం చెయ్యగలను? ఎంత మందినని ఎదిరించగలను! ఎందరినోళ్ళు మూయించగలను? ఇంటికి రాగానే అమాయకంగా ఏటో పనిలో నిమగ్నురాలై కన్పించే ప్రతిమను చూసినప్పుడల్లా నా గుండెలు బరువెక్కిపోతాయి. నేను చేరుకోలేని గమ్యాన్ని, నన్ను ఓడిస్తున్న పరిస్థితుల్ని వేలెత్తి చూపుతాయి" ఆగేడు.

ఆయన మొహంలో చురుకుదనాన్నీ, చిరునవ్వుతో కలిసిన ఆప్యాయతనీ చూడటానికి అలవాటు పడిన భానుమూర్తి దైన్యాన్ని చూడలేక పోతున్నాడు.

"భానుమూర్తిగారూ! ప్రతిమ నా కడుపున పుట్టవలసింది కాదు. అది ఏ అదృష్టవంతుల యింట్లోనో పుట్టిఉంటే, యింత నరకాన్ని చూసేది కాదు..." రుద్ధ కంఠంతో అన్నాడు.

"బాధ పడకండి సార్! జీవితంలో ఎప్పుడూ చీకటే ఉండదు..." అనునయించాడు.

"ఇంతవరకూ నన్ను బ్రతికించింది ఆ ఆశ ఒక్కటే! కానీ, ఎంత దూరం నడిచాను! ఎన్ని ఏళ్లు నిరీక్షించాను... ఏదీ వెలుగు ఎక్కడని వెతకనూ? ఎన్నాళ్ళని భ్రమలో జీవించనూ?"

విరక్తిగా నవ్వేడు-అంతలో-

భానుమూర్తి శూన్యంలోకి చూస్తూండి పోయేడు...

"ఏమిటో మిమ్మల్ని చూస్తూంటే నాకొక ఆత్మీయుడు లభించినట్లనిపిస్తుంది. మీరు నాకంటే చిన్నవాళ్ళయినా, జీవితం గురించి సమగ్రమయిన అవగాహన గల వాళ్ళు. ఒక్క మంచికోసం ఎన్ని కష్టాలకయినా ఓర్చగల వ్యక్తిత్వం, స్థైర్యం మీలో గురించి ఊహ్నించాను. అందుకే నా బాధ మీ ముందు చెప్పుకుని కాస్త మనశ్శాంతి పొందాలన్న తపన గలిగింది..."

"నావల్ల మీకు ఏ విధమయిన ఉపకారం జరగ్గలదో సెలవీయండి... నా శాయశక్తులా ప్రయత్నిస్తాను" అన్నాడు భానుమూర్తి నిజాయితీ నిండిన స్వరంతో

ఆయన పేలవంగా నవ్వేడు.

"ఏమని కోరమంటారు?! అర్థించటం అలవాటు లేని వాణ్ణి..." అని ఆగిపోయాడు.

అంతలో ప్రతిమ ఖాళీ ట్రేతో వచ్చింది.

భానుమూర్తి ఆమెకేసి పరిశీలనగా చూశాడు ఈమాటు!

అతని కళ్ళకి ఆమె ఒక సజీవ శిల్పంలా కన్పిస్తోంది.

అంతటి అందమే అపురూపం.

ఆ అపూర్వ సౌందర్యం అడవిగాచిన వెన్నెల కావడం విధివైపరీత్యం!

అతని మనసు జాలితో, వేదనతో నిండి పోయింది.

ప్రతిమ ట్రేలో ఖాళీ కప్పులు తీసుకెళ్ళింది.

ప్రిన్సిపాల్ కుర్చీలోంచి లేచి "మీరీ పూట మాతో డిన్నర్ తీసుకోవటానికి అభ్యంతరం ఏమన్నా ఉందా?" అన్నాడు ఏర్పాట్లు చేయించటానికి వెళ్ళబోతూ.

"ప్రస్తుతానికవేమీ పెట్టుకోకండి... మరెప్పుడన్నా వస్తాను..." అన్నాడు సున్నితంగా నిరాకరిస్తూ భానుమూర్తి.

ఆయన మళ్ళీ కూర్చున్నాడు.

ఇద్దరూ ఏవో కాలేజీ కబుర్లు చెప్పుకుంటుండి పోయేరు.

* * *

ఆదివారం వచ్చింది.

ఆరోజు పౌర్ణమి కూడా కావటం వల్ల, పిక్నిక్ కార్యక్రమం ఆచరణలో పెట్టారు.

ముందుగా నిర్ణయించుకున్న జాబితా ప్రకారం, తినుబండారాలు ఇంట్లో తయారు చేయించుకొచ్చింది విశాల. తనే వ్యానులో అందరి ఇళ్ళకూ వెళ్ళి పికప్ చేసి, పిక్నిక్ ప్రదేశానికి తీసుకెళ్ళింది.

అనువుగా ఉన్న చోటు చూసి, కూర్చోవటానికి వీలుగా జంపకానాలు వేశారు. అందరూ తలొక చెయ్యీ వేసి, సామాన్లు జంపకానా మీదకు చేరవేశారు. డ్రైవరు వాటిని చక్కగా సర్దాడు. అంతా కూర్చున్నారు.

పున్నమి వెన్నెల భూమ్యాకాశాల మధ్య పరుచుకునుంది.

స్వచ్ఛమైన ఆ కిరణాలు సోకగానే, ప్రతి ఆకృతీ కొత్తసోయగాలు చేకూర్చు కున్నట్లు కన్పించింది.

తలొక కూల్‌డ్రింక్ సీసా అందు కుని, కొద్దికొద్దిగా చప్పరిస్తూ ఆ విష యాలు, ఈ విషయాలు, చలోక్తులు, నవ్వులతో కొంతసేపు సందడిగా గడిపేరు.

"ఈ వెన్నెల్లో కమ్మగా ఎవరన్నా పాడితే బావుణ్ణు..." వెన్నెలని తాగు తున్న ఏరుకేసి చూస్తూ అన్నాడు కృష్ణ స్వామి.

వయొలెట్ నవ్వుతూ "అదేదో మొదట మీరే ఆరంభించి బోణీ కొడితే బావుంటుంది..." అంది

"నావన్నీ పాతకాలపు చాదస్తపు పాటలు... ఇప్పటి వాళ్లకు అవి నచ్చవు..." అన్నాడు నవ్వుతూ.

"పాటలో, పద్యాలో— ముందు ఏదో ఒకటి ఆరంభించండి బాబూ... అవతల వెన్నెల చెవులు విప్పుకు నిలబడింది!" చమత్కారంగా అన్నాడు రాజు.

"సరే–పద్యాలే పాడతాను," అంటూ రాయబారం, హరిశ్చంద్రలోని పద్యాలు భావానుగుణంగా విరుస్తూ రాగయుక్తంగా పాడాడు కృష్ణస్వామి.

అందరూ చప్పట్లతో అభినందించారు.

తర్వాత వయొలెట్ రెండు ఇంగ్లీషు పాటలు పాడింది.

రాజు హిందీ పాటలు పాడాడు.

విశాల వంతు వచ్చింది.

"నేను సిన్సియర్ శ్రోతనే గానీ, గాయకురాల్ని కాదు, నన్ను బలవంతం పెట్టకండి..." అని తప్పించుకుంది.

భానుమూర్తి మాత్రం అడిగిన వెంటనే వెన్నెలమీద ఎంకి పాట అందు కున్నాడు.

"యెన్నెలంతా మేసి ఏరు నెమరే సింది...", అన్నప్పుడు అందరూ వాగు కేసి చూసి ఆనందించారు. సందర్భో చితంగా పాడినందుకు అందరూ మెచ్చు కున్నారు.

అంతటితో విడవకుండా– మరి కొన్ని భావ గీతాలు మరీమరీ అడిగి పాడించు కున్నారు.

విశాల మాత్రం మౌనంగా కూర్చుని, అతని గొంతులోని మాధుర్యానికి పరవ శిస్తుండి పోయింది.

"మీరు పాడుతుంటే యింకా, యింకా వినాలనిపిస్తోంది భానుమూర్తి గారూ! శ్రమ అనుకోకుండా మీకు వచ్చినవన్నీ విన్పించెయ్యండి..." అన్నాడు కృష్ణ స్వామి తన్మయంగా.

మిగతా వాళ్లు వంత పలికేరు.

మౌనంగా ఉండిపోయిన విశాల కేసి చూస్తూ "ఈ మాటు నేను రాసిన భావ గీతం విన్పిస్తాను." అన్నాడు.

గబగబా చప్పట్లు కొట్టారు ఆనందంతో! పాట పూర్తవగానే గలగల నవ్వుతూ చప్పట్లు కొట్టింది వయొలెట్.

"మాస్టారు పైకి కన్పించరు గానీ, గడుసువారే" అంది.

భానుమూర్తి నవ్వు పెదవులతో మౌనం దాల్చాడు.

"ఇంకో పాట పాడాలి మీరు!" అంది వయొలెట్.

ఒకమారు ప్రవహిస్తున్న వాగుకేసి చూశాడు భానుమూర్తి. కళ్లు మూసు కున్నాడు.

పాట పూర్తి కాగానే కృష్ణస్వామి పరవశంతో "అందరూ పాడతారు! కొందరే పాటలోని ప్రతి పలుకూ సజీవ దృశ్యంలాగ కళ్లముందు ఊహించుకునేట్లు భావ తన్మయంతో పాడగలరు. మీకు భగవంతుడు ఆ వరం యిచ్చాడు భాను మూర్తిగారూ" అన్నాడు మనస్ఫూర్తిగా.

వయొలెట్ విలాసంగా ఒళ్లు విరుచుకుని "ఇక డిన్నర్ ప్రారంభిద్దాం బాబూ... ఆకలేస్తోంది" అంది.

"ఆల్ రైట్" అంటూ డిన్నర్ ఏర్పాట్లలో నిమగ్నులైనారు. భానుమూర్తి వడ్డనకి దిగాడు.

విశాల కూడా చొరవగా అందరికీ వడ్డించింది.

అందరికీ వడ్డించాక యిద్దరూ చెరో విస్తరీ వేసుకుని పక్కపక్కన కూర్చుని వడ్డించుకున్నారు.

వయొలెట్ అదోలా చూసింది విశాల కేసి.

విశాల అదేమీ పట్టించుకోకుండా పులిహోర వడ్డించుకుంది.

"పదార్థాలు చాలా రుచిగా ఉన్నాయి. చాలా థాంక్సండీ విశాలగారూ!" అన్నాడు రాజు ఆప్యాయంగా తింటూ.

"నో మెన్షన్" అంది మందహాసం చేస్తూ.

"మీ మామయ్యగార్ని కూడా రమ్మనక పోయారా, సర్దాగా బాగుండేది" అన్నాడు కృష్ణస్వామి.

"ఆయనకు త్వరగా నిద్రపోయే అలవాటు. అందువల్ల రాలేనన్నారు."

"ఇంతమందిమి ఏదో ఒకటి పాడి వినిపించాము. మీరు మౌనశ్రోతగా ఉండి పోయారు. నిజంగా పాటలు రాకనా లేక నలుగురిలో పాడటానికి బిడియమా ?" రాజు అడిగాడు.

"వినేవాళ్ళు కూడా ఉండాలిగామరి?" అంది నవ్వేస్తూ.

"నిజమేలెండి! అందరూ పల్లకి ఎక్కితే మోసేదెవరు?" అన్నాడు కృష్ణస్వామి అప్పడం కొరుకుతూ.

నవ్వులు, ఛలోక్తుల మధ్య సందడిగా గడిచిపోయింది సమయమంతా.

భోజనాల తర్వాత సామాన్లన్నీ డ్రైవరుచేత 'వ్యాను'లో సర్దించి, వాగు ఒడ్డుకి వెళ్ళారంతా.

చిన్నచిన్న చేపలు నీటిలోంచి ఎగిరి పడి గెంతుతుంటే, మిలమిలలాడుతూ చూడముచ్చటగా వుంది–వాగు సోయగం.

వాగు మధ్యన ఏదో నీటిపక్షి ఈదుతూ చేపల్ని వేటాడుతోంది.

అయిదుగురూ ఇసుకపైన చతికిల పడ్డారు.

సంభాషణ సాహిత్యంమీద కేంద్రీకృత మయింది.

ఉన్నట్లుండి వయొలెట్ "మన కవులు చంద్రుడికీ, చకోర పక్షికీ సంబంధం చూపెట్టారు. ఇంత వెన్నెల్లో ఒక్క చకోరపక్షి అయినా కన్పించదేం?" అంది. అంటూనే చూపులతో ఆకాశాన్ని గాలించ సాగింది.

భానుమూర్తి జవాబిచ్చాడు.

"కవి భావనా పరిధులు విశాలమైనవి. అవధులు లేనివి. ఒకమాటు వియత్తలం తాకి మరుక్షణంలోనే సాగర గర్భంలోకి చొచ్చుకుపోగల వేగం అతని సొత్తు. కవితా సౌందర్యంకోసం కొన్ని అందమైన కల్పనలు చెయ్యటం ద్వారా తన ప్రజ్ఞను ప్రదర్శిస్తాడు కవి. చెప్పిన సంగతి ఎంత మనోజ్ఞంగా ఉన్నదనేది లెక్కకు వస్తుంది తప్ప, వాటి వాస్తవిక విలువలు కాదు."

"అంటే-చకోరపక్షి వెన్నెల కిరణాలు ఆస్వాదించటం, చాతకపక్షి స్వాతి జల్లు కోసం నిరీక్షించటం ఒట్టి ఊహలే నంటారా?" అతనికేసి చూస్తూ అడిగింది వయొలెట్.

నవ్వాడు భానుమూర్తి.

"ఒట్టి ఊహలు కాదు - అందమయిన ఊహలు!"

గలగల నవ్వారంతా.

"మీరు మనస్తత్వ శాస్త్రంకన్నా తెలుగు తీసుకొని ఉండవలసింది!" అన్నాడు కృష్ణస్వామి.

ఫక్కున నవ్వేశారంతా.

భానుమూర్తి వంక చూస్తూ, విశాల కూడా నిశ్శబ్దంగా నవ్వింది.

ఇద్దరి చూపులూ కలిశాయి.

కొద్ది క్షణాలు వాళ్ళ మనసుల్లో ఏదో విచిత్ర స్పందన కలిగినట్లు అనుభూతిలో మునిగారు.

అంతలోనే తడబడుతున్న బెదురు చూపులతో వెన్నెలపూత పూసుకున్న వాగుకేసి దృష్టి మళ్ళించింది విశాల.

"చాలా పొద్దుపోయింది. వెళ్దామా యిక" అంటూ లేచాడు భానుమూర్తి.

అందరూ లేచి,అతనోబాటు వ్యానుకేసి నడిచారు. సర్దుకుక్కూర్చోవటంలో విశాల, భానుమూర్తి పక్కపక్కనయ్యారు.

వ్యాను బయల్దేరింది.

కుదుపుల్లో శరీరాలు మరింత గాఢంగా హత్తుకుంటూ, ఏదో వింత పరవశాన్ని-కొత్త అనుభూతుల్నీ కలిగిస్తూ పులకింతలు రేపింది యిద్దరిలో.

ఒక్కొక్కరినీ ఇంటి పరిసరాలో దింపుతూ, 'గుడ్‌నైట్'తో వీడ్కోలు చెబుతూ చివరకి విశాలా, భానుమూర్తీ మిగిలిపోయారు.

"నన్ను మీరు దింపుతారా మిమ్మల్ని నేను దింపనా?" చిలిపిగా చూస్తూ ప్రశ్నించాడు భానుమూర్తి.

"డ్రైవర్! ముందు అమ్మగారింటికి పద..." అన్నాడు భానుమూర్తి విశ్రాంతిగా జేరగిలబడుతూ.

"అలాగే సార్..." అంటూ రోడ్డు వంకే చూస్తూ ఏకాగ్రతగా నడప సాగేడు డ్రైవరు.

కారు రోడ్డుమీద పాదరసంలా జారి పోతోంది.

"ఇలాంటి ప్రయాణాలు మీకు బావుంటాయా?" వెన్నెలలోకి మత్తుగా చూస్తూ అడిగేడు భానుమూర్తి.

"చాలా బావుంటాయి! ఈ ప్రయాణం ఆగిపోకుండా కొనసాగి పోతుంటే మరింత బావుంటుదనిపిస్తుంది..." అనుభూతి ధ్వనిస్తున్న స్వరంతో అంది

విశాల.

భానుమూర్తి ఆమె మొహంలోకి విడ్డూరంగా చూశాడు. విశాల సిగ్గుగా నవ్వి తలతిప్పి వెన్నెల్లోకి చూస్తుండి పోయింది. ఆమె రూపాన్ని కళ్ళతో తృప్తి తీరా చూస్తూ తనలో తను నవ్వుకున్నాడు-

సందేహం లేదు!

ఈమె పాషాణం కాదు- హిమశిలే!

ఇప్పుడిప్పుడే కరగటం ప్రారంభమయింది.




కాలేజీ ఎలక్షన్లొచ్చాయి. భానుమూర్తి ఆధ్వర్యంలో ఒక కమిటీని వేశాడు ప్రిన్సిపాల్. అందులో విన్సెంట్ కూడా ఒక సభ్యుడు.

ఈ అవకాశం విడవ దల్చుకోలేదు విన్సెంట్. కాలేజీలో అప్పటికే అల్లరి విద్యార్థులుగా వాసికెక్కిన దుష్ట త్రయాన్ని ఎన్నికలకు పోటీ చెయ్యమని ప్రోత్సహించాడు.

వాళ్ళు పేర్లిచ్చారు.

భానుమూర్తి నిరాకరించాడు.

"విద్యార్థి నాయకులు ఆదర్శవంతమయిన ప్రవర్తన గలవారయి ఉండాలి. క్రమశిక్షణను గౌరవించలేని వాళ్ళూ, పదవి మీద దుర్వ్యామోహం ఉన్నవాళ్ళూ పనికి రారు..." అన్నాడు ఖండితంగా.

"అలాగని ఎక్కడా రూల్సులో లేదు! ఏ విద్యార్థి తమ నాయకుడు కావాలో నిర్ణయించుకోవలసింది విద్యార్థులు. వాళ్ళ హక్కును కాదనటం నియంతృత్వం..." ఎదుర్కొన్నాడు విన్సెంట్.

"మనందరం ఈ మహా సంస్థలో భాగస్థులం! మంచి పేరు వచ్చినా, చెడ్డ పేరొచ్చినా అందులో మనకీ బాధ్యత ఉంటుంది. విద్యార్థులకు మార్గదర్శకులం గనుక వారికి మంచీ-చెడుల విచక్షణా జ్ఞానం కలుగ జేయటం మన విధి..."

విన్సెంట్ తన పట్టుదల వదల్లేదు.

విషయం ప్రిన్సిపాల్ వరకు వెళ్ళింది.

"అలజడి రేపే మనస్తత్వాని కలవాటు పడ్డ వాళ్ళకి పదవులు దొరికితే కాలేజీ ప్రశాంతతకి భంగం వాటిల్లుతుంది. చీటికి, మాటికి బెదిరింపులు, సమ్మెలతో చీకాకులు కలిగిస్తారు. ఈ నాయకత్వం కేవలం విద్యార్థుల సవ్యమయిన సమస్యలు మనకు తెలియడం కోసం, వాటిని సకాలంలో పరిష్కారం చేయడం కోసమే గానీ, మరొక ప్రయోజనం గురించి కాదు..."

"మీరు పూర్తిగా పక్షపాత ధోరణి అవలంబిస్తున్నారు! మీకు భానుమూర్తి గారి మీద అభిమానం ఉండొచ్చును. కానీ, ఆయన గారి మాటలన్నింటికీ వత్తాసు పలకడం అంత మంచిది కాదు" జేవురించిన మొహంతో అన్నాడు విన్సెంట్.

ప్రిన్సిపాల్ ఈ అపనిందకు ఆశ్చర్యపోయేడు.

"విన్సెంట్ గారూ! విచక్షణ మరచి, తొందరలో నిందారోపణ చెయ్యడం

మర్యాద లక్షణం కాదు. పక్షపాత ధోరణి నా మన స్తత్వానికి చాలా విరుద్ధం. సంస్థ క్షేమం దృష్టిలో ఉంచుకుని సమిష్టి ప్రయోజనాల దృష్టితో మాత్రమే నిర్ణయాలు తీసుకోవటం నా కలవాటు..."

విన్సెంట్ నిర్లక్ష్యంగా నవ్వేడు.

"మనం చేసినవన్నీ రైటనుకునే వాళ్లు అంతకన్నా ఏం చెబుతారులెండి..." అనేసి విసురుగా బయట కెళ్ళేడు.

ప్రిన్సిపాల్ భానుమూర్తి మొహం కేసి బాధగా చూశాడు.

"ప్లీజ్ టేకిట్ ఈజీ..." అన్నాడు భానుమూర్తి.

* * *

ఎన్నికల ఫలితాలు వెల్లడైనాయి.

కొందరు పాతవాళ్ళతో బాటు, కొత్త వాళ్ళు కూడా ఎన్నికైనారు.

ముందు నిర్ణయం ప్రకారం – అల్లరి విద్యార్థుల్ని జాబితా నుండి తొలగించటం జరిగింది.

విన్సెంట్ తనంతతాను కమిటీ నుండీ వైదొలిగేడు.

ఎన్నికల ఫలితాలు వెల్లడైన తర్వాత ఉండే వాతావరణం, కొద్దిపాటి ఘర్షణలతో ఆరోజు గడిచిపోయింది.

ఆ రోజు భానుమూర్తికి మామూలు వేళ దాటిపోయింది.

ప్రిన్సిపాల్ కూడా ఏదో పని చేసుకుంటూ ఉండిపోయాడు.

భానుమూర్తి ఆయనతో కలిసి పిచ్చాపాటీ మాట్లాడుకుంటు బయట కొచ్చాడు.

అప్పటికే వీధి దీపాలు వెలిగాయి.

భానుమూర్తి స్కూటరు స్టార్టు చేసి "రండి..మిమ్మల్ని యింటి దగ్గర దింపి వెడతాను.." అన్నాడు.

ప్రిన్సిపాల్ వెనకసీటు మీద కూర్చున్నాడు.

కొద్ది నిమిషాల్లోనే స్కూటరు ఇల్లుచేరింది.

"ఈ రోజు ఎలాగూ ఆలస్యమైంది కదా! నా మాట మన్నించి మా యింట్లో డిన్నర్ తీసుకో కూడదూ?" వాత్సల్యం నిండిన స్వరంతో అడిగేడు ప్రిన్సిపాల్.

భానుమూర్తి కాదనలేక పోయాడు "సరే–పదండి.." అన్నాడు స్కూటరు పార్కు చేసి.

ఆయన మొహంలో క్షణం సంతోషం వెలిగిపోయింది.

ఇద్దరూ లోపలికి నడిచారు.

భానుమూర్తి అప్రయత్నంగా జాజి పందిరి కేసి చూశాడు. లైటు వెలుగులో పువ్వులు కోస్తూ కన్పించింది ప్రతిమ.

అడుగుల చప్పుడుకి వెనక్కి తిరిగి "ఆలస్యమైందే నాన్నారూ?" అని భానుమూర్తిని గమనించి, నాలుక కొరుక్కుంది ప్రతిమ.

ఆయన నవ్వి "ఈరోజు పూలు కొయ్యడం నీకెందుకు ఆలస్యమైంది మరి?" అన్నాడు.

"అమ్మ మైసూర్ పాక్ నేర్పుతుంటే అక్కడే గడిచిపోయింది" అని జవాబిచ్చి భానుమూర్తి నుద్దేశించి "నమస్కారం మాస్టారూ!" అంది చేతులు జోడించి.

భానుమూర్తి చిరునవ్వుతో స్వీకరించాడు.

ఆమె లోపలికి వెళ్ళింది.

"కూర్చోండి భానుమూర్తిగారూ!" అంటూ వాలు కుర్చీచూపి, ఆయన కూడా

బట్టలు మార్చుకోవడానికి లోపలికి వెళ్ళేడు.

భానుమూర్తి కుర్చీలో జేరగిల పడి, పరిసరాలు పరికిస్తూండి పోయేడు.

ప్రతిమ కాఫీ తీసుకు వచ్చింది.

"మీ నాన్నగారినికూడా రానివ్వండి" అన్నాడు మర్యాదకి.

"ఆయన స్నానం, పూజ పూర్తి చేసుకుంటారు. ఈ రోజు గురువారం కదా? ఆయనకు నియమం ఉంది. మీరు తీసుకోండి-ఫర్వాలేదు" అంటూ కప్పు అందించింది.



ఆమె ముని వ్రేళ్ళస్పర్శతో ఏర్పడిన కలవరపాటుని కప్పిపుచ్చుకుంటూ "నేను ఒక్కడినే తాగాలంటే మనసొప్పదు" అన్నాడు యిబ్బందిగా మొహం పెట్టి.

"కొద్దిగానేగా, తాగేద్దురూ.." అందామె ఎదురుగా ఉన్న కుర్చీలో తేలికగా కూర్చుని.



అతను సాసరులోకి కొంత వంపి "యూ కాసా మీరు. కంపెనీ కోసం తీసుకోండి..ప్లీజ్?" అన్నాడు ముందుకి జాపి సాసర్ యిస్తూ.

ఆమె మరే అభ్యంతరమూ చెప్ప కుండా అందుకుంది.

ఆమె కళ్ళలోకే చూస్తూ కప్పులోని కాఫీ మూడు గుక్కల్లో పూర్తి చేశాడు భానుమూర్తి.

'ఆమె విశాలమైన కళ్ళ గురించి భాషమీద అధికారం గల కవి చెప్పాలి!' అనుకున్నాడు.

'ఈయన ఎంత గంభీరంగా, హుందాగా ఉంటాడు!' అన్న భావంకలిగి మెప్పుదలగా చూసింది ప్రతిమ.

ఖాళీ సాసరు బల్లమీద ఉంచింది.

సిగరెట్ పెట్టె తీసి, "మీకు అభ్యం తరం లేకపోతే..." వెలిగించుకోబోతూ అడిగేడు.

ఆమె "అబ్బే! అలాంటిదేమీ లేదు" అంది.

"థాంక్స్" అని లైటరుతో వెలిగించు కుని, తృప్తిగా రెండు దమ్ములు పీల్చాడు.

కుర్చీలో వెనక్కి వాలి, ప్రతిమ కేసి చూస్తూ ఆలోచనల్లో మునిగిపోయేడు.

'తన పట్ల యింత అభిమానంతో ప్రిన్సిపాల్ ఉండటానికి కారణం ఏమిటి?

కేవలం, తన విధి నిర్వహణ దక్షత వల్ల ఏర్పడిన సదభిప్రాయమేనా, లేక అంతకు మించి మరేమయినా ఉందా?

కూతురు గురించి తను పడుతున్న బాధను తన ముందు విప్పి చెప్పుకోవ టంలో ఉద్దేశం ఏమిటి?

ఆ సమస్యకి తన నుండీ సానుభూతి ఆశిస్తున్నా ననడంలో ఏదన్నా గు ప్రభావం ఉందేమో తనకి సరిగా అర్థం కాలేదు.

ప్రతిమను తనకిచ్చి పెళ్ళి జరిపించా లన్న ఆశతో ఉన్నాడేమో ఆయన!

అదే నిజమయితే, ఆయన కోరికలో అనౌచిత్యమేమీ లేదు.

ఒక తండ్రిగా ఆయన బాధ్యత అది.

కానీ, తన విషయం?!

నిజమే!

ప్రతిమను చూసినప్పుడల్లా తను చలిస్తున్నాడు.

ఈ లక్షణం విశాల అందంలో లేదు!

ఇద్దరూ అందగ త్తెలే!

అయితే-వాటిలో ఎంత తేడా!

నిజానికి తను విశాలను గాఢంగా ప్రేమించిందంటూ ఏమీ లేదు!

ఆమెలోని హిమశైలత్వాన్ని కరిగించా లని పట్టుబట్టాడు.

తనకు తానుగా, అందరిలో కలవ కుండా, మగవాళ్ళని ద్వేషిస్తూ, జీవితం పట్ల చిన్న చూపు కలిగిన విశాలని తిరిగి మామూలు స్త్రీగా మార్చండన్న ఆనంద రావుగారి కోరిక మేరకు, వ్యక్తిగతంగా ఆమె వల్ల తనకు కలిగిన మానసిక పరితాపానికి పరిహారంగా ఆమె మనస్త త్వాన్ని శాసించి, విజయకేతం ఎగుర వెయ్యాలన్న పట్టుదలతో కృషిచేసి చాలా వరకూ ఫలితాలు సాధించాడు!

ఇంతా చేస్తున్న లోలోపల యిది నా మెడకు ఉచ్చుగా మారదు కదా?, అన్న సంశయం తలెత్తుతూనే ఉంది.

అదలా సాగుతుండగా, ఇంతలో ఊహించని పరిణామం, ప్రతిమతో పరి చయం!

ఎన్నాళ్లని తను మాత్రం కుంటి సాకు

లతో ఒంటరి జీవితాన్ని అపేక్షించ గలడు?

ఏదో ఒక నాటికి తల్లిదండ్రుల కోరి కకు తల వంచక తప్పదు!

వధువు ఎన్నిక విషయంలో తనకు పూర్తి స్వేచ్ఛ ఉన్నది. వాళ్లు కోరేది కేవలం తననొక గృహస్థుగా చూడాలని.

ఇన్నాళ్లూ - తన జీవితంలోకి ఈ విధంగా చొచ్చుకు వచ్చిన వాళ్లూ- తన మీద ప్రభావాలు చూపిన వాళ్లూ ఎవ్వరూ లేరు !

అందు వల్ల తనకేనాడు ఇటువంటి సమస్య అనుభవంలోకి రాలేదు.

ప్రిన్సిపాల్ గారు తన నుండీ, ఐచ్ఛికమయిన అంగీకృతిని ఆశిస్తూ ఉండ వచ్చును!

ఏమని చెప్పడం?

ఒక్క మాటు అన్నాక కట్టు బడక తప్పదు కద?

ప్రతిమ వితంతువన్న సంగతి ప్రపంచానికి తెలుసు.

తన తల్లి దండ్రులు ఎలాంటి అభ్యంతరం పెడతారో.

వాళ్లతో సంప్రదించి, వాళ్లను కూడా ఔననిపిస్తే తనకు ప్రతిబంధకాలేమీ ఉండవు.

ప్రతిమను చేసుకోవడంలో కారణం ఏదన్నా ఉందంటే, అది కేవలం మాన వత్వం!

స్వరలక్షణ సంపన్న అయిన కన్యను ఎవరయినా స్వీకరిస్తారు.

విధి వంచితులయిన వాళ్ల మీద సాను భూతి చూపగలవాళ్లే మనకు దొరకరు.

"మాస్టారూ!"

ఉలిక్కి పడ్డాడు భానుమూర్తి.

ప్రతిమ నవ్వుతూ "ఉన్నట్లుండి పరధ్యానంలోకి వెళ్లిపోయారేమిటి? నేని ప్పటికి మూడు మాట్లు పిలిచాను..." అంది.

"అయామ్ వెరీ సారీ!" అన్నాడు కించపడుతూ.

"ఫర్వాలేదు లెండి! అన్నట్లు- మీరు పాటలు రాస్తారనీ, కమ్మగా పాడతారనీ విశాల గారు చెప్పారు. ఏది, ఒక పాట వినిపించరూ?"

"విశాల! విశాల యిక్కడకు వస్తూం టుందా?!" ఆశ్చర్యంగా అడిగేడు.

"చాలా తరచుగా వస్తూంటారావిడ?" అతని ఆశ్చర్యానికి కారణం తెలియక వింతగా చూస్తూ అంది.

"ఏమని చెప్పింది?"

"మీరంతా పిక్నిక్‌కి వెళ్ళారట కదూ అక్కడ జరిగిన కాలక్షేపం, మీరు పాడిన పాటల సంగతి కళ్ళకు కట్టినట్లుచెప్పింది. అలాంటివి నాకెంతో యిష్టం. తెలిసుంటే నేనూ వచ్చేదాన్ని" అంది ప్రతిమ.

"మీ యిష్టం సంగతి నాకు తెలి యదుగా?! ఈ మాటు మిమ్మల్ని కూడా పిలుస్తాం" అన్నాడు నవ్వుతూ.

"చాలా థాంక్స్!" అంది ఆనందంగా.

అంతలో ప్రిన్సిపాల్ వచ్చాడు.

లేచి తండ్రికి కుర్చీ వదిలింది.

"నాన్నారూ ! మాష్టారి చేత పాటలు పాడించరూ?" అంది గోముగా.

"అలాగే నమ్మా" అని మంద హాసంతో కూర్చుని, సాభిప్రాయంగా భానుమూర్తి కేసి చూస్తూ "కాస్త మాకూ మీ గొంతు వినే అదృష్టం కలిగించండి భానుమూర్తిగారూ!" అన్నాడు.

ఇక కాదనలేకపోయేడు.

జయదేవుని అష్టపదులు అందుకున్నాడు.

ప్రతిమ-అక్కడే ఉన్న సిమెంటు గట్టుమీద కూర్చొని, అతని కమ్మని గాత్రానికి పరవశం చెందుతుండిపోయింది

అష్టపదులు పూర్తయిన తర్వాత "మరేదన్నా పాడండి..." అంది ప్రతిమ తృప్తితీరనట్లు.

ఆమెకేసి నవ్వుతూ చూసి, 'పుష్ప విలాపం' పద్యాలు వినిపించాడు.

అవి పూర్తి కాగానే లోపలినుండీ భోజనాలకు పిలుపు వచ్చింది.

లేచి లోపలకు వెళ్ళేరు.

ప్రతిమ కూడా వాళ్ళతో భోజనానికి కూర్చుంది.

వంటకాలు చాలా రుచిగా ఉన్నాయి.

భానుమూర్తికి మరోమాటు ఇల్లూ, తల్లిప్రేమా తలపుకొచ్చాయి. ప్రిన్సిపాల్‌గారి అర్ధాంగి ఎంతో శాంతి స్వభావి అని ప్రవర్తనని బట్టి గ్రహించాడు.

ఆమె ఎంతో ఆప్యాయతగా వడ్డించింది.

మైసూర్‌పాక్ వడ్డిస్తు "పీటిని అమ్మాయి చేసింది - కానీ అంత బాగా కుదరలేదు..." అంది, రవ్వంత కించ పడతూ.

ఒక్కముక్క కొరికి చూసి "పీటికేం? బాగానే ఉన్నాయి" అని మెచ్చుకున్నాడు భానుమూర్తి.

ప్రతిమ చటుక్కున అతన్ని చూసింది.

కళ్ళతోనే నవ్వేడతను.

ప్రిన్సిపాల్ , ఆమాటా, ఈ మాటా చెబుతూ మధ్యమధ్యా నవ్వుతూ, నవ్విస్తూ కాలక్షేపం చేశాడు.

భోజనాల తర్వాత పది నిమిషాలు విశ్రాంతి తీసుకుని 'గుడ్‌నైట్' చెప్పి రూమ్‌కి బయల్దేరాడు భానుమూర్తి.

అతని కళ్ళ ముందు ప్రతిమ రూపమే కదలసాగింది.

చెవుల్లో ఆమె పలుకులే ప్రతిధ్వనిస్తున్నాయి.

'ట్రాఫిక్' అట్టే లేదు. గుడ్డి వెన్నెలలో లైట్లు లేని రోడ్డుమీద ఆనవాళ్ళు తెలియటంలేదు. మెల్లగా నడుపుకుంటూ పోతున్నాడు భానుమూర్తి. అతని స్కూటర్ 'హెడ్‌లైటు' కాంతి మరీ హీనంగా ఉంది.

మెల్లగా తనలో తను కూనిరాగం తీసుకుంటూ నడపసాగేడు.

ఎవరో నలుగురు మనుషులు రోడ్డువారగా కూర్చుని ఉండటం చూసి, వాళ్లని తప్పించడానికి పక్కకు పోనిచ్చాడు స్కూటరు.

కూర్చున్న వాళ్ల లేవటం, ఎవరో తాడు విసిరి తనని స్కూటరు మీదనుండీ పడెయ్యటం తెలుసుకునే లోగానే, అతని వంటి మీద సైకిల్ చెయిన్‌తో బలమయిన దెబ్బలు పడ్డాయి. బాధతో ఉండ చుట్టుకుపోయేడు భానుమూర్తి.

తల మీద, వీపు మీదా బాతున్నారు. తప్పించుకుని- ఎదుర్కొని వీలులేక నేల మీద పొర్లాడుతూ రక్తసిక్తమయిన శరీరంతో క్రమశః స్పృహ కోల్పోయాడు భానుమూర్తి

* * *

ఎవరో దగ్గరగా ఏడుస్తున్నట్లనిపించింది. క్రమంగా ఆ ఏడుపు పెద్దదయింది. కళ్లు తెరిచాడు భానుమూర్తి.

ఆశ్చర్యం కలిగింది.

"ఏమిటి? తనింకా బ్రతికేఉన్నాడా?!"

శరీరంలో ఏ భాగం కదిలించాలన్నా భయంగా ఉంది. ఒళ్లంతా చిట్లిపోయినట్లు అనుభూతి.

"బాబూ!"

అతనికి ఒళ్లు పులకరించింది.

"అ...మ్మా..." బలవంతంగా అటు తిప్పాడు మొహం.

ఆవిడ కళ్ళు వర్షిస్తున్నాయి.

మొహం ఆవేదనతో నిండి ఉంది.

"ఎందుకిలా అయిందిరా ? నువ్వేవ రికీ కీడు చెయ్యని వాడివి..." ఆవిడకు ఉద్వేగంలో గొంతు పెగలటం లేదు.

బలహీనంగా నవ్వేడు భానుమూర్తి.

"చిన్నప్పుడు అంటుండే దానివి కదమ్మా... సంతోషం కలిగినప్పుడు ఒళ్లు మర్చిపోకూడదని ! దుఃఖం కలిగి నప్పుడు ధైర్యం కోల్పోకూడదనీనూ ! జీవితం కదా—అన్నీ అనుభవించా లమ్మా !" ఆయాసం అణచుకుంటూ అన్నాడు.

"నా మాటలు నాకే అప్పజెబు తున్నావా బాబూ..." ఆక్రోశిస్తూ అందావిడ.

అంతలో డాక్టరుతోబాటు తండ్రి వచ్చాడు. వస్తూనే ఆత్రంగా "స్పృహ వచ్చిందా బాబుకి ?" అనడిగేడు.

"నాన్నగారూ..." ఆర్తిగా పిలిచాడు భానుమూర్తి. బదులుగా "బాబూ" అంటూ ఆయన ఒక్క ఉదుటున సమీ పించి "ఇప్పుడెలా ఉంది బాబూ..." అన్నాడు చేతుల్తో ఆప్యాయంగా తడు ముతూ.

"తేలిగ్గానే ఉంది..." అన్నాడు పెదవులు బిగపట్టి. ఆయన కళ్ళవెంట నీళ్ళు ధారగా జాలు వారేయి.

ఇద్దరూ ఆవేదనగా ఒకరి కళ్ళలోకి ఒకరు చూసుకున్నారు.

డాక్టరు తన పరీక్షలు తాను చేశాడు. స్టెతస్కోపు మడిచి చేతిలో పట్టుకుని మరేం ఫర్వాలేదు! మీరు చాలా అదృష్ట వంతులు ఇన్ని దెబ్బలు తిన్నా సులభంగా తట్టుకోవటం మరొకరివల్ల అయ్యేది కాదు! వారంరోజుల్లో మళ్ళీ మామూలుగా తిరుగుతాడు" అన్నాడు ధైర్యం చెబుతూ.

"థాంక్స్ డాక్టర్" అన్నాడు భానుమూర్తి.

"నో మెన్షన్.." అని, "మీరు ఎక్కువగా మాట్లాడి అలసిపోవటం మంచిదికాదు. ఉద్వేగం, ఆవేశం రాకుండా చూసుకోండి.." బయటకు వెళ్ళేడు.

ఆనందరావుగారు, విశాల వచ్చారు.

"ఇప్పుడు తేలిగ్గా ఉందా?" అన్నా డాయన సమీపిస్తూ

"మీ దయవల్ల కాస్త తేలిగ్గాఉంది! మీమేలు ఎన్నటికీ మర్చిపోలేము. సమ యానికి మీరు ఆదుకుని ఉండకపోతే, మా జీవితాలు చీకటి మయం అయి ఉండేవి.." భానుమూర్తి తండ్రి కృతజ్ఞత వెల్లడించాడు.

ఆయన అడ్డువస్తూ "అంతా భగవంతుని దయ! మనదేమీలేదు. భానుమూర్తి డైరీలో నా టెలిఫోను నెంబరు చూసి అతను నాకు ఫోనులో తెలియజేయక పోతే నేను మాత్రం ఏం చెయ్యగలిగే వాడిని ? మనం అందరం, తన పౌర ధర్మాన్ని సవ్యంగా నిర్వర్తించిన ఆ అపరిచయ వ్యక్తికి కృతజ్ఞులమై ఉండాలి" అన్నాడు.

భానుమూర్తికి వాళ్ళ మాటలవల్ల జరిగిన విషయం అర్థమైపోయింది.

వాళ్ళు తనను కసిదీరా బాదుతుండగా తన అదృష్టం బావుంది, దారినవెళ్ళే వాళ్ళెవరో కల్పించుకుని ఉంటారు! తన జేబులోని డైరీ తీసి చూసి ఆనంద రావుగారికి ఫోను చేసి ఉంటారు.

ఆయన వెంటనే వచ్చి, తనని ఆస్పత్రిలో జేర్పించి తన తల్లిదండ్రులకి టెలిగ్రాం యిచ్చిఉంటాలి.

ఇప్పుడిప్పుడే మత్తువదలిపోతూ, గాయాల బాధ తెలుస్తోంది.

"డోన్ట్‌వర్రీ భానుమూర్తీ! త్వరలోనే కోలుకుంటావని హామీ యిచ్చారుడాక్టర్లు" ఆప్యాయంగా పైన చెయ్యివేసి ధైర్యం చెప్పారు ఆనందరావుగారు.

భానుమూర్తి పెదవులనుండీ శుష్క- హాసం వెలువడింది.

ఆనందరావుగారి పక్కనే నిలబడి ఉన్న విశాల కళ్ళల్లో భీతీ, ఆందోళన స్పష్టంగా కన్పిస్తున్నాయి.

ఒకరి కళ్ళల్లోకి ఒకరు చూసుకుంటూ కొద్ది క్షణాలు మౌనంగా ఉండిపోయారు.

"ఇంకా కాలేజీకి వెళ్ళలేదా మిస్. విశాలా?" నీరసంగా ప్రశ్నించాడు.

"ఇవేళ వెళ్ళను.." ఏడుపు అణుచు కుంటున్నట్లుంది మాట.

అతనికి అలసటగా అన్పించింది, నాలుకతో పెదవులు తడుపుకుంటూ- "దాహం" అన్నాడు.

చప్పున గ్లూకోజ్ నీళ్ళగ్లాసందుకుని, మెల్లగా స్పూన్‌తో తాగించింది.

అతని తల్లి కన్నార్పకుండా ఆ దృశ్యాన్ని చూస్తూండిపోయింది.

ఆనందరావుగారు, భానుమూర్తి తండ్రి సుందరయ్యగార్ని కలుపుకుని వరండా వైపు వెళ్ళేడు.

"నువ్వు వారి అమ్మాయివా తల్లీ?" కుతూహలంగా ప్రశ్నించింది భానుమూర్తి తల్లి సీతమ్మ.

"కాదండీ! నాకు తల్లిదండ్రులు లేరు. ఆయన నాకు మేనమామ" అంది వినయంగా.

ఆవిడ నొచ్చుకుని "అలాగా?!" అంది.

"నేనూ, ఆవిడా ఒకే కాలేజీలో పని చేస్తున్నాం అమ్మా" అన్నాడు తల్లి మరిన్ని ప్రశ్నలు వెయ్యకుండా.

"చాలా సంతోషం" అందావిడ ఆనందిస్తూ.

చేతి గడియారం చూసుకుని "ప్రిన్సిపాల్ గారొచ్చారేమో ఫోనుచేసి వస్తాను" అని బయటకు వెళ్ళింది విశాల.

"చొరవగల పిల్ల! బుద్ధిమంతురాలు" అంది సీతమ్మ మురిపెంగా విశాల వెళ్ళిన వైపు చూస్తూ.

నిశ్శబ్దంగా నవ్వుకున్నాడు భాను మూర్తి అంతబాధలోనూ!




వార్త తెలియగానే, ప్రిన్సిపాల్ మరి కొందరు లెక్చరర్లు చూడ వచ్చారు. విన్సెంటు కూడ రావటం భానుమూర్తికి కాస్త వింతనిపించింది.

"ఎలా జరిగింది? ఎవరు చేశారీపని!" హడావిడిపడుతూ అడిగేడు ప్రిన్సిపల్.

రాజు "ఇప్పుడు తేలిగ్గా ఉన్నదా?" అన్నాడు స్నేహపూర్వకంగా చూస్తూ.

"ప్రమాదకరమయిన దెబ్బ లేమీ తగల్లేదు కదా?" యింకొకరు పరామర్శించారు.

అందరికీ చిరునవ్వుతో తగు సమాధానాలు చెప్పాడు.

సీతమ్మ వీళ్ళందరినీ చూడగానే తొలిగి, దూరంగా నిలబడ్డది.

ప్రిన్సిపాల్ ఆవిడను చూడగానే "మీ అమ్మగారనుకుంటాను" అని భానుమూర్తినడిగి అతను "అవు"ననగానే చేతులు జోడిస్తూ "నమస్కారమమ్మా!" అన్నాడు.

మిగతా లెక్చరర్లు కూడ నమస్కారాలు చెప్పారు. ఆవిడ బిడియంగానే ప్రతి నమస్కారం చేసింది.

"మీ అబ్బాయికేమీ ఫర్వాలేదు. మేమంతా ఉన్నాం. అన్నట్లు మీరు ఎక్కడ బస చేశారు? మా యింటికి వెడదాం రండి. భానుమూర్తిగారూ! మీ నాన్నగారెటు వెళ్ళారు?" అడిగేడు ప్రిన్సిపాల్.

అతను సమాధానం చెప్పేలోగానే విశాల కల్పించుకుని "వాళ్ళ బస ఏర్పాట్లు మా యింట్లోనే చేయించారు మామయ్య!" అంది.

"అలాగా! అయితే యింకేం? ఆనందరావుగారు పూనుకుంటే జరగనిదేమిటి? అన్నట్లు, మీ మామయ్యగారేరమ్మా?" అడిగారు ప్రిన్సిపాల్.

"భానుమూర్తిగారి తండ్రిగారిని తీసుకుని అటు వెళ్ళారండీ.."

"అలాగా?" అని భానుమూర్తికేసి తిరిగి "భానుమూర్తిగారూ! రాత్రి మీ మీద దౌర్జన్యం చేసిన వాళ్ళ గురించి పోలీసు రిపోర్టు చేశారా?" అనడిగేడు.

"లేదండి! వాళ్ళు ఒకమాటు వచ్చి, నేను స్పృహలోకి రానందువల్ల తిరిగి వెళ్ళిపోయారని తెలిసింది."

"తప్పకుండా రిపోర్టు యివ్వండి ఇలాంటివి తేలిగ్గా తీసుకోకూడదు" నొక్కి చెప్పాడాయన.

"మీరు ఆ వ్యక్తుల్ని గుర్తు పట్టగలరా?" వచ్చిన తదాదీ మౌనంగా నిలబడిన విన్సెంట్ అడిగిన మొదటి ప్రశ్న అది!

భానుమూర్తి వింతగా చూశాడతనికేసి.

"గుర్తు పట్టినంతలో ప్రయోజనం ఏమన్నా ఉంటుందంటారా?" ఎదురు ప్రశ్నించాడు.

"ఎందుకుండదూ? ఆ వ్యక్తులు మనకు పరిచితులే అయితే నాకు చెప్పండి. మిగతా విషయాలు నేను చూసుకుంటాను" అన్నాడు ప్రిన్సిపాల్.

విన్సెంట్ మొహంలో రంగు మారటం స్పష్టంగా కనిపించింది, భానుమూర్తికి.

'ఈ సంఘటన వెనుక యితని అదృశ్య హస్తం ఉన్నదా?' అన్న ఆలోచన కలిగింది ఒక్క క్షణం.

నిజానికి తనెవర్నీ సరిగా చూడలేకపోయేడు.

అసలిలాంటిది తనకు జరుగుతుందన్న ఊహ సైతం లేనందువల్ల, అప్రమత్తంగా ఉండలేకపోయేడు.

వాళ్లు ఎవరని తను గుర్తిస్తాడు!

తన సందేహాలు నిజాలని ఎలా అనుకోవటం?

"నేనెవర్నీ సరిగా గమనించలేదు! గుర్తించటం వీలు కాదు" అన్నాడు మెల్లగా.

విన్సెంట్ మొహంకేసి అప్రయత్నంగా చూసిన భానుమూర్తికి, అతను నవ్వు దాచుకుంటున్నాడేమోననిపించింది.

"దట్సాల్ రైట్! మీరు పోలీసులకి వీలయినన్ని 'క్లూ'లు యివ్వటానికి ప్రయత్నించండి. మరి నాకు శలవిప్పిస్తారా? మళ్ళీ సాయంత్రం వస్తాను! ఈ కబురు తెలిసి, ఉన్నవాణ్ణి ఉన్నట్లువచ్చేశాను. పాపం వీళ్ళంతా కూడ ఆదుర్దాగా వచ్చారు" అన్నాడు ప్రిన్సిపాల్ వాళ్ళని చూస్తూ.

"మీ అందరికీ థాంక్స్"నమస్కారం చేశాడు భానుమూర్తి.

"నో మెన్షన్! వస్తామమ్మా" అని సీతమ్మకి కూడ మర్యాద పూర్వకంగా చెప్పి, వెళ్ళేడు ప్రిన్సిపాల్.

మిగతా వాళ్ళుకూడ శలవు తీసుకుని నిష్క్రమించారు.

"మా ప్రిన్సిపాల్, యితర లెక్చ



రమ్ము–" అన్నాడు తల్లితో.

ఆవిడ మళ్ళీ కొడుకు సమీపాని కొస్తూ "అలాగా?!" అంది. విశాల సీతమ్మ పక్కనే ఉన్న 'స్టూలు' మీద కూర్చుంది.

అంతలో 'స్టేట్ మెంట్' తీసుకోవడం కోసం పోలీసులు వచ్చారు!

*  *  *

ఆ సాయంత్రం తండ్రితో బాటు ప్రతిమ కూడ వచ్చింది.

సుందరయ్యగారు, సీతమ్మ కొడుకు సమీపంలో కూర్చుని ఉన్నారు. భాను మూర్తికి జ్వరం వచ్చింది. నుదుటి మీద తడిగుడ్డ వేశారు, ఒక నర్సు పక్కనే నిలబడి 'ఐస్‌క్యాప్'తో తలమీద అదుము తోంది.

ప్రిన్సిపాల్ నిశ్శబ్దంగా లోపలికివచ్చి "ఏమైంది?" అన్నాడు మెల్లగా ఆత్రుత ధ్వనించే స్వరంతో.



చటుక్కున కళ్ళు తెరిచాడు భాను మూర్తి. ప్రిన్సిపాల్ బాధగా, ఆవేదనగా చూస్తూ నిలబడ్డాడు. పక్కనే నీళ్ళు నిండిన కళ్ళతో ప్రతిమ కన్పించింది.

తన కోసం పరితపించే వాళ్ళను చూసి నప్పుడు కలిగే ఒకలాంటి హాయి, ఒక వింతయిన అనుభూతి అతనికి కలిగాయి.

అతని కళ్ళు ప్రతిమనే చూస్తున్నాయి ఆమెకు ధైర్యం కలగాలని మందహాసం చేశాడు.

"ఎలా ఉంది మాస్టారూ?" ప్రతిమ అడిగింది.

"అయామ్ ఆల్‌రైట్" నవ్వుతూనే జవాబిచ్చాడు భానుమూర్తి.

"ఐనో...ఐనో...యూ ఆర్ స్ట్రాంగ్ హార్టెడ్" ప్రిన్సిపాల్ ధైర్యం చెబుతూ ప్రశంసగా అన్నాడు.

తల్లిదండ్రులకు వాళ్ళని పరిచయం చేశాడు భానుమూర్తి.

నమస్కార ప్రతి నమస్కారాలు అయ్యాక సుందరయ్యగారితో కలిసి నడవాలోకి వెళ్ళాడు ప్రిన్సిపాల్.

సీతమ్మ ప్రతిమ అందచందాల్నీ, మాట పొందికనీ, వినయ విధేయతల్నీ గమనించి లోలోపల ఎంతో మెచ్చు కుంది. ప్రతిమ చెంగు నిండుగా కప్పుకు నిలబడింది.

"ఇలా వచ్చి కూర్చోమ్మా" అని స్టూలు ముందుకు జరిపింది సీతమ్మ.

"మీరు పెద్దవారు మీరు కూర్చోండి నేనిలా నిలబడతాలెండి" అంది సవిన యంగా.

"నేనిలా మంచం మీద కూర్చుంటాలే నువ్వా కూర్చో ఫర్వాలేదు" అంటూ బలవంతాన కూర్చోబెట్టింది.

'ఇలాంటి చక్కని ఆడపిల్లల్ని చూస్తూ కూడా వీడు పెళ్ళి సంగతి మరచి ఎలా ఉంటున్నాడో...' అని కొడుకు మనః ప్రవృత్తి అర్థంగాక తల్లడిల్లింది సీతమ్మ.

ప్రతిమని చూస్తుంటే ఎంతో ముచ్చటనిపించింది. ఇలాంటి బంగారుబొమ్మ నత ఇంటి కోడలయితే...

ఇన్నాళ్ళ కలలు ఫలించి, తన జీవితం తృప్తిమయమైపోదూ?

అంతలోనే చిన్న శంక తలెత్తింది.

ఇదేమిటి? –

తను ఆ పిల్లకి పెళ్ళైనదీ, లేనిదీఖాయ పర్చుకోకుండానే ఊహలు పెంచుకుంటోంది! – ఈ కాలంలో చూపులతో యిలాంటివి వెంటనే తెలియవు! సందేహ నివృత్తికోసం తన మనసులోని మాట అడిగేసింది.

ప్రశ్న వింటూనే దెబ్బతిన్నలేడిలా వణికిపోయి, చటుక్కున తలవాల్చి కన్నీళ్ళు చిందించింది ప్రతిమ.

"ఏమిటమ్మా నీ ప్రశ్నలూ..." విసుక్కున్నాడు భానుమూర్తి. తనడిగిన దాంట్లో తప్పేమిటో తెలియక, తెల్ల బోయింది. సీతమ్మ.

* * *

పది రోజుల్లో భానుమూర్తి ఆరోగ్యం చాలా మెరుగయింది.

ఇన్ని రోజులుగా తన తల్లిదండ్రులకు అన్నిసౌకర్యాలు సమకూర్చటంలోఆనంద రావుగారు, విశాల తీసుకున్న శ్రద్ధ అతనికెంతో సంతోషాన్ని కలిగించింది.

మనసులోనే వాళ్ళని మెచ్చుకున్నాడు

సాయంత్రం వేళల్లో-ప్రతిమను వెంట బెట్టుకు వచ్చేవారు ప్రిన్సిపాల్. భాను మూర్తికి తన స్వహస్తాలతో కూర్చిన

పుష్పగుచ్ఛాన్ని వెన్నెలలాంటి స్నిగ్ధ హాసంతో అందిస్తుండేది ప్రతిమ.

ఆ పుష్పగుచ్ఛాన్ని ఎంతో యిష్టంగా మర్నాడు ఆమె వచ్చేవరకు తన దగ్గరే ఉంచుకునేవాడు భానుమూర్తి.

మళ్ళీ తనతోబాటు మరొకటి తెచ్చేది ప్రతిమ.

కొడుకు ప్రతిమపట్ల చూపుతున్న ఆపేక్షను సీతమ్మ యిట్టే పసికట్టింది. ఆవిడ లోలోపల దేవుణ్ణి ప్రార్థించింది–

'భగవాన్! యిప్పటికైనా వీడిలో వివేకం కలిగిస్తున్నందుకు ధన్యురాల్ని... అన్నీ సవ్యంగా పూర్తయేలా నీవే మమ్మల్ని నడిపించాలి ... మా వంశం ముందుకి సాగేలా అనుగ్రహించాలి...

అప్పట్నుంచీ ప్రతిమ రాగానే తను అవతలకు తప్పుకుని కావాలని వాళ్ళిద్దరికీ ఏకాంతం కల్పించేది సీతమ్మ.

ప్రిన్సిపాల్‌గారి పరామర్శ పూర్తి కాగానే, ఆయనతో ఆమాటా, ఈ మాటా ముచ్చటిస్తూ ఆస్పత్రి ముందున్న లాన్‌లో సిమెంట్ బెంచీ మీద కూర్చుని, కాలక్షేపం చెయ్యటం సుందరయ్యగారి 'రొటీన్'గా మారింది.

విశాల కాలేజీనుండి నేరుగా వచ్చి, కొద్ది నిమిషాలు భానుమూర్తి దగ్గర కూర్చుని, ఇంటికి వెళ్ళిపోయేది. క్యారేజీలో భోజనం స్వయంగా సర్ది, ఆస్పత్రికి పంపించేది.

భానుమూర్తికి తినిపించి, సీతమ్మ దంపతులు కూడా అక్కడే భోజనం చేసేవాళ్ళు.

ఈ ఏర్పాటు సుందరయ్యగారి అభ్యర్థన మీదనే జరిగింది.

భానుమూర్తిమీద ఆయనకు అమిత వాత్సల్యం. అది యీ ఆపత్సమయంలో ఇనుమడించింది.

కొడుకుని అహర్నిశలు కనిపెట్టుకొని కూర్చునేవాడాయన. ఒంటరిగా కొడుకుని విడిచి కేవలం భోజనంకోసం వెళ్ళటానికి ఆయనకు మనస్కరించలేదు.

భానుమూర్తి ఏకాంతంలో – ప్రతిమకు తనపట్లగల అభిప్రాయం తెలుసుకొనే ప్రయత్నం చేశాడు.

"రోజూ నాకోసం యింత కష్టపడి పూలగుచ్ఛం చేయటం దేనికి?" నవ్వుతూ ప్రశ్నించాడు.

ఆమె కళ్ళను మరింత విశాలం చేసుకొని చూస్తూ "కష్టమా?" అంది. ఆశ్చర్యపోతూ.

"కాదామరి?"

"ఎందుకని అలా అనుకుంటున్నారు?"

"అంత సుకుమారమయిన చేతులకి శ్రమ యివ్వటం ..."

"అందుకేగా పూలను మాలగా కడుతున్నది! పూలకన్నా సుకుమారమైనవి సృష్టిలో ఏమున్నాయి?" అంది నవ్వేస్తూ.

"చూడండి–నాకు అసలే అత్యాశ! మీరు యిలాంటి కానుకలు అలవాటు చేస్తే పది రోజులతో తృప్తిపడేవాడిని కాదు..." కొంటెగా చూస్తు అన్నాడు.

"అంతేకదా! మీరున్నన్నాళ్ళూ యిస్తాను. సరేనా?" అంది కిలకిలనవ్వుతూ.

"జీవితాంతమూ కావాలంటే..."

ఆమె షాక్ తిన్నట్లు చూసింది.

"మా...స్టా...రూ..." ఆమె కళ్ళు ఆర్ద్రమయ్యాయి.

తను విన్నది పొరబాటు కాదు కదా అన్నట్లు చూసింది.

"అవును, ప్రతిమా! నేనీ నిర్ణయాని కెప్పుడో వచ్చాను... నీ అభిప్రాయం కూడా కనుక్కొని, మా వాళ్ళతో మాట్లాడదామనే ఉద్దేశ్యంతో ఉన్నాను.."

"కానీ, విశాలగారు..." అంటూ ఏదో చెప్పబోయి ఆగిపోయింది.

అతని భ్రుకుటి ముడివడింది.

"ఊఁ... విశాల ?!" రెట్టించాడు.

ప్రతిమ తలవంచుకుని మౌనంగా ఉండిపోయింది.

"చెప్పు ప్రతిమా! ఆగిపోయావేం ?" కుతూహలంగా అడిగేడు భానుమూర్తి.

మెల్లగా తల [illegible] మీ మీద విశాలగారు ఆశలు పెట్టుకున్నారు..." అంది. తెల్లపోయేడు. మెల్లగా తెప్పరిల్లి అడిగేడు.

"నీతో అలా చెప్పిందా ?"— ఈ కొత్త విషయం అతన్ని అయోమయం లోకి నెట్టింది. మనస్సులో సంఘర్షణ మొదలయింది.

తను భయపడినంతా అయిందన్న మాట !

"ఆవిడ మాటల్ని బట్టి గ్రహించాను" అంది ప్రతిమ కొంగు వేలికి చుట్టుకుంటూ.

తేలిగ్గా నిట్టూర్చేడు భానుమూర్తి.

"చూడు ప్రతిమా! విశాల నన్ను, నా చనువునీ అలా అపార్థం చేసుకునే కారణాలు లేకపోలేదు. ఆమెలో మానసిక పరివర్తన తీసుకురావడానికే అలా ప్రవర్తించాల్సి వచ్చింది. అందుకు కొంత ఆనందరావుగారి ప్రోద్బలం కూడా కారణం..." విషయాన్ని వివరించాడు.

"కానీ మీ పట్ల ఆమెకున్న ఆపేక్ష అనంతం! ఆవిడ ప్రవాహంలో కొట్టుకు పోతోంది... నిర్దయగా మీరు నిరాకరిస్తే ఆమె తట్టుకోలేక పోవచ్చు..." జాలిగా అంది.

భానుమూర్తి అయోమయంగా చూశాడు.

"ప్రతిమా! నీకు ఒక విషయం చెప్పనీయ్. నా జీవితంలో పెళ్ళి చేసుకుందామన్న ఊహ కలిగింది నిన్ను చూసిన తర్వాతే. ఇది చాలా కాలం తరువాత నాలో కలిగిన పరివర్తన. విశాల పట్ల నాకు ఆసక్తి కలిగిన మాట కాదనను. కానీ, ఆమెతో గడిపే జీవితం గురించి నేను కలలు గనలేదు. నిజానికి, నేను ఆమెతో చాలా గంభీరంగా, వీలయినంత దూరంగా ఉంటూ వచ్చాను!"

"కానీ, అదే మీ మీద ఉన్నత భావాలు ఏర్పడడానికి దోహదం చేసింది! మా ఇంటికి వస్తే, ఉన్న కాస్సేపటిలో ఎక్కువసేపు మీ గురించే మాట్లాడుతుంది. పూర్వం ఎంతో ముభావంగా ఉండే మనిషిలోని మూగవీణను మీరు సవరించి, మీటి నందువల్లనే కదా, ఆవిడలో ఈ మార్పు కలిగింది ?"

భానుమూర్తి మౌనంగా ఉండిపోయేడు.

"ఆలోచించండి! మీకు సవ్యమని తోచిన విధంగా చెయ్యండి..." అర్థించింది ప్రతిమ.

అతను బాధగా కణతలు వత్తుకున్నాడు,

"మాస్టారూ! ఈ విషయం గురించి అతిగా ఆలోచించి మనసు పాడు చేసుకోకండి... మీరు నన్ను అదృష్టవంతురాల్ని చేయదల్చుకున్నందుకెంతో కృతజ్ఞురాలిని. కానీ— నా జీవితాన్ని చక్కదిద్దేందుకు మరో జీవితాన్ని కూల

దొయ్యటం మంచిది కాదేమో ఆలోచించండి... అంతే నేను చెప్పదల్చుకుంది..."

భానుమూర్తి కళ్ళు గట్టిగా మూసుకున్నాడు.



ఆ పల్లెలో సుందరయ్యగారిది సంపన్న కుటుంబం.

పూర్వీకులనుండీ సంక్రమించిన ఆస్థిని మరింత పెంచి కీర్తిప్రతిష్టలు గడించారు ఆయన.

ఒక్కగానొక్క కొడుకయిన భానుమూర్తి ఉద్యోగం పేరుతో ఊళ్ళుపట్టి తిరగటం సుతరామూ ఇష్టం లేకపోయినా గట్టిగా కాదనలేకపోయారు. కనీసం ఒక ఇంటి వాణ్ణయినా చేయాలన్న తపన ఫలించింది కాదు.

ఇప్పటికీ ఆ పల్లెలో సుందరయ్యగారి తండ్రి కట్టించిన భవంతే అన్నిటికంటే పెద్దది.

భానుమూర్తి ఎప్పుడు యింటికొచ్చినా పిట్టగోడ దగ్గర వాలుకుర్చీ వేసుకుని, సుదూరపు దృశ్యాలను పరికిస్తూండటం పరిపాటి.

తల్లిదండ్రుల బలవంతం మీద కొన్నాళ్ళపాటు శలవుపెట్టి వాళ్ళతో యింటికి వచ్చాడు.

శుభ్రమైన వాతావరణం, పుష్టికరమయిన తిండి అతని ఆరోగ్యాన్ని త్వరగానే మెరుగు పరుస్తున్నాయి. పగలంతా పుస్తకాలతో కాలక్షేపం. సాయంత్రం మేడమీద కూర్చుని దిగంతాలను వీక్షిస్తూ, గూళ్ళను చేరుకుంటున్న పక్షుల కలకలం వింటూండిపోవటం - ఇదీ అతని నిత్య కార్యక్రమం.

అప్పుడప్పుడు-ప్రతిమ, విశాల ఆలోచనల్లోకి ప్రవేశించి చీకాకు కలిగిస్తుంటారు. బలవంతంగా ఆలోచనలు తెంచుకుని, మనసుని మరోదారి పట్టించడానికి విఫలయత్నం చేసి విసుగెత్తి ...డు.

'వెళ్ళిన తర్వాత మీ ఆరోగ్య విశేషాలతో ఉత్తరం రాస్తారు కదూ?'- ప్రతిమ వీడ్కోలు చెబుతూ అన్నమాటలు మనసులో మెదిలినప్పుడల్లా కలం కాగితం తీసుకుని, శూన్యంగా ఉన్న హృదయంలో ఎలాంటి స్పందన, ప్రేరణ కలుగక మళ్ళీ వదిలెయ్యడం జరుగుతోంది.

'ఆరోగ్యాన్ని నిర్లక్ష్యం చెయ్యకండి' అంది విశాల.

తను చేసినా, అమ్మ ఊరుకోదు!

శరీరారోగ్యానికేం-బంగారంలా ఉంది.

జీవితంలో మనిషి మనసు విషయంలో అజాగ్రత్త పడనంత వరకు ఫర్వాలేదు.

ఒక్కమాటు అదుపు తప్పిన మనసుని మళ్ళీ దారికి తేవాలంటే, తన యావచ్ఛక్తినీ ధారపోయాలి. అప్పుడయినా ఫలితం దక్కితీరుతుందన్న నమ్మకం లేదు!

అందువల్లనే కాబోలు - మనసుతో కన్నా, శరీరంతో బ్రతికే వాళ్లు ఎక్కువగా సుఖ పడతారు.

వాళ్ళను మానసిక బాధలు, చీకాకులు బాధించవ్.

"అబ్బాయ్! నీకేదో ఉత్తరం వచ్చిందిరా..." అంటూ కవరు తెచ్చి యిచ్చింది సీతమ్మ.

ఆ ఊరికి సాయంత్రంగానీ ఉత్తరాలు అదంవు! రైల్వే స్టేషను పొరుగూళ్ళో ఉన్నది. ఆ ఊళ్ళో బట్వాడా చేసిన తర్వాత, యిటొచ్చి యిస్తాడు పోస్టు జవాను.

కవరు చింపిచూసి, ఆశ్చర్యపోయేడు భానుమూర్తి.

ప్రతిమ రాసింది.

"మాస్టారూ!

మీ ఉత్తరం కోసం రోజూ ఎదురు చూసి నిరాశపడుతున్నాను. నా మీద కోపం వచ్చిందా? నేను అట్లా అన్నందుకు మన్నించండి...

నేను మీకు చెప్పగలిగిన దాన్ని కాదు!

నాకు తోచినదేదో చెప్పాను. అది అజ్ఞానమే!

అందుకు మీరు మౌనంతో శిక్షిస్తే, అది నాకు మృత్యుప్రాయ మౌతుంది.

దయచేసి ఉత్తరం రాయండి.

రోజూ పూలగుత్తులు కట్టడం అలవాటయి పోయింది! అవి ఎండిపోయినా, పారెయ్యలేక పోతున్నాను..

ఇటువంటి అశాంతి నా జీవితంలో యింతకు ముందు ఎరగను!

మీ-ప్రతిమ"

అతని మనసు పులకించింది.

వెంటనే దిగివచ్చి గబగబా ఉత్తరం రాశాడు.

"ప్రతిమా!

నీ ఉత్తరం చదువుతుంటే ఉప్పొంగే సముద్రం ఒడ్డున, నిండుపున్నమి వెన్నెలలో ఒళ్ళెరగకుండా పరుగులు పెడుతున్న అనుభూతి కలిగింది!

ఇన్నాళ్ళూ, ఉత్తరం రాయని కారణం ఒక్కటే.

మనసులోని స్తబ్దత.

ప్రేరణలేని మనసు ఏం పలుకుతుంది!

మీటిన మనసు స్పందించకుండా ఎలా ఉంటుంది?

ఉత్తరం కంటే ముందుగా అక్కడికి రావాలనిపిస్తోంది. అమ్మని ఒప్పించడానికి మరో రెండు రోజులన్నా గడవాలి!

అంతవరకు ఈ ఉత్తరం చాలదూ?

నీ-భానుమూర్తి"

రెండు ఉత్తరాలూ పదే, పదే చదువుకుని తృప్తి పడ్డాడు. తన ఉత్తరం పొలేచుకిచ్చి పోస్టుజవానుకందజెయ్యమని చెప్పాడు.

అతని మనసుకెంతో ఉల్లాసం చేకూరింది.

ఆ రోజు తృప్తిగా భోజనం చేశాడు.

* * *

కమ్మని కలలుకంటూ నిద్రపోయేడు!

ఇంకా తూర్పున సూర్యుడుదయించనే లేదు. కాకులు అరుస్తున్న వేళ, టెలిగ్రాం బంట్రోతు వచ్చాడు!

"ప్రతిమ మిస్సింగ్-స్టార్ట్ యిమ్మీడియట్లీ.."

భానుమూర్తికి కళ్ళముందు చీకట్లు కమ్మినట్లయింది.

"ఏమిటి బాబూ అది?" ఆదుర్దాగా అడిగింది సీతమ్మ.

"నేను అర్జంటుగా వెళ్ళిపోవాలి.." అంటూనే ఆదరా, బాదరా తయారవుతున్న కొడుకుకేసి కళ్ళప్పగించి చూస్తూండి పోయింది సీతమ్మ.

ఆవిడ ఆశ్చర్యం నుండీ కోలుకొనక మునుపే అతను యిల్లు వదలి వెళ్ళి పోయాడు.

ప్రతిమ వాళ్ళ యిల్లు జేరుకునే సరికి మధ్యాహ్నం అయింది. నేరుగా ప్రిన్సిపాల్‌గారుండే గదిలోకి వెళ్ళేడు.

ఆయన మంచంమీద అపస్మారకంలో ఉన్నాడు.

'గ్లూకోజు' ఎక్కిస్తున్నారు.

ప్రతిమ తల్లి కన్నీరు, మున్నీరుగా విల పిస్తున్నది.

విశాల ఆవిడ సరసన కూర్చుని ధైర్యం చెబుతోంది.

ప్రిన్సిపాల్ దగ్గర ఒక డాక్టరు, నర్సు వైద్యోపచారాలు చేస్తున్నారు.

భానుమూర్తి నేరుగా విశాల దగ్గరగా వెళ్ళి "మిస్ విశాలా! అసలేం జరిగింది?" అడిగేడు.

అతన్ని చూడగానే విశాల లేచి, ఇవతలకు వచ్చింది.

ఆమె ననుసరించాడతను,

ఇద్దరూ బయటకు వచ్చాక అందివిశాల "ప్రతిమ నెవరో ఎత్తుకు పోయారు!"

"ఎత్తుకు పోయారా?!" నమ్మలేనట్లు చూశాడు.

"అవును! పోస్టాఫీసు కెళ్ళి ఉత్తరం పోస్టుచేసి వస్తూంటే బలవంతాన కారు లోకి తోసి లాక్కువెళ్ళారట. అక్కడ చూసిన వాళ్ళు చెప్పారు. ప్రిన్సిపాల్ గారు పోలీసు రిపోర్టుయిచ్చి, మీకు టెలిగ్రాం పంపారు."

అతని రక్తం చల్లబడినట్లనిపించింది.

"ఎప్పుడు జరిగిందిది?"

"మొన్న సాయంత్రం!"

అయితే, ఆ ఉత్తరం తనకు రాసిందే నన్నమాట!

భగవాన్! ఏమిటి పరీక్ష?

ఎవరికి అన్యాయం చేశాను నేను!

ఆ అమాయకురాలికెలాంటి ఆపదా రాకుండా చూడు..అదొక్కటే యీ జన్మకు నిన్ను కోరేది.

–మనసులో మూగ ప్రార్థన చేశాడు.

తన వద్ద స్టేట్‌మెంట్ తీసుకుంటున్న పుడు సి. ఐ. డి. ఇనస్పెక్టర్ బాపిరాజు కూడ ఆస్పత్రికి రావటం జ్ఞప్తికి వచ్చింది భానుమూర్తికి.

బాపిరాజు తనకు బి. య్యే. లో క్లాస్ మేట్! ఇటీవలనే యిక్కడికి బదిలీమీద వచ్చాడు. కాలేజీ ఎన్. సి. సి. లో అండర్ ఆఫీసర్‌గా ఉండేవాడు.

అడపా, దడపా కన్పిస్తూ, కాస్సేపు ఆ మాటా, ఈమాటా మాట్లాడుతుంటాడు.

తననెవరో దుండగులు కొట్టినవిషయం తెల్సి, పరామర్శించడానికి వచ్చాడు.

"ఎప్పుడు ఎవరిమీద అనుమానం కలి గినా తక్షణం నాకు చెప్పు" అన్నాడు ఆ రోజున.

భానుమూర్తికి విన్సెంట్ మీద, అతని భక్తులయిన ముగ్గురు తుంటరి విద్యార్థుల మీద గట్టి అనుమానం ఏర్పడిపోయింది.

అప్పట్లో అనుమానంఉన్నా, నిరాధా రంగా నేరమారోపించడందేనికని మిన్న కున్నాడు.

కానీ,

ప్రతిమను అపహరించడం వరకు వాళ్ళ దౌర్జన్యం పెరిగిందంటే, క్షమించ రాదనిపించింది.

వాళ్ళకన్నా యితురులకి యీ దుండ గం చెయ్యవలసిన కారణాలు లేవు!

ప్రిన్సిపాల్ మీద, తనమీద విన్సెంట్



పగబట్టి ఉన్నాడన్న సంగతి ఎన్నడో పసికట్టాడు తను.

ఇప్పుడు అదను చూసుకుని కాటు వేశాడన్నమాట!

భానుమూర్తి నేరుగా వెళ్ళిబాపిరాజుని కలుసుకున్నాడు. అంతావిని "అలాగా?" అని క్షణాల్లో జీపుమీద యిద్దరు కానిస్టేబుల్స్‌ని తీసుకుని భానుమూర్తితో బాటు బయల్దేరాడు.

ఆ సంఘటన జరిగినచోట జీపు ఆపి, కానిస్టేబుల్స్‌కి ఏదో చెప్పి పంపాడు.

వాళ్ళు వెళ్ళి కారాకిళ్ళి నములుతూ నిలబడి చోద్యం చూస్తున్న ఒక గుండా కాలరు పట్టుకుని యీడ్చుకొచ్చారు.

"నాకేం తెలియదు బాబూ! నన్ను వదలండి బాబూ" అని దండాలు పెట్టటం మొదలెట్టాడు—వాడు.

వాడిని బాపిరాజు ఎదుట నిలబెట్టారు.

"ఊఁ ఒళ్ళు నలక్కుండా మర్యాదగా చెప్పు. ప్రిన్సిపాల్‌గారమ్మాయిని ఎత్తుకెళ్ళిందెవరు?" కర్కశంగా చూశాడు.

వాడు వణికిపోతూ "సత్తె ప్రమాణంగా చెబుతున్నా బాబయ్యా ... నాకు తెలీదంటే తెలీదు ..." అన్నాడతని పాదాలు పట్టుకుని.

కానిస్టేబుల్స్ వంక చూశాడు బాపిరాజు.

వాళ్ళిద్దరూ వాణ్ని వెనక్కి గుంజి, డొక్కలో చెరో గుద్దు యిచ్చారు.

గిలగిల్లాడి పోతూ "బాబోయ్, చెబుతా! నన్ను చంపకండి..." అన్నాడు

"చెప్పు" అన్నాడు బాపిరాజు చేతి కర్రతో జబ్బమీద గట్టిగా బాది.

"బాబోయ్ ... కొట్టకండి! జర్మయ్యగాడు, కాలేజీకుర్రాళ్ళు డబ్బులిస్తాసంటే ఆశపడి యీ పని చేశాడండి ..."

"ఎక్కు ... జర్మయ్య యిల్లు చూపిద్దువుగాని ..."

"ఆడింటికి తీసుకెళితే నన్ను పొడిచేస్తాడు బాబయ్యా!"

"తీసుకెళ్ళకపోతే నీ నడ్డిపూసలు విరగదంతాన్నేను."

"దూరంగా నిలబడి చూపిస్తానండి బాబూ...నన్ను కనికరించండి" మొత్తుకున్నాడు.

"ముందు ఎక్కు" గదమాయించాడు బాపిరాజు.

పిల్లిలా వెనకాల ఎక్కి కూర్చున్నాడు.

జీపు కదిలింది.

ఓ పావుగంటసేపు 'గూండా' చెప్పిన దారులవెంట వెళ్ళి, చివరకు ఊరికి పెడగా వున్న పాత ఇంటి దగ్గర ఆగింది.

"ఇదే బాబూ యిల్లు! .నేను బయటే వుంటాను" అన్నాడు వాడు. ఒక కానిస్టేబుల్ని కాపలాగా వుంచి, వెళ్ళి తలుపు కొట్టాడు. అయిదు నిమిషాలకుగానీ తెరుచుకోలేదు.

జర్మయ్యా ఆరడుగుల శరీరంతో లాల్చీ-లుంగీ ధరించి, పోత విగ్రహంలా గుమ్మంలో నిలబడ్డాడు.

మొహంమీద పాత గాయం తాలూకు మచ్చ వికృతంగా వుంది.

"ఏం కావాలి?" అన్నాడు తప్పుకోకుండానే.

గొంతుమీద చెయ్యివేసి లోపలికి నెట్టుకుంటూ వెళ్ళాడు బాపిరాజు.

"వెతకండి" అన్నాడు కానిస్టేబుల్ని, భానుమూర్తిని ఉద్దేశించి. వాళ్ళిద్దరూ గదులన్నీ వెతికారు.

ఎవరూ కన్పించలేదు.

బాత్‌రూమ్‌లో, లావెట్రీలో వెతికితే విన్సెంటూ, ఆ ముగ్గురు విద్యార్థులూ దొరికారు.

వాళ్ళను కానిస్టేబుల్ తీసుకొచ్చి బాపిరాజు ఎదుట నిలబెట్టాడు.

"రాజూ! ఇతనే లెక్చరర్ విన్సెంట్. వాళ్ళు ముగ్గురూ యితని అనుచరులు" అన్నాడు భానుమూర్తి.

"షటప్! డోంటాక్ సిల్లీ" అని అరిచి, "ఇనస్పెక్టర్‌గారూ! ఏమిటిదంతా? నేను లావెట్రీకి వెళితే వీళ్ళు నన్ను బలవంతాన బయటకు లాగారు. ఇన్‌డీసెంట్ ఫెలోస్" అన్నాడు ఊగుతూ విన్సెంట్.

వాళ్ళంతా 'డోసు'లో వున్నారని అర్థమయింది బాపిరాజుకి.

"జీపులోకెక్కించు" అన్నాడు కానిస్టేబుల్నుద్దేశించి.

జర్మయ్యా ఠీవిగా నడుంమీద చేతులు వేసుకుని నిలబడ్డాడు.

"ఆ అమ్మాయినెక్కడ దాచావ్ జర్మయ్యా?" బాపిరాజు ప్రశ్నించాడు.

"వెతుక్కున్నారుగా?" అన్నాడు హేళనగా నవ్వి.

మూతిమీద కొట్టాడు రాజు.

పెదవి పగిలి, నెత్తురు చిమ్మింది. తుడుచుకుంటూ 'గుర్రు'మని చూశాడు.

"మర్యాదగా చెప్పు. లేదా తోలు వలిచేస్తాను" గర్జించాడు.

"ఇంకా ఈ ఊరి నీళ్ళు సొంతం అరక్కుండానే జర్మయ్యతో చెయ్యి కలపటం మంచిది కాదు ఇనస్పెక్టర్! వీడికి రక్తం చిందించటం చేతకాదు, పచ్చి నెత్తురు తాగటం వచ్చు."

పకపకా నవ్వాడు బాపిరాజు.

"కోడిదా, మేకదా ?– జర్మయ్యా! నీ తల్లో జేజమ్మల్ని సైతం దారికి తీసుకు రాగలను. జాగ్రత్త, ఊరు దాటకు నీ వెంట నా మనుషులుంటారు."

బయటకు వచ్చాడు.

భానుమూర్తి అనుసరించాడు.




ఆ మర్నాడు రైల్వే పట్టాలమీద ఎవరిదో స్త్రీ శవం పడివుందని రిపోర్టు రాగానే తక్షణం జీపుమీద భానుమూర్తి రూమ్ కెళ్ళి, అతనితోబాటు అక్కడికి వెళ్ళాడు బాపిరాజు.

అప్పటికే శవాన్ని ఓ పక్కగా వుంచారు పోలీసులు.

అదృష్టవశాత్తు పట్టాలమీద పడి వున్నప్పుడు రైళ్ళేమీ వెళ్ళనందువల్ల శరీరం ముక్కలు కాలేదు.

భానుమూర్తి ఆదుర్దాగా సమీపానికి వెళ్ళి చూశాడు.

ప్రతిమే!

బుగ్గలు, పెదవులు, రొమ్ములు-పంటి గాయాలమయంగా వున్నాయి. శరీరం మీద దుసులు సరిగా లేవు. ఆమె అనుభవించిన నరకం ఎలాంటిదో ఊహించుకో గలిగాడు భానుమూర్తి.

అతనికి స్పృహ తప్పింది.

పడిపోకుండా పట్టుకున్నాడు బాపిరాజు.

"శవాన్ని తీసుకుపదండి" అన్చెప్పి, కానిస్టేబుల్స్ సాయంతో భానుమూర్తిని జీపుదగ్గరకు జేర్చాడు.

నీళ్ళు తెప్పించి మొహంమీద జల్లాక తేప్పరిల్లాడు భానుమూర్తి. బాపిరాజు అతనికేసి జాలిగా చూశాడు.

"రాజూ! ఐ కాంట్ లివ్. నేనూ చచ్చిపోతాను" పిచ్చిగా జుట్టు పీక్కున్నాడు భానుమూర్తి.

రెండు చేతులూ పట్టుకుని అతన్ని శాంతింపజేశాడు. "భానుమూర్తీ! నువ్వు పసివాడివి కాదు. దిసీజ్ లైఫ్! టేకిట్ ఈజీ" వెన్నుమీద తట్టాడు.

భానుమూర్తి సీటుమీద వెనక్కు వాలి కళ్ళు గట్టిగా మూసుకున్నాడు. కన్నీళ్ళు ఆగటం లేదు.

జీపు కదిలింది.

* * *

కూతురు చావు సంగతి తెలిసిన ప్రిన్సిపాల్‌కి 'పెరాలిసిస్ మైల్డ్ స్ట్రోక్' వచ్చింది. ఆయన మంచంమీదనే ఉండి పోవటంవల్ల దహన కార్యక్రమాలన్నీ భానుమూర్తే నిర్వహించాల్సి వచ్చింది.

ఆయన బంధువులు చాలా దూరాన వుండటం మూలానా, శవం అప్పటికే వాసన వేస్తున్నందువల్లనూ, నలుగురూ కలిసి ఒక నిర్ణయానికి వచ్చి, కార్యక్రమాలు కొనసాగించారు.

ప్రిన్సిపాల్‌కి ఆత్మీయునిగా ఉంటున్న భానుమూర్తినే ముందుకు నడవమన్నారు. వాళ్ళు కోరకపోయినా అతనికి ప్రతిమతో భావబాంధవ్యం వున్నది గనుక నిస్సంకోచంగా పనులు చేపట్టాడు.

* * *

జర్మయ్యను 'కస్టడీ'లోకి తీసుకున్నారు!

ఆలస్యంగా తెలియవచ్చిందేమిటంటే-పోలీసులు సోదాకి వచ్చినపుడు ప్రతిమను కదలకుండా కట్టేసి, నోట్లో గుడ్డలు కుక్కి, పెద్ద చెక్కపెట్టెలో దాచి తాళం వేసినట్లు, అప్పటికే జరగవలసిన

వన్నీ జరిగిపోయినట్లు, పోలీసులు నిష్క్రమించగానే ఆమెను హత్యచేసి రైలు పట్టాలమీద పడేసినట్లు!

ఏది ఏమైనా-ఈ ఘోరంలో ప్రత్యక్షంగా సంబంధం కలిగిన వ్యక్తులు విన్సెంట్, అతని ముగ్గురు అనుచరులన్న సంగతి రూఢి అయింది.

వాళ్ళు జర్మయ్యను డబ్బుతో లోబరుచుకుని, అతని ద్వారా అపహరణ కార్యక్రమం జరిగించారన్న విషయం కూడ వెల్లడి అయింది!

కాలేజీ అధ్యాపకుడీ విధంగా తుంటరి విద్యార్థులతో చేతులు కలిపి దుండగాలకు పాల్పడటం తెలిసిన పురప్రజలు అలజడి చెందారు.

కొందరు తమ ఆడపిల్లలను చదువు మాన్పించేశారు! ఆడపిల్లలను బయటకు పంపటానికే వెరచారు కొందరు. ఎవరి నోట విన్నా, యీ ఘోర సంఘటనే... ఈ అమానుషత్వమే.

కొన్నాళ్ళు ఆ కాలేజీలో మామూలు పరిస్థితి కొరవడింది.

కమిటీ పెద్దలు సమావేశమై విషయాలు చర్చించారు.

"ఇతర ప్రదేశాలలో ఉన్న మన అనుబంధ కళాశాలల నుండి ఎవర్నయినా సమర్థుడయిన ప్రిన్సిపాల్‌ని తాత్కాలికంగా యిక్కడకు రమ్మంటే?" అని ఒక సభ్యుడు సూచించాడు.

"ఇది తాత్కాలికంగా చేసే ఏర్పాటుతో తీరే సమస్య కాదు" మరొక సభ్యుడు ఖండించాడు.

"వైస్ ప్రిన్సిపాల్‌గారు మంచివాడే గానీ, యిలాంటి ఆపత్సమయాల్లో ఆయన పనికిరాడు! మనిషిలో సమయ చాతుర్యం తక్కువ."

"ఉన్న స్టాఫ్‌లోంచి ఎవర్నయినా ప్రమోట్ చేసే వీలున్నదా?"

"అది సవ్యం కాదు! వైస్ ప్రిన్సిపాల్ ఎక్కువ సర్వీసు గల వ్యక్తి. ఆయన మీద మరొకర్ని డబుల్ ప్రమోట్ చేయటం బావుండదు"

"ప్రభుత్వ యంత్రాంగంలోనే ఇలాంటివి జరుగుతున్నప్పుడు ప్రైవేటు కాలేజీ దేముంది?"

"ఎవరో చేసే పొరబాటును, అందరూ ఆదర్శంగా తీసుకోవలసిన అవసరం లేదుగా? మనం ఒక పని చేద్దాం. వైస్ ప్రిన్సిపాల్‌ని ప్రిన్సిపాల్‌గా చేద్దాం. మరొక సమర్థుడయిన వ్యక్తిని వైస్ ప్రిన్సిపాల్‌గ ప్రొమోట్ చేద్దాం."

"మరొకటి కూడా చెయ్యాలి! ప్రిన్సిపాల్ చేత శలవు పెట్టించి,ఆ సమర్థుడయిన వ్యక్తి కొన్నాళ్ళయినా ప్రిన్సిపాల్ విధులు నిర్వర్తించి, కాలేజీ పరిస్థితులను యథాప్రకారం తీసుకురావటానికి అవకాశం యివ్వాలి"

"ఇంతకూ ఉన్నవాళ్ళలో మన అవసరాలకు సరిపోగల వ్యక్తి ఎవరు?"

"ఇది మనం నిర్ణయించే బదులు, వైస్ - ప్రిన్సిపాల్‌తో సంప్రతించడం మంచిది. అవసరముంటే, శలవుమీదున్న ప్రిన్సిపాల్‌ని కూడా ఒక మాట అడగొచ్చు."

అందుకు ఒప్పందం జరిగింది.

సంప్రదింపుల్లో తేలిందేమంటే-ఉన్న వాళ్ళలో కెల్లా, వైస్ - ప్రిన్సిపాల్ తర్వాత సీనియారిటీ గలవాళ్ళు ముగ్గురున్నారనీ, ముగ్గుర్లో భానుమూర్తి రెండోవాడనీ; సమర్థత విషయంలో భాను

మూర్తిని ఎంచుకోవచ్చుని! వాళ్ళ అభిప్రాయాలు విన్న తర్వాత, భానుమూర్తికే ఈ బాధ్యతలు ఒప్పగించదలచారు.

అశాంతితో నలిగిపోతున్న భానుమూర్తికి ఈ వార్త సంతోషం కలిగించలేకపోయింది! అతను మరింత త్వరగా కొత్త బాధ్యతలను తల కెత్తుకోగల స్థితిలో లేడు.

ఆ విషయమే కమిటీ పెద్దలకు వినయంగా చెప్పాడు.

వాళ్ళు ఆశ్చర్యపోయారు.

"ప్రమోషను నిరాకరించే వ్యక్తులు కూడా ఉంటారా?" అనుకున్నారు.

ఎన్నో విధాల అతనికి నచ్చజెప్పటానికి ప్రయత్నం చేశారు.

అతని సమాధానం ఒక్కటే—

"ఇది నా వల్ల అయ్యే పని కాదు! నన్ను మన్నించండి. మరెవరికయినా సమర్థత గలవాళ్ళకు అవకాశంయివ్వండి"

కమిటీ పెద్దకు విసుగు పుట్టి "మీరు ప్రమోషన్ మీద బాధ్యతలు తీసుకోని పక్షంలో బదిలీకి సిద్ధంగా ఉండండి. మిమ్మల్ని పూర్వం ఉన్న కాలేజీకి పంపిస్తాము" అన్నాడు.

"అందుకు నా అభ్యంతరం లేదు!"

తెల్లబోయాడు అయన.

ఆనందరావుగారు జోక్యం చేసుకుని "ఆయనకు ఒకరోజు వ్యవధి యిద్దాం. అటుపైనే నిర్ణయం చెప్పమందాం" అన్నాడు. అందుకు కమిటీ పెద్ద అంగీకరించాడు.

"మీరెంత వ్యవధి యిచ్చినా, నా నిర్ణయంలో మార్పు ఉండదు..." అని యింకేమో చెప్పబోతున్న భానుమూర్తి భుజంమీద చనువుగా చెయ్యివేసి బయటకు తీసుకెళ్ళారు ఆనందరావుగారు.

* * *

"శరీరం య దవాప్నోతి యచ్చాప్యుత్క్రామ తీశ్వరః
గృహీ త్వైతాని సంయాతి వాయుర్గ న్ధానివా శయాత్"

(జీవుడు శరీరమును పడయు నప్పుడును, తిరిగి శరీరమును విడుచునప్పుడును వాయువు పుష్పముల నుండి వాసనలను వెంటగొనిపోవునట్లు జీవుడుగా నుండిన ఆ ఈశ్వరుడు పంచేంద్రియములు మనస్సు అను ఆరింటిని వెంటగొని వెడలుచున్నాడు.)

అంతవరకు చదివి, భగవద్గీతను మూశాడు భానుమూర్తి. మంచంమీదున్న ప్రిన్సిపాల్ గారికేసి చూశాడు.

ఆయన కళ్ళు నిశ్చలంగా, గోడకి తగిలించి ఉన్న పటంలో గీతాచార్యుణ్ని చూస్తున్నారు. శ్రీకృష్ణుడు కురు పాండవ సైన్యం మధ్యంలో రథం నిలిపి, అర్జునుడికి గీతా బోధ చేస్తున్న దృశ్యం బహు రమ్యంగా ఉంది. ఆ పటం క్రింద ప్రేము కుర్చీలో కూర్చుని ఉన్నాడు భానుమూర్తి.

కొంచెం అవతలగా, గుమ్మానికి ఆనుకుని తేజోవిహీనమయిన మొహంతో శూన్యంలోకి ఖిన్నురాలై చూస్తున్నది ప్రతిమ తల్లి. సరిగ్గా ఆవిడ కూర్చున్న తావున పైభాగంలో ప్రతిమ ఫొటో ఉంది.

కొద్ది నిమిషాల అనంతరం, కాలేజీ కమిటీ నిర్ణయాలు, ఆనందరావుగారు తనని బలవంతం చెయ్యడం వివరించాడు ఆయనకు భానుమూర్తి.

ఆయన మౌనంగా అన్నీ విన్నాడు.

"నాకు ఒక్కరోజు గడువు ఇచ్చారు! రేపు ఏ సంగతీ చెప్పాలి. బదిలీ అయినా ఫర్వాలేదుగానీ, అనుభవంలేని విషయాల్లో తలదూర్చి అభాసు కావటం నా కిష్టం లేదు. ప్రస్తుతం నా మనః స్థితి కూడా కొత్త బాధ్యతలను స్వీకరించగల స్థితిలో లేదు."

"దేనికీ భయపడకండి. ఏ పరిస్థితి నుండీ పారిపోకండి. కొన్ని అవకాశాలు ఒక్కమాటే వస్తాయి. మళ్ళీ, మళ్ళీ రావు. ఆనందరావుగారి మాట వినటం మంచిది" నీరసంగా అన్నాడు ప్రిన్సిపాల్.

భానుమూర్తికి అయోమయ మన్పించింది.

చివరకు ప్రిన్సిపాల్ కూడా తనను ప్రోద్బలం చేస్తారనుకోలేదు అతను. ఆయన మళ్ళీ అన్నాడు.

"నా మాటలు అర్థం చేసుకోవడానికి ప్రయత్నించండి"

సూటిగా ఆయన మొహంలోకి చూశాడు భానుమూర్తి.

"నా మనస్సు చాలా గాయపడి ఉంది సార్..." బాధగా అన్నాడు.

"నేను అర్థం చేసుకోగలను! మనసు నేదో విషయం మీదకు మళ్ళించకపోతే, మరింత వేదనకు గురి కావటమే తప్ప ప్రయోజనం లేదు. ఈ భగవద్గీత మానసిక రుగ్మతలకు సంజీవి. అయితే, ప్రాథమికంగా మనోవ్యాకులతను పోగొట్టి మనిషిలో కర్తవ్య జ్ఞానం కలిగించడానికి ఉద్దేశింపబడింది. అంటే ఆలోచనలు మళ్ళించడానికే కదా ?"

"మీరు చెప్పింది కాదనను. కానీ ఈ బాధ్యతలు నిర్వహించడానికి నా శక్తి చాలదంటున్నాను"

"కాదు! అలా భ్రమ పడుతున్నారు. అంతే! మీ శక్తి ఏమిటో మీరే పరీక్షించుకుని చూడండి"

మరేమీ మాట్లాడలేక పోయేడు భానుమూర్తి.

చివరకు 'సరే' ననక తప్పలేదతనికి.

ఆనందరావుగారు అతని నిర్ణయాని కెంతో పొంగిపోయేడు.

"నువ్వేం భయపడకు. నీ వెనుక నేనున్నాను. సొంతంగా ఆలోచించు. చక్కని నిర్ణయాలు తీసుకో" అని ప్రోత్సహించాడు.

* * *

భానుమూర్తి ప్రిన్సిపాల్ కాగానే మొదట చేసిన పని, కాలేజీ విద్యార్థులందర్నీ సమావేశ పరచి వాళ్ళతో ముఖాముఖి కొన్ని సమస్యలు మాట్లాడి, వాళ్ళ అభిప్రాయాలు వినడం, వాళ్ళ నుండీ చక్కని క్రమశిక్షణ, సహకారమూ కోరడం.

అలాగే-విద్యార్థినులను సమావేశపరచి వాళ్ళ తల్లిదండ్రులకు నచ్చజెప్పవలసిందనీ, కాలేజీలో ఎప్పుడో దురదృష్టవశాత్తు జరిగే ఒక్క సంఘటన నిత్యం జరుగుతుందని భయపడటం వివేకం కాదనీ నచ్చ జెప్పాడు.

స్థానిక వార్తా పత్రిక విలేఖరికి యింటర్వ్యూ యిచ్చి, కాలేజీ మీద ఏర్పడిన దురభిప్రాయాలు తొలగించడానికి కృషి చేశాడు. తరచుగా క్లాసులు తనఖీ చేస్తూ, విద్యార్థుల శ్రద్ధ గురించీ, లెక్చరర్ల బోధన గురించీ పరిశీలిస్తూండ సాగాడు.

అతని నిర్విరామ కృషి ఫలితంగా కొద్దిరోజుల్లోనే కాలేజీకి మళ్ళీ మునపటి కళ వచ్చింది. క్రమశః జరిగిన సంఘటన లను మర్చిపోగలుగుతున్నారు అందరూ.

అయితే, అప్పుడప్పుడూ - విన్సెంట్, ఆ ముగ్గుర విద్యార్థులు, జర్మయ్యల మీద నడుస్తున్న కేసు వివరాలు వార్తా పత్రిక లలో వస్తూనే ఉన్నాయి. రెండు నెలల అనంతరం—

చివరకు జర్మయ్యకు మరణ శిక్ష, విన్సెంట్, ఇతర విద్యార్థులకి జీవిత ఖైదులు వేశారు. అంతటితో ఆ అధ్యా యం ముగిసి నట్లయింది.

భానుమూర్తి తరచుగా ప్రిన్సిపాల్ ఇంటికివెడుతూ ఆయన ఆరోగ్యం గురించి తెలుసుకుంటూ, కాలేజీ నిర్వహణలో అవసరమైన సలహాలు స్వీకరిస్తున్నాడు. భానుమూర్తికి ఆయన సమక్షం కాస్త మనశ్శాంతిని కలిగించేది. వాళ్ళ మన స్సుల్లో పేరుకున్న బాధని తగ్గించటానికి శాయశక్తులా తను చేసే కృషి ఫలితాలు ప్రోత్సాహకరంగా ఉండటం వల్ల ఒక విధమయిన తృప్తి ననుభవించేవాడు.

ఇటీవలి కాలంలో- అతను మునుపటి కన్నా విశాలతో మరింత ముభావంగా మసలుతున్నాడు. వాళ్ళ సంభాషణలు కేవలం ఉద్యోగవిషయాల వరకే పరి మితమై ఉంటున్నాయి.

కానీ-ఒక్కోమాటు విశాల చూపులు చాలా వాడిగా, సూటిగా అతని అంత స్సాక్షిని నిలదీసి వేలాడి ప్రశ్నలు వేస్తున్నట్లుగ అన్పించేవి.

అప్పుడు మాత్రం భానుమూర్తి తబ్బిబ్బయ్యేవాడు. బలవంతాన తన్ను తాను నిగ్రహించుకోవటానికి ప్రయాస పడేవాడు.

విశాల అతని పరిస్థితిని గ్రహించి నట్లు లోలోపల జాలిగా నవ్వుకునేది. ఒక్కోమాటు ఆవేశంగా అతన్ని నాలుగూ అడిగేద్దామని ఆఫీసులోకి దారితీసేది. అతనికెదురుగా ఉన్న కుర్చీలో కూర్చో వటం కూడా జరిగేది. కానీ-

భానుమూర్తి చేస్తున్న పని నిలిపి "యస్ విశాలా?!" అని ఆమె కళ్ళలోకి ప్రశ్నార్థకంగా చూసినపుడు, ఆవేశమంతా చల్లారిపోయేది. ఏదో తెలియని నిస్సత్తువ శరీరమంతా ఆవరించుకున్నట్లనిపించేది.

"నథింగ్..నథింగ్.." అని గొణు గుతూ వెళ్ళిపోవటానికి లేచేది, విషయం ఊహించుకున్న భానుమూర్తి, ఆమెని కూర్చోబెట్టి, ఆమె క్లాసులోని పిల్లల ప్రోగ్రెస్ గురించి, వాళ్ళ ప్రవర్తన గురించి ప్రశ్నలువేసి, రెండుమూడు ఛలోక్తులు విసిరి, ఆమెని నవ్వించి, తను నవ్వి మంచి మూడులోకి తీసుకొచ్చే వాడు. ఆమె అతని మాటలకి పరవశిస్తు కూర్చునేది.

అతని ప్రశ్నలన్నింటికీ ఎంతో యిష్టంగా, నవ్వుమొహంతో సమాధానాలు చెబుతుంటుంది. 'ఇలా అడుగుతూనే ఉంటే బావుండు'ననుకుంటుంది.

మళ్ళీ అంతలోనే-

'అబ్బ! ఎంత సేపూ కాలేజీగొడవలేనా? వ్యక్తిగత విషయాలు మాట్లాడకూడదూ? పిక్నిక్ గురించో, మరే ఆసక్తికరమయిన విషయం గురించో..' అని విసుక్కుంటూ ఉంటుంది మనస్సులో. పైకి పెదవులు చిరునవ్వు చిందిస్తూనే ఉంటాయి!

ఒక్కోమాటు కావాలని తనే మేన మామ గురించి సంభాషణ ప్రారంభించి

"మీరీ మధ్య అయనకు కనపడ్డం లేదా ఏమిటి? రోజూ మీ గురించి చెప్పలేక నా దుంపతెగిపోతోంది" అంటుంది నవ్వేస్తూ.

అతను ఆశ్చర్యంగా చూసి "అలాగా? నిజమే-ఆయన్ని కలుసుకుని చాలా రోజులయింది. ఒకమాటు అలారావాలి" అంటుంటాడు. మళ్ళీ అంతలోనే "ఎక్కడా, యీ కొత్త బాధ్యత నానెత్తికెత్తి ఆయన దూరంగా ఉండిపోయేరు. నాకు ఊపిరి సలపడం లేదిక్కడ.." అంటాడు.

"పని అంత ఎక్కువగాఉంటోందా?" అంటుంది సానుభూతి ధ్వనించే గొంతుతో.

"అలవాటు పడిపోయాలెండి..కొత్తలో అయితే, భయపడి పోయేను.."

ఇక్కడ నుంచీ సంభాషణ మారిపోతుంది. కొత్తదారులు తొక్కుతుంది.

"మీరూ భయపడితే ఎలా?"

"నేను మనిషిని కానా?"

"మామూలు మనుషులకీ మీకూ తేడా ఉంది."

"కొమ్ములున్నాయంటారా?"

"కొండల్ని ఢీ కొట్టగల ధీరత్వం ఉందంటాడు మామయ్య.."

"అందుకు ఉదాహరణగా-ప్రిన్సిపాల్ పదవిస్తానంటే పది కోసులు పారిపోవటం చెప్పలా?"

ఇద్దరూ గల గల నవ్వులు..

మాట్లాడుతూనే అతను ఏదో ఫైలు



చూడటమో, పేపరుమీద ఏదన్నా రాస్తుండటమో కద్దు.

అతను రాసేటపుడుతల ఒక ప్రక్కకి తమాషాగా వంచుతాడు. చూసేవాళ్ళకు ఆ భంగిమ చాలా బావుంటుంది.

విశాల ఆ భంగిమలో అతన్ని తదేకంగా, ముగ్ధురాలై చూస్తూంటుంది.

విశాలలోని మార్పు ఎంత ముఖ్య విషయమయిందో, ఆమె భానుమూర్తి పట్ల ప్రవర్తించే తీరు చాలా మందికి మరింత ముఖ్యంగాను, ఆసక్తికరంగాను పరిణమించింది.

వాళ్ళు వెయ్యి కళ్ళతో వాళ్ళిద్దర్నీ గమనించసాగేరు.

కొందరు గుసగుసలు పోతే, మరి కొందరు బాహాటంగానే మాట్లాడుకున్నారు.

విశాల చెవిలో కూడ కొన్ని పడ్డాయి. కానీ, ఆమె లక్ష్యం చెయ్యలేదు.

రాజు పరోక్షంగా భానుమూర్తికి ఈ సంగతులు చెప్పి హెచ్చరించాడు.

అతను విని, నవ్వి ఊరుకున్నాడు.

వీటికి బలం చేకూరుస్తూ ఒక సంఘటన జరిగింది.

ఒక రోజున ప్రిన్సిపాల్ గదివైపుగా విశాల వస్తూండగా చిన్న సుడిగాలి లాంటిది లేచి, ఆమె కంట్లో రెండుమూడు నలకలు పడ్డాయి.

ఆమె చీరచెరుగుతో ఎంత జాగ్రత్తగా తీయడానికి ప్రయత్నించినా ఎక్కడో చిన్న నలుసు దాగి, కళ్ళు మిరమిర గొలుపుతూ, నీళ్ళు చిందిస్తూ బాధించ సాగింది.

ఆమె అలాగే వెళ్ళింది లోపలికి.

ఆమెను ఆ భంగిమలో చూస్తుంటే-ఎవరో మందలిస్తే ఏడుస్తూ వస్తున్న పసి పిల్లలా ఉంది! బుగ్గమీద కన్నీటి చారలు.

"ఏమైంది!?" అన్నాడు భానుమూర్తి కంగారుగా.

"నలక పడిందండీ" అంది కన్ను నలుపుతూ.

"నలపకండి ఇలా రండి, ఊదేస్తాను" అన్నాడు.

ఆమె సమీపానికి వెళ్ళింది.

అతను కంట్లో జాగ్రత్తగా పరిశీలించి నలకను చూసి ఒడుపుగా ఊదేడు.

అప్పుడే లోపలకు అడుగు పెట్టబోతున్న యిద్దరూ లెక్చరర్లు వెనక్కి తిరిగి వెళ్ళిపోయేరు.

దార్లో వాళ్ళు అనుకున్న మాటలు

"దాన్దుంపతెగా పట్టపగలు ఆఫీసులోనే రొమాన్సా! ఆ పెట్టుకునే ముద్దేదో ఇంటి దగ్గరే పెట్టుకోవచ్చుగా!"

* * *

భానుమూర్తి ఆఫీసులోకి అడుగు పెట్టబోతూ ఆగిపోయేడు.

అతని భ్రుకుటి ముడి పడింది.

వరండా గోడమీద ఎత్తుగా ఒక 'కార్టూన్' అంటించి ఉంది.

ఇద్దరు ఆడ, మగా గాఢంగా ముద్దు పెట్టుకుంటున్న దృశ్యం! క్రింద "వి అండ్ బి" రొమాన్స్...అని రాసి ఉంది.

'వి' ఫర్ విశాల.

'బి' ఫర్ !? అని బ్రాకెట్లో రాసుంది.

అతనికి నవ్వొచ్చింది,

అయితే తమ మీద కూడా దుమారం లేచిందన్నమాట!

ఇదంతా ఎవరి ఊహ?

ఎవరిదయితేనేం నలుగురి దృష్టికి వెళ్ళింది!

'ప్యూన్'ని పిలిచి ఆ కాగితం తీయించి

తన జేబులో పెట్టుకున్నాడు. ఆఫీసులోకి కాకుండా క్లాసుల తనిఖీకి బయలుదేరాడు.

ఒక్కొక్క క్లాసు ముందు నుండీ వెడుతూంటే అంతవరకు స్వేచ్ఛ గా అల్లరి చేస్తున్న స్టూడెంట్లు చప్పున సర్దుకుని, పుస్తకాలు తిరగేస్తూండి పోయేరు.

ఒక క్లాసు పక్క నుండి వెళుతూంటే బ్లాక్ బోర్డుమీద ఓ కుర్రాడు 'కార్టూన్' వేస్తూండటం కనిపించింది. మిగతా విద్యార్థులు కేరింతలు కొడుతూ, గుంపుగా చేరి చూస్తున్నారు.

వాళ్ళు తనను గమనించకుండా, వెనకగా నిలబడి చూశాడు భానుమూర్తి.

అది తన జేబులో ఉన్న కార్టూన్‌కి ప్రతి రూపమే!

గట్టిగా చప్పట్లు కొడుతూ "వెరీ గుడ్ ఆర్ట్" అన్నాడు భానుమూర్తి.

ఒక్కమాటు ఉలిక్కిపడి వెనక్కి చూశారు అందరూ.

బొమ్మ వేసిని కుర్రాడు దిమ్మెరపోయి పాలిపోయిన మొహంతో వణికి పోతూ నిలబడ్డాడు. అప్రయత్నంగా చేతిలోంచి చాక్‌పీస్ జారిపోయింది.

విద్యార్థులు ఎక్కడి వాళ్ళక్కడ తమ సీట్లలోకి వెళ్ళి కూర్చున్నారు.

"వాటీజ్ యువర్ నేమ్ ప్లీజ్?"

"శేఖర్ సర్..."

"ఫాలోమీ" బయటకు దారి తీశాడు భానుమూర్తి.

శేఖర్ బిక్క చచ్చినట్లు అతని వెంట నడిచేడు.

అది విశాల తీసుకోవలసిన క్లాసు!

ఆమె అప్పుడే ఎదురు వస్తోంది.

భానుమూర్తిని చూడగానే మందహాసంతో విష్ చేసింది. గంభీరంగా తల పంకించి తన ఆఫీసుకేసి వెళ్ళిపోయేడు.

విశాల క్లాసులోకి అడుగుపెట్టింది.

స్టూడెంట్స్ రాతి బొమ్మల్లా కూర్చుని ఉండటం, ఒకళ్ళమొహాలు ఒకళ్ళు చూసుకోవటం వింతగా తోచి, అప్రయత్నంగా బ్లాక్‌బోర్డు వైపు చూసి దిమ్మెరపోయింది.

ఒక్కమాటు రక్తం అంతా ఎగజిమ్మినట్టు, కోపంతో మొహం కందగడ్డ అయింది.

క్లాస్ వైపు తిరిగి "ఎవరు వేసారిది?" అంది తీక్షణంగా చూస్తూ.

"శేఖర్ వేశాడు మేడమ్! ప్రిన్సిపాల్ గారు వెంటబెట్టుకెళ్ళారు" అని సమాధానం యిచ్చాడు ఒక విద్యార్థి లేచి నిలబడి.

"వైప్ యిట్ అవుట్" అంది డస్టరు ముందుకి నెడుతూ,

అతను వచ్చి తుడిచేశాడు.

ఆమె 'మూడ్' పాడయిపోయింది.

పాఠం చెప్పడానికి మనస్కరించ లేదు.

"సెల్ఫ్‌స్టడీ చేయండి! పది నిమిషాల్లో వస్తాను–" అంటూ ప్రిన్సిపాల్ గదికేసి వెళ్ళింది.

ఆమె లోపలికి వెడుతూండగా శేఖర్ బయటకు వస్తూ ఆమెని చూసి, సిగ్గుతో తలదించుకు వెళ్ళిపోయేడు.

అతన్ని చూడగానే ఆమెకు ఉప్పెనలా ఆవేశం పొంగింది. బలవంతాన నిగ్రహించుకుని, లోపలికి నడిచింది.

భానుమూర్తి ఆమెకేసి ఆశ్చర్యంగా చూశాడు.

"అతన్ని వెంటనే 'సస్పెండ్' చెయ్యండి..." అంది సుడిగాలిలా ప్రవేశిస్తూ.

"అయామ్ సారీ విశాలా" చాలా శాంతంగా చెప్పాడు భానుమూర్తి.

"ఎందుకని?" అంది హఠాత్‌గా ఆగిపోయి. ఆమె మొహంలో విభ్రమం అలముకుంది.

"అలా చెయ్యడం నిరంకుశత్వమౌతుంది!"

"నిరంకుశత్వమా?!"

"అవును! శిక్ష ఉద్దేశం ఎప్పుడూ మానసిక పరివర్తనకు, పశ్చాత్తాపానికి సహకరించేదిగా ఉండాలి..."

"మీరే ఒకప్పుడు ఆడిటోరియమ్‌లో అల్లరి చేసిన ముగ్గురు విద్యార్థుల్ని సస్పెండు చెయ్యాలని ప్రిన్సిపాల్‌గారిని బలపరిచారు..."

"గుర్తుంది!కానీ, గాడిదల్నీ, గుర్రాల్నీ సమదృష్టితో చూడలేం! శేఖర్ అల్లరివాడేగానీ, దుర్మార్గుడు కాడు..."

ఆమె మౌనంగా ఉండిపోయింది ఒక నిమిషం.

"ఇది నా వ్యక్తిగత అవమానంగా భావిస్తున్నాను! మీరు అతణ్ణి శిక్షించని పక్షంలో నాకు మనశ్శాంతి ఉండదు. నా విధుల్ని సక్రమంగా నిర్వర్తించలేను.."

"ప్లీజ్ విశాలా! తప్పులు చేయటం మానవనైజం. మనం చేసే తప్పుల్ని ఒకరు భరించాలని ఎలా కోరుకుంటామో, యితరుల తప్పుల్ని కూడా మనం అలాగే భరించడానికి అలవాటుపడాలి.."

ఆమె చివాలున తలెత్తింది.

"నేను మనిషిని. మామూలు మనిషిని! నాకు బాధ, అవమానం, కోపం ఉంటాయి. వాటిని చంపుకుని మహాత్మురాలినని పించుకోవాలన్న పేరాశ లేదు.." గబగబా బయటకు వెళ్ళిపోయింది. భానుమూర్తి ఆమె వెళ్ళిన వైపే చూస్తూండి పోయేడు.

* * *

ఫోను మ్రోగింది.

"హల్లో..."

"ఎవరు-భానుమూర్తేనా మాట్లాడేది? నేను.. ఆనందరావుని..."

"ఓ... మీరా, నమస్కారం సార్! ఏమిటి విశేషాలు?"

"అంతా మామూలేగానీ, ఏమిటి కాలేజీలో గొడవ అయిందిట? ఎవరో కార్టూనిస్టు విశాల మీద దుష్ప్రచారం చేస్తూ బొమ్మలు వేశాట్ట?!"

"ఓహ్ అదా?" అని నవ్వేసి "కాలేజీలో ఇలాంటివన్నీ మామూలు! కుర్రాళ్ళ కదొక హాబీ నేను అతణ్ణి మందలించాను లెండి. చాలా బాధపడ్డాడు అతను కూడా"

"అలాగని ఊరుకుంటే అలుసు కాదూ?"

"అలాంటి ప్రమాదం ఉండదులెండి!"

"కానీ, మా విశాల ఊరుకోవటంలేదే! ఆ కుర్రాడిని శిక్షించాలని పట్టుబడుతోంది"

ఒక క్షణం ఊరుకుని "నేను ఆవిడకు నచ్చచెబుతాలెండి" అన్నాడు.

ఆనందరావు గొంతు తగ్గించి "ఏమ్మా అతను నీకు విషయమంతా అర్థమయేలా చెబుతాట్ట" అనడగటం విన్పించింది. ఒక నిమిషం మాట్లాడిన తర్వాత "ఇవ్వాళ కాలేజీకి రాదుటలే! సాయంత్రం నువ్వే రాకూడదూ? మనం కలుసుకుని కూడా చాలా రోజులయింది" అడిగేడు.

"సరే-అలాగే వస్తాను" ఫోను పెట్టేశాడు భానుమూర్తి.

* * *

సాయంత్రం భానుమూర్తి వెళ్ళేసరికి విశాల 'రేడియో గ్రామ్'లో పాటలు

వింటూ కూర్చుని ఉంది.

అతణ్ణి చూడగానే చటుక్కున కట్టేసి, "రండి" అంటూ ఆహ్వానించింది.

భానుమూర్తి ఆమెకేసి రెప్ప వాల్చకుండా చూశాడు.

అంతకు మునుపే స్నానం చేసినట్లు తాజాదనం స్పష్టంగా కన్పిస్తోంది. నీలం పువ్వులున్న తెల్లచీర, దానిమీద నీలం అంచు ఉన్న తెల్ల బ్లౌజు, బర్మాముడి, చేతులకు తెల్ల గాజులు-సిగలో సన్న జాజుల దండ వెదజల్లుతున్న కమ్మని పరిమళం- అతను అలాగే ఉండిపోయేడు.

"ఏదన్నా మాట్లాడండి" అంది విశాల

అనుచితంగా ఉంటుందేమోనని- "మీ మామయ్యగారెక్కడికెళ్ళారు?" అన్నాడు ఏదో మొక్కుబడికోసం మాట్లాడుతూ.

"ఏదో మీటింగు కెళ్ళాడు. ఎనిమిది దాటాక తనకోసం కూర్చోకుండా మనిద్దర్నీ భోజనం చేసెయ్యమన్నాడు"

"భోజనమా?! మళ్ళీ ఆ చాదస్తాలన్నీ ఎందుకు?" అయిష్టంగా మొహంపెట్టాడు.

విశాల గలగల నవ్వింది.

"మా వంట మనిషి మిమ్మల్ని బాగా బెదరకొట్టేసిందనుకుంటాను. భయపడకండ. ఈ రోజు నేనే వంట చేశాను. తిన్నాక ఓ సర్టిఫికెట్టు కూడ యివ్వాలి మీరు"

"అరే...మీకు వంట చెయ్యటంకూడా వచ్చా!?" ఆశ్చర్యంగా అడిగేడు, భానుమూర్తి.

"అంటే మీ ఉద్దేశ్యం? చదువుకున్న ఆడవాళ్ళకి వంట తెలియదనా?" ఎదురు ప్రశ్నించింది.

"అని కాదు! మీరు ఉద్యోగం చేస్తూ కూడ వంట చెయ్యగలరంటే కాస్త ఆశ్చర్యం కలిగిందిలెండి" సర్దుకున్నాడు మెల్లగా.

"సరేలెండి ఆ విషయం వదిలేద్దాం... ఇంతకీ మీకు నా మీద కోపం తగ్గినట్లేనా?"

"మీ మీద నాకెందుకు కోపం?"

"శేఖర్‌ని సస్పెండ్ చెయ్యనందుకు."

ఒక నిమిషం మౌనంగా వుండిపోయింది.

"ఈ రోజంతా ఆలోచించాను. మీరు చెప్పిందే రైటనిపించింది. 'పనిష్‌మెంట్' పేరుతో విషయాన్ని మరింత పెద్దది చేసి నలుగురి దృష్టికి తేవడంకన్నా, మంచి తనంతో గెలవటమే ఉత్తమం."

"చాలా థాంక్స్ విశాలా! అయామ్ రియల్లీ గ్లాడ్"అన్నాడు ఎంతో ఆనందంగా భానుమూర్తి.

"ఉట్టి పుణ్యానికి మనమీద యీ దుమారం ఎలా లేచిందసలు?" సందేహం తీరక అడిగింది.

"నా ఊహ ప్రకారం మీ కంట్లో నలక ఊదుతున్నప్పుడు ఎవరో చూసి అపార్థంతో ప్రచారం చేసుండాలి."

ఆమెకు చటుక్కున ఆ సంఘటన స్ఫురించింది.

నిజమే!

తమకు తెలియకుండా, ఎవరయినా దూరంనుండీ గమనిస్తే అలా అపార్థం చేసుకోగల అవకాశం లేకపోలేదు.

"మీరన్నట్లే జరిగి వుంటుంది.లేనిపోని గొడవలో యిరుక్కున్నామే! ఇలాంటి గాలి వార్తలు పుట్టాలేగానీ, వాటిని తొలగించడం మన శక్యం కాదు."

"వాళ్ళ ఊహలు తారుమారు చేసేలా ప్రవర్తిసే సరి!"

అర్థం కానట్లు చూసింది.

"ఎలా?"

"ఎలాగయినాసరే-వాళ్ళకి మనపట్ల గల దురభిప్రాయాన్ని తొలగించగలగాలి..."

"నన్ను మీరు బలవంతంగా లాక్కొచ్చి సంఘం అనే మురికి చెరువులో ముంచారు. ఎందుకలా చేశారు? నన్నిలా చిత్రవధ చెయ్యటానికా?"

"విశాలా!" దెబ్బతిన్నట్లు చూశాడు.

ఆమె తన ధోరణిలో సాగింది.

"ఇన్నాళ్ళూ తామరాకుమీద నీటి బొట్టులా, ఒకరితో ప్రమేయం లేకుండా నాలో నేను బ్రతుకుతున్నదాన్ని. నామీద మీరు పంతంపట్టారు. నన్ను ఓడించాలనుకున్నారు. అవునుకదూ?"

"నన్ను అపార్థం చేసుకుంటున్నావు విశాలా!" వారించబోయాడు.

"మీరు ఎదుటివాళ్ళని అర్థం చేసుకున్నారుగనుకనా, మీరు అర్థం కావటానికి! నామీద ప్రయోగాలు చేశారు కదూ? నిజం చెప్పండి. ఆత్మవంచన నాకిష్టం వుండదు. మీరు నాపట్ల చూపే దంతా నిజమైన ఆత్మీయతేనన్న భ్రమ నుండి నన్ను బయటపడనివ్వండి."

భానుమూర్తి బాధగా తల పట్టుకున్నాడు.

"జీవితానికి నా నిర్వచనం ఎడారి! అందులో వెన్నెల వుందనీ, మల్లెలు పూయించవచ్చనీ మీ ప్రవర్తనతో విశ్వాసం కలిగించారు. ఎవరినీ నమ్మకూడదని శపథం తీసుకున్న నేను-మీరు ప్రదర్శించిన నిజాయితినీ, ఔన్నత్యాన్నీ మనసారా నమ్మాను. కానీ,మిగిలిందేమిటి? నాకు అడుగులు వెయ్యడం నేర్పించి, మీరు వాయువేగంతో పరుగెడుతూంటే అసహాయంగా నిలిచిపోవటం!"

పేలవంగా నవ్వాడు భానుమూర్తి.

"నేను దీపం వెలిగించుదామని ఆశపడ్డానేగానీ-వేళ్ళు కాలతాయని ఊహించలేకపోయాను" బాధగా అన్నాడు.

"ఆ వెలిగించిన దీపం ఆరకుండా చూసే బాధ్యత మీకు లేదుకదూ?"

"పూజారి బీదవాడు విశాలా! అన్నింటినీ పోగొట్టుకున్న అదృష్టహీనుడు. ఈ స్థితిలో తాను వెలిగించిన దీపం మలిగిపోకుండా చేతులడ్డి కాపాడగలడేమోగానీ, జీవనజ్యోతిగా నిలుపుకుని తన బ్రతుకులోని చీకట్లు పారద్రోలలేడు.. నన్ను మన్నించు. వస్తాను.."

వెళ్ళటానికి సిద్ధమయ్యాడు.

"ఆగండి.." హిస్టీరిక్‌గా అరిచింది విశాల.

విస్మయంగా చూశాడు భానుమూర్తి.

ఆమె చరాలున గోడకున్న తుపాకి అందుకుని, భానుమూర్తి సమీపానికి వెళ్ళింది.

అతను కనుబొమలు ముడిచి, ఆమె వింత ధోరణిని గమనిస్తూ, అలాగే నిలబడి పోయేడు.

ఆమె అతని కెదురుగా కొన్నిక్షణాలు ఉద్వేగంతో మాటలు పెగిలిరాక, కంపిస్తున్న పెదవులతో చూస్తూండిపోయింది.

"ఏమిటిది విశాలా?" అన్నాడు భానుమూర్తి తేరుకుంటూ.

"నా సమస్యకి పరిష్కారం! ఇదుగో.. అందుకోండి.." ముందుకు జాచింది, తుపాకిని.

యాంత్రికంగా అందుకున్నాడు భానుమూర్తి.

"దేనికిది!" అయోమయంగా చూస్తూ ప్రశ్నించాడు.

"ఒక కొండను పగలుకొడితే గానీఒక నిర్మాణం జరగదు! ఒక గుండెను బ్రద్దలు

చేస్తేనేగానీ కొన్ని జీవితాలకు ఉన్నతి కలుగక పోవచ్చు... నేను మీ ఉన్నతి కోరుకుంటున్నాను.." కళ్ళలో నీళ్ళు చిందుతున్నాయి.

అతని చేతుల్లోంచి తుపాకీ జారి పడింది.

"విశాలా..." ఆర్తిగా చేతులు జాచేడు.

ఒక్క ఉదుటున వెళ్ళి అతని గుండెల కంటుకు పోయింది విశాల.

దుఃఖ వివశత్వంతో, సంతోష సంభ్రమాలతో, విచిత్ర అనుభూతులకు గురవుతూ వెక్కి వెక్కి ఏడ్చేసింది?

కొద్ది క్షణాలు ఓదార్పుగా వెన్ను తడుతుండి పోయేడు భానుమూర్తి.

"ఊరుకో విశాలా... ఊరుకో... నేను ఓడిపోయాను.. నువ్వే గెలిచావ్.." సముదాయింపుగా అన్నాడు.

అతన్నలా హత్తుకునే తలపైకెత్తి చూసింది విశాల.

"ఎందుకలా అబద్ధాలు చెబుతారు? శిల లాంటి నన్ను శిల్పంచేసి జీవం పోసిందెవరు? ద్వేషాన్ని నాలోంచి తరిమేసి అనురాగం నింపిందెవరు? అదంతా మీ విజయం కాదూ?"

ఆప్యాయంగా ఆమె కన్నీళ్ళు తుడుస్తూ "అవును... ఆ నేరాలన్నీ చేసింది నేనే" అన్నాడు నవ్వుతూ భానుమూర్తి.

చప్పట్లు కొడుతూ లోపలికి వచ్చాడు ఆనందరావు.

ఇద్దరూ ఉలిక్కిపడి ఆయన్ని చూశారు.

"సారీ! నేను వచ్చి అయిదు నిముషాలయింది. తుపాకులతో 'కథ క్లైమాక్స్'లో ఉండటం గమనించి బయటే ఆగిపోయేను! కథ సుఖాంతం అయింది గనక ఇక నాకేదిగులూ లేదు.." తాపీగా సోఫాలో కూలబడ్డాడు.

విశాల వంటింటివైపు పరుగెత్తింది సిగ్గుతో.

ఆయనకెదురుగా కూర్చుని అన్నాడు భానుమూర్తి—

"ఆనందరావుగారూ! ఈ వ్యవహారంలోకి పట్టుదలతో దిగుతున్నప్పుడే నాకు సందేహం కలిగింది, చివరకిలాంటి పరిణామం కలుగవచ్చని. అయినా, ఎంతో జాగ్రత్తగానే ఉన్నాను.

"విశాలను మామూలు ప్రపంచంలోకి తీసుకురావాలన్న మీ ప్రగాఢ వాంఛతో నన్ను ప్రోత్సహించక పోతే బహుశః ఇలా జరిగి ఉండేది కాదు.."

ఆయన మొహంలో పశ్చాత్తాపం కన్పించింది.

"భానుమూర్తీ! నాకు కొన్ని విషయాలు ఇటీవలే తెలిసినాయి. మొదట కొంచెం ఆశాభంగం చెందినా, నీ అంతరంగ స్వేచ్ఛను అడ్డుకోవటం వెర్రితనమని గ్రహించి మనసులోనే ఆశీర్వదించాను. ఇది జీవితం నాయనా! ఏడవటం తెలిసిన తర్వాతే, నవ్వడం తెలుస్తుంది."

ఆయన పరోక్షంగా అన్నమాటలు ప్రతిమకు, తనకు మధ్య ఏర్పడిన అనుబంధం గురించి తెలియడం వల్లనేనని అర్థమయింది భానుమూర్తికి. అంతలో విశాల తిరిగి వచ్చింది.

ఆమెకేమీ బోధపడలేదు. గంభీరంగా ఉన్న వాళ్ళిద్దరినీ మార్చి మార్చి చూస్తూ "ఇప్పటికే ప్రొద్దెక్కింది భోజనాలు చేద్దాం పదండి.." అంది.

"అవునవును. త్వరగా వడ్డించు" అంటూ లేచాడు ఆనందరావు.



# డాక్టర్ ముద్ర

ఆర్నెల్లపాటు విరామం లేకుండా ప్రేమించుకున్న ప్రమీల, ప్రకాశ రావు పెళ్ళి చేసుకున్నారు. మూణ్నెల్ల తర్వాత ప్రకాశరావు ఉద్యోగరీత్యా అనంతపురం నుంచీ హైదరాబాద్ తరలి వచ్చి కొత్త కాపురం పెట్టాడు.

అదృష్టవశాత్తు అన్ని సౌకర్యాలు ఉన్న ఇల్లే అద్దెకు దొరికింది. దురదృష్టం ఏమిటోగానీ రాజధాని నగరంలో అడుగు పెట్టిన అయిదవరోజే ప్రమీలకి ఎడా పెడా జ్వరం కాసింది. అది తగ్గేక



రెండ్రోజులు తల నొప్పి, ఓ రోజు వాంతులు కూడా అయ్యాయి.

కారణం అంతుబట్టని ప్రకాశరావు కంగారుపడి ప్రమీలని ఒక ప్రైవేటు నర్సింగ్ హోమ్‌కి తీసికెళ్ళాడు. బొద్దుగా ముద్దావతారంలా వున్న డాక్టరుగారు ప్రమీలని స్టెతస్కోపుతో గుండెలు, పొట్ట, వీపు పరీక్ష చేశాడు. నాడీ పట్టుకు చూశాడు. చివరికి టేబిల్ సొరుగు లాగి ఆకుపచ్చ ఇంకు పిడివున్న రబ్బరు స్టాంపు తీసి ప్రమీల పొట్టమీద ముద్రవేసి "మరేం భయం లేదు...ఇక మీరు వెళ్ళొచ్చు" అన్నాడు.

తేసేమిటో వివరం తెలియక అయో మయంగా డాక్టరుగారి గదిలోంచి బయ టకు వచ్చిన ప్రమీల, ప్రకాశరావుకి ఓ కుర్ర నర్సు నవ్వుతూ ఎదురయి డాక్టరు గారి పరీక్ష ఫీజు పది రూపాయలు వసూలు చేసింది.

ఇంతకీ డాక్టరుగారు ప్రమీల పొట్ట మీద వేసిన రబ్బరు స్టాంపు ముద్రలోని అక్షరాలని చదవటానికి ప్రయత్నించగా ప్రకాశరావుకి చీమ తలకాయంత వున్న ఆ అక్షరాలు ఏమిటో తెలియలేదు.

"ఆ అక్షరాలు అంత తేలిగ్గా చెరిగేవి కావు...ఇంటికెళ్ళి తీరిగ్గా చదువుకోండి" అంది కుర్ర నర్సు మందలింపుగా.

ఆటోలో ఇంటికి చేరిన తరువాత ప్రకాశరావు పక్కింటి సాముద్రికం హనుమయ్య దగ్గర పెద్ద భూతద్దం సంపాదించి ప్రమీలని పడగ్గదిలో పట్టె మంచం మీద పడుకో బెట్టి ఆమె పొట్ట మీది రబ్బరు స్టాంపు అక్షరాల్ని భూత ద్దంలో పరీక్షగా చదివాడు. అందులో ఇలా ఉంది—

"ఈ అక్షరాలు దూరం నుంచి కూడా స్పష్టంగా చదవ గలిగేంత పెద్దవిగా సాగినపుడు ఈమెను మా నర్సింగ్ హోమ్‌లో చేర్పించండి."

—వినూత్న

# కుడిభుజం

రంగనాథం భార్య పర్వతమ్మ పోయిందని తెలిసి, వాడిని పరామర్శించడానికి వెళ్ళాను.

వరండాలో పడక్కుర్చీలో శాలువా కప్పుకుని పడుకుని ఉన్నాడు రంగనాథం.

"ఐ యామ్ సారీ రంగా! నీ భార్య పోయిందని ఇవాళే నాకు తెలిసింది! ఏం చేస్తాం? విచారించకు. మన చేతుల్లో ఏం లేదు! అంతా భగవంతుడి లీల!" సానుభూతిగా అన్నాను—సభ్యతకోసం.

"కూచోరా రాఘవా! నువ్వన్నట్లు మన చేతిలో ఏముంది. దానికి పిలుపు వచ్చింది! వెళ్ళిపోయిందీ కానీ, పర్వతం చనిపోవడం...నా కుడిభుజం విరిగినంత పనైందోయ్!" అన్నాడు నీరసంగా.

నేను ఆశ్చర్యపోయాను!

ఎందుకంటే, వాడికి పెళ్ళయిన రోజు నుండీ సుఖం లేదు! ఆనాటినుండీ వీడిని ఎప్పుడూ నోరెత్తనీయకుండా చేసి, తనే మకుటంలేని మహారాణిలా వెలిగిపోయేది పర్వతమ్మ. అసలే దాదాపు చిన్న సైజు ఏనుగులా ఉండే ఆవిడ ధాటికి వీడు ఆగలేకపోయేవాడు. అలాంటివాడు భార్య పోవడం...తన భుజం పడిపోయినంతగా బాధపడుతూ ఉన్నాడంటే నాకు అసలు నమ్మకం కలగడం లేదు.

"అదేమిట్రా రంగా! మీ యిద్దరికీ అసలు అన్యోన్యత లేదు. పైగా ఆవిడ నిన్ను అస్తమానం కాల్చుకు తినేది! అలాంటిది, ఆవిడ పోగానే నువ్వు నీ మీద ఏదో బరువు బాధ్యతలు పడినట్లుగా..."

"నిజంగానే బాధ పడుతున్నానురా రాఘవా! పది మందిలో మా విషయం తెలియకూడదని..." నేను వాడి ఆలస్యాన్ని భరించలేకపోయాను!

"ఏమిట్రా! అసలు విషయం వదిలేసి ఏదో సొద చెప్తున్నావు!" అన్నాను

వాడు వెంటనే శాలువా తీసేశాడు.

వాడి కుడి భుజానికి బాండేజీ ఉంది?

"ఏమిట్రా అది" ఆత్రంగా అడిగాను.

"చెప్పానుగా! ఇతరులు అపార్థం చేసుకోకూడదనీ, మరి ఇక గత్యంతరం లేక ఆవిడ శవాన్ని మోయడానికి నేనూ ఒక చెయ్యి వేయాల్సి వచ్చింది. నా



లాంటి అర్భకుడు ఆ మహా కాయాన్ని మోయడం సాధ్యమయే పనేనా? 'ఇంకా మీ చేతి ఎముకలు విరగలేదు. చెయ్యి బెణికింది. అంతవరకూ మీది అదృష్టమే!' అన్నాడు డాక్టరు. మరి యిప్పుడు అర్థమైందా..."

—కె. వెంకటేశ్వర్లు

# నిజాయితీ

'అబ్బా' అనుకున్నాడు సన్యాసిరాజు. కాలివేపు చూసుకోబోయాడు. సాధ్యం కాలేదు. బస్సునిండా జనం. కిందికి చూసినా కాళ్ళు కనపడటంలేదు! అలాగే ఊరుకుందామంటే కాలిలో ఏదో గుచ్చుకుంటోంది-మడమ దగ్గరగా.

అలాగని ఎక్కువసేపు ఓర్చుకోలేకపోయాడు. ఏదయితే అయిందని అతి కష్టంమీద కాలు పైకెత్తాడు. అయితే అంతవరకూ కాలిలో గుచ్చుకుంటున్నది-రాయో, ముల్లో కాదు-బంగారు చెవి రింగు! రెండొందలన్నా ఖరీదు చేస్తుంది' అనుకున్నాడు మనస్సులోనే. గుప్పెట్లో బిగించి పట్టుకు నిలబడ్డాడు,

'అన్యాయం! ... అది ఎవరు పారేసుకున్నారో ఏమో! కనుక్కొని యిచ్చెయ్' అంటోంది ఓ వైపునుంచి మనసు.

రెండు నిమిషాల తర్వాత, అతని పక్క నిలబడ్డ వ్యక్తి తననే పరిశీలనగా చూస్తున్నట్టనిపించింది అతనికి.

"అంతేనండీ! దొరికేదాకా ప్రతివాడూ పెద్దమనిషే! దొరికితేనే దొంగలు.."

వెనకనించి ఎవరో ఇంకెవర్తోనో గట్టిగా మాట్లాడుతున్నాడు. గతుక్కుమన్నాడు సన్యాసిరాజు.

'ఎందుకొచ్చిన రిస్కు? మనది కాని సొమ్ము కోసం, బయట పడితే పరువు దండగ...'

"కండక్టర్..." పిలిచాడు. కండక్టర్ రాగానే, చేతిలో రింగు అతనికిస్తూ అన్నాడు "ఎవరిదో పడిపోయింది. కాలి కింద దొరికింది". ఆడ వాళ్ళందరూ కంగారుగా తమ చెవులు సర్దుకున్నారు. ఎవరిదీ పోలేదు,

"ఇంతకు ముందు ట్రిప్పులో ఎవరో పారేసుకునుంటారెండి. నే కనుక్కుంటాను" అన్నాడు కండక్టర్ - దాన్ని బాగ్‌లో వేసుకుంటూ.

"అతనికెందుకిచ్చారు సార్! మింగేసాడు. మీరే అడగాలిసింది ఎవరన్నా పోగొట్టుకున్నారేమో" పక్కనున్న అతను అన్నాడు.



"మన నిజాయితీ మనకుంటే చాలండీ, వాడు తినేస్తే మనమేం చేస్తాం" ఇంకో వ్యక్తి కామెంట్ చేశాడు. సన్యాసిరాజు ఛాతీ నాలుగంగుళాలు పెరిగింది.

బస్సు దిగి ఆఫీసుకి పోయిన పావుగంటలోపే సన్యాసిరాజుకి టెలిఫోన్ వచ్చింది. హడావిడిగా వెళ్ళి రిసీవర్ తీసుకున్నాడు. అతని భార్య మాట్లాడింది-

"నేనండీ! రత్నాన్ని. మొన్న మీతో నా చెవిరింగు...వంకరపోయింది బాగుచేయించుకు రమ్మన్నాను చూడండి...అది... ఉదయం మీరు ఆఫీసుకి బయల్దేరేముందు మీ పాంటు జేబులో వేశాను. చెప్పాలను

కుంటూనే మర్చిపోయాను. మీరు వెళ్ళాక గుర్తొచ్చింది. వెంటనే తీసుకుని సాయంత్రం వచ్చేటప్పుడు బాగుచేయించుకురండి కాస్త..."

—పి. వి. ఆర్. శివకుమార్

# బీరుబలం

ప్రియా బారులోకి ప్రవేశించిన పావన మూర్తి, పూర్ణచంద్రం బీరు క్వాలిటీల చర్చలోకి దిగారు. క్వీన్ బీరు మంచిదని పావనమూర్తి వాదన. కింగ్ బీరు శ్రేష్ట మైందని పూర్ణచంద్రం దబాయింపు.

వంట్లోని వేడిని తగ్గించి శరీరాన్ని చల్లబరిచి హాయిగా నిద్రపట్టేలా చేస్తుంది క్వీన్ బీరు అంటాడు పావనమూర్తి. జీర్ణ శక్తిని పెంపొందించి మనిషి బాగా వళ్ళు చేసి యాపిల్ పండులా రంగు వచ్చి నవనవలాడేలా చేస్తుంది కింగ్ బీరు అని బుకాయిస్తాడు పూర్ణచంద్రం.

వాళ్ళిద్దరూ కాసేపలా వాదించుకుని, జగడంలోకి దిగి, చివరికి చొక్కా చేతులు మడచి, చేయి చేసుకునే వరకు వచ్చింది వ్యవహారం. బార్ యజమాని పరిస్థితిని గమనించి, వాళ్ళదగ్గరికి వచ్చి సౌమ్యంగా "మిత్రులారా! ఏ బీరు మంచిదనే విషయం కండ బలంతో తెల్చుకోవలసింది కాదు. ఇద్దరూ దబ్బెట్టి పందేలు కలుపుకోండి. ఆ రెండు బీరు సీసాల్లోంచి శాంపిల్స్ తీసి ప్రక్క వీధిలో వున్న కెమికల్ ఎనాలిసిస్ దగ్గరికి పంపుదాం. ఏది మంచిదో అతనే తేల్చి చెప్తాడు కదా!" అన్నాడు.

అతని సలహా ఇద్దరికీ నచ్చింది. వంద వంద పందెం కలుపుకున్నారు. రెండు రకాల బీరు సీసాల్లోంచి కొద్దికొద్దిగా బీరు శాంపిల్ తీసి చిన్న సీసాల్లో పోశారు. క్వీన్ బీరు శాంపిల్ పోసిన సీసామీద 'క్వూ' అనీ, కింగ్ బీరు శాంపిల్ పోసిన సీసామీద 'కె' అనీ అక్షరాలు గుర్తులు పెట్టి కుర్రాడికిచ్చి పరీక్ష చేసేందుకు పక్కవీధి కెమికల్ ఎనాలిసిస్టు దగ్గరికి పంపారు.

గంట తర్వాత కుర్రాడు రిపోర్టు కాయితం తీసుకొచ్చి ఇచ్చాడు. రిజల్టు తెలుసుకునేందుకు అందరూ ఆసక్తిగా, గుంపుగా చేరారు. వంద తమలో ఎవరు



గెల్చుకుంటారోనని ఆతృతగా ఎగబడ్డారు పావనమూర్తి, పూర్ణచంద్రం.

ఆ రిపోర్టు కాగితంలో ఇలా వుంది.

"మీరు పంపిన రెండు శాంపిల్స్ సీసాలను టెస్టు చేశాను. 'క్వూ' సీసాలోని మూత్రం తాలూకు వ్యక్తికి షుగర్ కంప్లయింటుంది. 'కె' సీసాలోని మూత్రం తాలూకు స్త్రీ గర్భవతి".

—సి. వి. లత

# బాక్స్ నంబర్

రామకృష్ణ వయసు ముప్ఫయి. బాగా చదువుకున్నాడు. మంచి ఉద్యోగంలో వున్నాడు. అయితే అతని ఆశలకి, ఆశయాలకి తగిన అమ్మాయి ఎక్కడా కనిపించకపోయేసరికి రామకృష్ణ పెళ్ళిని వాయిదా వేసుకుంటూ వస్తున్నాడు. బంధువులలో పిల్లకోసం వెదికాడు.

కులం, మతం దేనితోటీ ప్రమేయం లేకుండా దేశం మొత్తం మీద పెళ్ళి కూతురు లభిసుందేమోనని గాలించాడు. లాభం లేకపోయింది. ఇక ఒకటే మార్గమని పేపర్లో 'వధువు కావలెను' ప్రకటన ఇచ్చాడు. తన ఆశయాలు, అభిరుచులు తెలుపుతూ అర్హతవున్న అమ్మాయి ఫలానా బాక్స్ నంబర్‌కి దరఖాస్తు పెట్టుకోవచ్చని ఆ ప్రకటనలో కోరాడు. సూక్ష్మంలో మోక్షం కలుగుతుందనే ఉద్దేశంతో రామకృష్ణ 'హమ్మయ్య' అంటూ ఒక నిట్టూర్పు విడిచి 'రిప్లై'ల కోసం ఎదురు చూస్తూ కూర్చున్నాడు.

ప్రకటన వెలువడిన వారం రోజుల తర్వాత పత్రికా కార్యాలయం నుంచి ఆ బాక్స్ నంబర్‌కి వచ్చిన ఒకే ఒక కవర్ రామకృష్ణకి అందింది. దేశం మొత్తం మీద తనకి తగిన అమ్మాయి ఒకర్తైనా వుందని రామకృష్ణ కవర్ తెరిచాడు. లోపల అన్ని వివరాలతోనూ వున్న ఉత్తరం చదివేసరికి రామకృష్ణకి గుండె ఆగినంత పనయింది.

ఎక్కడో దూరంగా వేరే ఊళ్ళో వున్న రజని అనే అమ్మాయి తన అర్హతలు తెలుపుతూ పెట్టుకున్న అప్లికేషన్ అది. రజని చదువుకుంది. ఉద్యోగం చేస్తూ హాస్టల్‌లో వుంటోంది. అయితే తన అభిరుచులకి తగిన వరుడు దొరకక ఆ అదృష్టం ఎప్పుడయినా కలగక పోతుందా అని కుమారిగానే కూర్చొంది. అలా ఏళ్ళు గడిచాయి. 'ఆ బాక్స్ నంబర్' ప్రకటన కళ్ళపడేసరికి రజనిలో పెళ్ళి కోరిక నిద్రలేచింది. వెంటనే అప్లికేషన్ పడేసింది.



అయితే ఆ అప్లికేషన్ అందుకున్న రామకృష్ణకి గుండె ఆగిపోయినంత పనవడానికి కారణం 'కుమారి రజని' వయసు కేవలం నలభై ఎనిమిది కావడమే!

—తాజ్‌ప్రసాద్

Edited, Printed and Published by Ramoji Rao Ch. for Vasundhara Publications. Printed at Colorama, Offset Printers, Hyderabad. CHATURA Telugu Monthly, Eenadu Compound, Hyderabad - 500 004.

CHATURA Telugu Monthly, Hyderabad-600 004, Regd.No. H/HD /4





ల్నుండి భానుమూర్తి.

చలపతి సీరియస్‌గా అడిగేడు.

"ఎందుకిలా వచ్చి మమ్మల్ని డిస్టర్బ్ చేశారు?"

దవడ అదిరిపోయేలా పిడికిలి బిగించి కొట్టాడు భానుమూర్తి.

ఆ దెబ్బకి కళ్ళు బైర్లుకమ్మి, వెళ్ళి నేలక్కరుచుకున్నాడు చలపతి.

నోట్లోంచి వస్తున్న నెత్తురు చూసి పిచ్చివాడిలా లేచి "బాస్టర్డ్" అంటూ మీదకొచ్చాడు చలపతి

బూటుకాలితో బలంగా డొక్కలో తన్నాడు భానుమూర్తి.

"అమ్మో" అంటూ కడుపుపట్టుకుని కూలబడిపోయాడు చలపతి.

మంగ వంటి మీద చీర కప్పుకుని, మంచందిగి ఏడుస్తూనిలబడింది.

"బట్టలు కట్టుకో మంగా!" అన్నాడు భానుమూర్తి తీవ్రంగా చూస్తూ.

వణికిపోతూ గబ, గబా కట్టుకుంది,

చలపతిని జుట్టు పట్టుకుని లేవదీసి "చెప్పు-ఎందుకిలా తీసుకొచ్చావ్ ఆ పిల్లని?" గద్దించాడు భానుమూర్తి.

"నేను తీసుకురాలేదు తనే వచ్చింది" పెడసరంగా జవాబిచ్చాడు.

వెంటనే అరచేత్తో మొహం అదిరేలా చరిచేడు.

బాధతో గట్టిగా మూలిగేడు చలపతి.

ముక్కులోంచి బొట్లు బొట్లు గా నెత్తురు కారటం మొదలయింది.

"పొద్దున నువ్వు మంగని సినిమాకి రమ్మని చెప్పలా?" కాలర్ గట్టిగా బిగించి పట్టుకుని, వెనక్కి ముందుకీ పదే పదే ఊపుతూ అడిగేడు.

చలపతికి ప్రాణం పోతున్నట్టని పించింది.

ప్రతిఘటించే శక్తి పూర్తిగాపోయింది.